# రా గ జ ల ధి

"ల త"



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

అంకితం

ఆశోపహతులైన

అదృష్టహీనులకు

## ఈ రచయిత్రి నవలలు

| | |
|---|---|
| జీవనస్రవంతి | 3–50 |
| ఎడారిపువ్వులు | 4–00 |
| నీలినీడలు | 2–00 |
| మిగిలిందేమిటి? | 1–75 |
| వారిజ | 3–00 |
| వనకిన్నెర | 3–00 |

## 5

# రాగజలధి

యుగయుగాలనుంచి ప్రవహించిపోతున్న రాగజలధికి ఆది అంతములేని అపూర్వమైన యీ రాగజలధికి అర్థం ఏమిటి? అనూచానంగా స్త్రీపురుషులకుమధ్య ప్రవహించి పోతున్న యీ ఆకర్షణావాహినికి తాత్పర్యం ఏమిటి? తరగ వెనకాల తరగగా, పరుగులెత్తే నురగగా, జీవితాన్ని సరిగ్గా ఊపిరికూడా పీల్చుకోనీకుండా అడ్డుపడుతున్న యీ రాగజలధిని ఎవరు సృష్టించారు? దీనికి అర్థంఏమిటి?

ఇన్నాళ్ళతర్వాత, యిన్నేళ్ళజీవితం అనుభవించిన తర్వాత యీ జీవనసంధ్యాసమయంలోజీవనయాత్రాపథంలో అలసిపోయి అడుగైనా ముందుకువేయలేని యీ అశక్తతలో యీ ప్రశ్న యిప్పు డతనిని వేధించటం ప్రారంభించింది. గడచిపోయిన జీవనగ్రంథంలో ప్రకరణాలు ప్రకరణాలుగా విభజింపబడిన తన అనుభవాలలో ఒక అనుభవందగ్గర అతని మేధస్సు నిలచిపోయింది.

తెరసిమెరపుల తెలితెరలవెనుకాల జన్మజన్మాంతరాల సుకృతపు సువాసనలమధ్య అతనిని విచలితుణ్ణిచేసి ఆశోపహతుడిగా నిలిపిన ఆమె ఎక్కడ? నేడేమైపోయింది? జీవితానికి అర్థం ఇదేనా?

అవును, సరస పోయింది. ఇక కనుపించదు. అందుకని తను విచారిస్తున్నాడా? ఆ విచారంలో యుండే మాధుర్యాన్నా, బరువునా తను యిప్పుడు ఆరాధిస్తున్నది? సరస విషయంలో తను పశువులా ప్రవర్తించాడు. ఆ పశుత్వపుఅను

భనము అతనికిచ్చిన ఆనందంలోనుంచి అతని మానవత్వం మేలుకుంది. మేలుకున్న ఆ మానవత్వపు మెరుగులలోనుంచి అనురాగం పొటమరించింది. సరస నతడు ప్రేమించడం ప్రారంభించాడు. ప్రేమించినతర్వాత అనుభవించడంలో ఆనందం వుందనుకొనేంత సౌకుమార్యం అతనిలో లేదు. అందుకనే అతను విమర్శలపాలైనాడుకూడా.

సరస వెలయాలు. శరీరాన్ని సౌందర్యాన్ని పెట్టుబడిగా పెట్టి మగవాడిచాంచల్యాన్ని ఆధారంచేసుకొని ఆ పెట్టుబడి మీద లాభాలుతీసేకులంలో ఆమె జన్మించింది. కాని, తప్పి జారి ఆమెరక్తంలో మహర్షులరక్తం ప్రవహించడమనే అదృష్టం లభించడంవల్ల ఆమెసంస్కారం ఆ కులానికి అతీతంగా పరిణమించింది. ఆ పరిణామంలోనుంచే అతిమానవుడైన అతనిని ఆమె ఆరాధించింది. ఆ ఆరాధన అపూర్వం. అతనినుంచి ఏ కొంచెము దాచుకోవాలనీ తనకు అనుపించనంతటి బలమైనది ఆ ఆరాధన. అందుకే అతనికి లొంగిపోయింది. అందుకే ఆమె చనిపోయింది.

ఉద్వేగము వాంఛ తప్ప యింకొకటి తెలియని ఆ యవ్వనపు కొత్తఛాయలలోదొరికిన అవకాశాన్ని అతడనుభవించాడు. అది తప్పుకూడా కాదు. ఆతర్వాత అతను ఆ విషయమై ఒకవిధంగా మరచిపోయాడనవచ్చును. అతివేగంతో గడచిపోయే కాలేజిరోజులు, అల్లరి అతనికి ఆమెను జ్ఞాపకము చేయలేదు. కాని అప్పుడప్పుడు అర్ధరాత్రపు ఒంటరిసమయాలలో, అనుభవానికివస్తున్న చిన్నచిన్న సుఖాలలో, విదియ చంద్రుని మసకవెన్నెలలో ఆమె అతనికి జ్ఞాపకమునకు

వచ్చేది. అయితే అది ప్రేమో వాంఛో అర్థమయ్యే వయసు కాని అనుభవము కాని అతనికి లేదు. అదీకాక ఆమె నుంచి తను పొందిన సుఖానికి ప్రతిఫలంగా ఆమెకి ఒకచీరకొని యివ్వడంతో తన బాధ్యత తీరిపోయిందనికూడా అత నను కొంటే అనుకొని ఉండవచ్చును. ఈ అనుకోడానికివెనకాల అతనిఅంతర్యంలో ఏమూలో స్పందిస్తూన్న అనురాగపు మిణుగురు అతనికి స్పష్టంగా కనిపించలేదు.

ఆరునెలలతర్వాత తిరిగి ఆవూరు వెళ్ళినాక అతనికి ఆమె జ్ఞాపకంవచ్చినది. ఆమెఎడల త నేదో ద్రోహంచేసిన ట్లనిపించింది. తిరిగి ఆ యింటికి వెళ్ళి సరస ఏదమ్మా అని అడిగినప్రశ్నకు సమాధానంగా వచ్చిన వాక్యాలు అతనిని దిగ్భ్రాంతుణ్ణిచేసినాయి. జీవితంలో అపూర్వరాగాలే కాదు, అపశ్రుతులుకూడా ఉన్నసంగతి అతడు గ్రహించాడు. అతను తేరుకోడానికి ఆరు నెలలుపట్టింది.

ఎవరిజీవితమూ ఒక్కసారిగా నిర్మాణంకాదు. జన్మ జన్మాంతరాల సంస్కారపు పునాదులమీద జీవనసౌధం ఆధారపడివుంటుంది. మనలో మెదిలే భావాలకు ఆశయాలకు వర్తమానపరిస్థితులే ఆధారమనుకోడం కొంతవరకుతప్పేమో! ఏ భావను చలించినా ఆ చలనానికి కారణమైన చైతన్యపు అల ఎప్పటిదో ఏనాటిదో అయివుంటుంది. ఆతర్వాత చిచ్చికొట్టి కాలంపాడిన జోలపాటలో, గతాన్ని మరచి పోయాడు కపర్ది.

పెండ్లయింది. తండ్రిఅయినాడు. కష్టాలు సుఖాలు గూడ అతని అనుభవములోనికివచ్చినయి. అప్పుడే అతనికి

ఆరణి పరిచయమైనాడు. ఆరణి- ఆశోపహతుడైన ఆరణి- జీవితంలో అన్నీ పొందికూడ ఏదీపొందలేదేమోఅని అనుమా నించే ఆరణి అతనికి మిత్రుడయినాడు. ఆ పరిచయముకూడ చాలా విచిత్రముగా జరిగినది. ఏదో ఒకక్లబ్బులో ఎవరో అతనిని పరిచయంచేశారు.

తమాషా ఏమిటంటే 'మీ యిద్దరిపేర్లు చిత్రంగా వుంటయి' అన్నాడు ఆ పెద్దమనిషి. ఆరోజునుంచి వాళ్ళిద్దరు ఆప్తులైనారు. ఒకరోజు సాయంత్రం కనకదుర్గమ్మ దేవాలయ ప్రాంగణంలో కపర్ది ఒక చిత్రమైన ప్రశ్న వేశాడు

'ఆరణీ! ప్రేమించడం ఎందుకు జరుగుతుందంటావ్?' ఆరణి కొంచెముసేపు మాట్లాడలేదు. తర్వాత 'ఆ ప్రశ్న నిన్నే అడిగివుంటే నువ్వేంసమాధానం చెప్పేవాడివి' అని ఎదురు ప్రశ్నవేశాడు. కపర్ది నిట్టూర్చి 'నిషాఅయిన ప్రేమానుభవం జీవితాన్ని వెలిగిస్తుందా ఆర్పివేస్తుందా, యీ సమస్య ఎప్పటికి తెగడంలేదు.' అన్నాడు.

'నీకు వినే ఓపికవుంటే నేను నా కథ చెప్తాను' అన్నాడు ఆరణి.

# 2

ఆరణికికూడా అప్రశంతులున్నాయా? అతనిజీవితంలో కూడా మూసివేసిన కొన్ని ప్రకరణాలు చదలుపట్టినాయా? అయివుండవచ్చును. కపర్ది మాట్లాడలేదు. ఆరణి కొన్ని క్షణాలు కండ్లుమూసుకొని గతంలోకి మనస్సుని తిప్పాడు. గోదావరికాల్వలమీాద తిరిగి ఉప్పుఅమ్ముకొనే పడవలలో

తను పనిచేసేవాడు. తనెవరో, తన తల్లిదండ్రులెవరో, తన కులమేమిటో అతనికి తెలియదు. పడవకళాసులనటము కాలవ వొడ్డున వాళ్ళకు తను దొరికాడని. తనబాల్యమంతా అఖండ గోదావరిమధ్యంలో ఉప్పుదోనెలమీదే గడిచిపోయింది. ఏ పడవకళాసో దయతలచి ఊరుదరికి పడవచేరినపుడు ఏ అమ్మనో బ్రతిమాలి కాసిని నీళ్ళుపోయించి ఒకగుక్కెడు పాలుకూడా పోయించేవాడు. ఒకొక్కప్పుడు ఊరుదరి చేరడానికి అయిదారురోజులుపట్టేది. ఆ అయిదారురోజులు అతనికి నీళ్ళుండేవికావు. పాలబదులు గంజి దొరకేది.

అదేమిచిత్రమో గంజితోనే అయినా అతనిశరీరం ఏపుగానే పెరిగింది. మూడు నాలుగుసంవత్సరాలు వచ్చిన దగ్గరినుంచి ఉప్పుబస్తాలమధ్యనుంచి పాకుతూ వెళ్లి పడవ అంచున కూర్చుని కనిపించే చెట్లనీ, నీటినీ, పక్షుల్ని పసివానికి సహజమయిన కుతూహలంతో చూస్తూవుండేవాడు.

ఆరణి అప్పుడప్పుడు నవ్వుకుంటాడు- తను పొర పాటున ఒక్కసారైనా కాలుజారి గోదావరిలో ఎందుకు పడలేదా అని.

ఆ పడవకళాసుల్లో ఒక ముసలితాత వుండేవాడు. అత నికి ఆరణిఅంటే అమితమైన ప్రేమాభిమానాలు. ఆరణిజీవి తంలో చవిచూచిన మొదటి అనురాగం ఆ తాతప్రేమ. అసలు ఆ ఉప్పుపడవలమీద జీవితమే చిత్రమయింది. పడవ ఏ పల్లెటూరిపక్కో ఆగగానే, ఎవరోఒకరు ఊళ్లోకి వెళ్లి, 'ఉప్పుపడవ వచ్చిందర్రోయ్' అని కేకపెడ్తే గ్రామస్తులంతా వచ్చి ఉప్పుకొనుక్కెళ్లటం అలవాటుగాయుండేది అప్పట్లో.

గోదావరిఒడ్డునవున్న గ్రామాలన్నీ విలక్షణమయినవి
అసలు కోనసీమే అందమయినది. సౌందర్యం పరచుకుపోయిన
ఆ ప్రదేశాలలో ఆరణిఆంతర్యం వికసించడం ప్రారంభించింది.
అతనికి అయిదుసంవత్సరాలవయస్సప్పుడు రహదారిపడవ తప్పి
పోయిన అయ్యవారు ఒకరు కళాసులచేత దయతలచబడి
ఉప్పుదోనెలో ప్రయాణంసాగించాడు. ఆయనచేతిలో ఒక
పుస్తకం వుంది. అది పుస్తకం అని యిప్పుడు తెలిసింది.
అప్పుడు తెలియలేదు. దానివంక విచిత్రంగా చూస్తూవున్న
తనని అయ్యవారు గమనించి 'ఎవర్రా చింతయ్యా యీ
కుర్రాడు?' అని ప్రశ్నించాడు.

'అమలాపురందగ్గర దొరికాడు బాబూ. ఏ తల్లి కని
పారేసిందో తెలియదు' అన్నాడు తాత.

అయ్యవారు రెండుచెవులు మూసుకొని 'శివశివ!
రత్నంలాంటిబిడ్డ. వర్చస్సు తొణికిసలాడుతోంది. మంచి
వంశంలోనే పుట్టివుండాలి' అని తన్ని దగ్గరికి పిలిచి 'ఏరా
అబ్బాయి, చదువుకుంటావా?' అని అడిగాడు. తను తలూ
పాడు. ఆయన నవ్వి తనదగ్గరవున్న విభూతిపండుతో ఆ పడవ
చెక్కమీద, అ ఆ అని వ్రాశాడు. ఆ రెండక్షరాలు అతని
దృక్పథాన్నే మార్చేసినాయి. ఆ పసివాడిమనస్సులో యీ
విశాల ప్రపంచపు అనుభవమంతా, ఆనందమంతా ఆ రెండ
క్షరాలలోనే యిమిడివుందనేభావం తళుక్కుమంది. ఏలా
గైతేనేం, ఆ పడవమీదనే బతుకుతూ పదేళ్లువచ్చేసరికి
తెలుగు చదవటం వ్రాయడం నేర్చుకున్నాడు. ఒక్కోవూరు
దగ్గర పడవ రెండురోజులు మూడురోజులు ఆగేది. ఆ రెండు

మూడురోజులలో యింకా కొన్నిఅక్షరాలు, యింకా కొన్ని వాక్యాలు, యింకా కొన్నిపుస్తకాలు అతనిలో ప్రవేశించి నాయి. పడవఆగగానే వూళ్లోకి పరుగెత్తి 'ఉప్పాదో నెవచ్చింది' అని అరుస్తూనే ఎక్కడ అక్షరాలు కనిపిస్తాయా, ఎక్కడ పుస్తకాలు దొరుకుతాయా అని వెతుక్కుంటూ వుండేవాడు ఆరణి.

అది విచిత్రమైన విజ్ఞానదాహం - ఆ దాహం ఎన్నాళ్ళకీ తీరినట్లుండదు - అయ్యవారు చెప్పినట్లు ఆరణి మంచి వంశంలోనే పుట్టివుండాలి - ఆరణికి - ఆ పేరుపెట్టిందికూడా అయ్యవారే.

అతనికి పదిసంవత్సరాలవయస్సప్పుడు ఒక విచిత్రానుభవం జరిగింది - పడవఆగగానే ఊళ్లోకి పరుగెత్తి ఉప్పాపడవ వచ్చిందని చెప్పటం తనవంతుకావటంవలన వెంటనే పడవ దిగి ఊళ్లోకి నడిచాడు తను.

ఆ ఊరు చాలా చిన్నది. ఊరిబయట కొబ్బరితోటలో ఒక ఆంజనేయస్వామి దేవాలయం ఉన్నది - ఆ విగ్రహంమొత్తంమీద తోక చాలా అందంగా ఉన్నట్లు తోచింది ఆరణికి. కాసేపు తను వచ్చినపని మర్చిపోయి ఆ తలుపులులేని గుడిలోకి దూరాడు తను.

సరిగా తనవయసువాడే ఒకకుర్రవాడు ఆ విగ్రహం వెనకాల పడుకుని నిద్రపోవటం చూచాడు. ఆ కుర్రవాడు చాలా ఖరీదుగలబట్టలు వేసుకున్నాడు - చేతులకి బంగారు మురుగులూ ఉంగరాలూ తళుక్కుమంటున్నయ్ - ఆరణికి అప్పుడు అనిపించింది - ఇతనికీ అమ్మ లేదుకాబోలు అని.

వెంటనే ఎక్కడలేని జాలి ముంచుకొచ్చింది. ఆ పిల్లవాడు తనకి పరమాప్తుడయినట్లు తోచింది.

'ఇదుగో అబ్బాయ్, ఎవరు నువ్వు? ఒంటరిగా పడు కోటానికి భయంవెయ్యట్లా?' అని తట్టి లేపాడు.

ఆ కుర్రవాడు కళ్ళునులుముకుంటూ లేచి కూర్చుని 'ఏయ్, ఎందుకు నన్ను నిద్రలేపావు?' అని ఆరణిని కసిరాడు.

' ఇక్కడ ఒంటరిగా పడుకోటానికి భయంవెయ్యటం లేదూ నీకు?' తిరిగి అదే ప్రశ్న అడిగాడు ఆరణి. ఆ పిల్లవాడు సమాధానం చెప్పలేదు.

'నీ పేరేమిటి?'

'సూర్యనారాయణ - అమ్మ సూర్యం అంటుంది.'

'అయితే నీకు అమ్మ ఉందన్నమాట' నిట్టూర్చాడు ఆరణి. అందరికి అమ్మ ఉంది; కేవలం తనకొక్కడికే అమ్మ లేదు.

'మా అమ్మను చూపిస్తా వస్తావా?' సూర్యనారాయణ అడిగాడు.

ఆరణికి అప్పుడు జ్ఞాపకంవచ్చింది, తనువచ్చిన పని. – 'ఇప్పుడు కాదు, మీ ఇల్లెక్కడో చెప్పు, కొంచెంసేపయినాక వస్తాను' అన్నాడు.

'తూర్పువీధిలో కనకాంగిమేడంటే ఎవరైనా చెప్తారు . మా అమ్మ కోప్పడుతుంది; ఇక వెడతాను' అని సూర్యనారాయణ పరుగెత్తాడు.

ఉప్పుదోనెసంగతి నాలుగువీధుల్లోనూ అరచి – తూర్పు వీధికి చేరుకున్నాడు ఆరణి.

వీధిచివర ఒక పచ్చమేడ ఉన్నది. ఆ మేడముందు నిలబడ్డాడు తను. లోపలనుంచి నృత్యధ్వనులూ, జావళీతోపాటు అందెలరవళులూ వినవస్తున్నాయ్. పదేళ్ళ ఆరణికి ఆధ్వనులు ఏదో హాయినీ ఆనందాన్నీ కలిగించినయ్. తను నేర్చుకున్న అక్షరాలకన్న - తను చదివిన కొన్ని పుస్తకాలకన్న ఈ పాట ఎంతో బాగుందనిపించింది. నీళ్ళమీద - ఉప్పొంగే వెన్నెల మధ్య - పెరుగుతున్నాగాని, అతని జ్ఞాననేత్రం ఎలా తెరుచుకుందో-అతనికళాదాహంకూడా అలాగే విస్తరించింది.

అది ఒక జన్మాంతరసంస్కారం. ఇంతలో సూర్యనారాయణ వాకిట్లోకి వచ్చి ఆరణిని లోపలికి తీసుకుపోయినాడు - ఆ ఇల్లు చాలా డబ్బుగల ఇల్లని గుమ్మందాటగానే అర్థంఅయింది - సావిట్లో ఒక అరుగులాంటిది కట్టి; దానిమీద పరుపులూ బాలీసులూ అమర్చారు.

ఒక హుక్కాగొట్టంకూడా పక్కన ఉంది - దానిమీద ఒక మధ్యవయస్కుడైన పెద్దమనిషి కూర్చుని ఉన్నాడు. అతన్నిచూసి సూర్యనారాయణ భయపడటం ఆరణి గమనించకపోలేదు. ఆ పెద్దమనిషికి కొంచెందూరంలో అదే అరుగుమీద ఒక యువతి కూర్చుని తమలపాకులకి సున్నం రాస్తున్నది. ఆమె చాలా అందంగాఉంది.

ఆమె వెడల్పాటి జరీఅంచు తెల్లచీర కట్టింది. నల్లని ముఖమల్ రవిక తొడిగింది. -అతిసన్నని నడుముకి వడ్డాణం పెట్టుకుంది. మొగాన నిలువుబొట్టు - చేతులకి నల్లగాజులతో కలిపిన బంగారుగాజులు ఉన్నయ్. చెవులకి చెంపసరాలు మెరుస్తున్నయ్.

'మా అమ్మ' అన్నాడు సూర్యనారాయణ – ఆరణిని గోకుతూ.

'మరి ఆయనెవరు?'

సూర్యనారాయణ మాట్లాడలేదు. అతనిముఖం నల్లగా కమిలిపోయింది.

'మీ నాన్నా?'

కాదన్నట్లు తలఊపాడు సూర్యనారాయణ.

'మరి?'

'నాకు తెలియదు... ఆయ నెప్పుడూ మా ఇంటికి వస్తూఉంటారు. అమ్మంటే ఆయనకి చాలా ఇష్టం'

'నాక్కూడా చాలా బాగుంది మీ అమ్మ'

సూర్యనారాయణముఖం ఆ మాటతో వికసించింది.

'అమ్మ చాలా బాగా పాడుతుంది – నాట్యంచేస్తుంది తెలుసా?'

'ఇందాక ఏవో చప్పుళ్ళు వినిపించినయ్ – అవేనా ? నాట్యం చేయడం?'

'అవును, అమ్మ ఇంతవరకూ నాట్యంచేసింది'

'నీకు ఎంత మంచి అమ్మ!'

'అమ్మ మంచిదేగాని, ఆ పెద్దవాళ్ళంటే నాకు అసహ్యం'

'ఎందుకని?'

'వాళ్ళు అమ్మమీద అధికారంచేస్తారు – అమ్మకి ఒంట్లో బాగుండకపోయినా నాట్యంచెయ్యమంటారు'

'అలా వాళ్ళంటే మీ అమ్మ ఎందుకుచెయ్యాలి ?'

'ఈ ఎండలో ఉప్పూ అని నీవు కేకబెట్టడం దేనికి?'

'అంతేనంటావా ?'

'అంతే మరి. అమ్మకి వాళ్ళు డబ్బులిస్తారు'

'డబ్బులకోసం మీ అమ్మ నాట్యంచేస్తుందా ?'

'చేస్తుంది-ఇంకా ఎందుకోకూడా వాళ్ళు చాలా డబ్బ ఇస్తారు. అమ్మ నవ్వుతూ తీసుకుంటుంది'

'వాళ్లు అంటున్నావు ఎంతమందేమిటి ?'

'చాలామంది ఉన్నారు-అందులో కొందరు అమ్మని తిడతారు-వాళ్లు వెళ్ళాక అమ్మ వాళ్ళనీ తిడుతుంది'

'నీ కిదంతా ఇష్టంలేదా!'

'లేదు. అందుకే పోయి ఆంజనేయులుగుళ్ళో కూర్చుంటాను'

మీ అమ్మతో చెప్పకపోయినావా?'

'తంతుంది'

'అయినా, మీ అమ్మ చేసేదాంట్లో తప్పేమిటి?' మా చింతయ్యతాత చాటునా మాటునా చాలాడబ్బ చాలా మందిదగ్గర తీసుకుంటాడు-వాళ్ళూ ఈయనా తిట్టుకుంటారు. కాని, నీకుమల్లే నా కెప్పుడూ కోపంరాదు' అన్నాడు ఆరణి.

'కాని అమ్మ అంటే ఊళ్లో అందరూ చులకనగా మాట్లాడతారు'

'చింతయ్యతాతఅన్నా అలాగే మాట్లాడతారు'

'కాదులే-నీ కర్థంకాదు; అదంతా ఒక గొడవ' అని చర్చ ముగించేశాడు సూర్యనారాయణ. ఏదిఏమయినా,

అరణిమనస్సులో ఆ నృత్య గీతాలు ప్రతిధ్వనిస్తూనేఉన్నాయి చాలాకాలం.

ఈ సంభాషణ జరిగిన సాయంత్రం వర్షం ప్రారంభ మయింది-పడవవాళ్ళు చాలామంది ఊళ్ళోకి వచ్చి పడుకు న్నారు. ఉప్పుపడవకాంట్రాక్టరు వెంకటసుబ్బయ్యగారుకూడా ఆరోజు ఎందుకో పడవమీద ఉన్నారు. వర్షం ప్రారంభం కాగానే-ఆయన చింతయ్యని పిల్చి, ఏదో గుసగుసలాడారు. పర్యవసానం తనూ వెంకటసుబ్బయ్యగారూ ఊళ్ళోకి నడి చారు. తాటాకులగొడుగుకింద వెచ్చగానడుస్తున్నారు వెంకట సుబ్బయ్యగారు-తను తడిసిపోతూ వెనకాల.

పోయిపోయి ఇద్దరూ పచ్చమేడ చేరుకున్నారు. వెంకట సుబ్బయ్యగారు తలుపుకొట్టారు - ఒకముసలమ్మ పొగాకుతో గారకట్టిన దంతాలుగల ఒక వికృతాంగి వచ్చి తలుపుతీసింది.

'రాత్రికి విశ్రాంతితీసుకోవాలనుకుంటున్నాం' అన్నారు వెంకటసుబ్బయ్యగారు.

'ప్రభువులు తమరాకచే మా గృహం పావన మయింది' అని అసహ్యంగా నవ్వింది ఆ ముసలిది. ఇంతలో ఎక్కడనుంచో గజ్జలచప్పుడు వినిపించింది - అరణికి ఆ శబ్దం హాయి అనిపించింది. ముసలమ్మపక్కనుంచి లోపలికి తొంగి చూశాడు - ఎక్కడో దూరంగా అత్తరువాసన.

'లోపల ఎవరో ఉన్నట్లున్నారు?' వెంకటసుబ్బయ్య గారు ప్రశ్నించారు.

'అమ్మాయి నృత్యాభ్యాసంచేస్తున్నది' ముసిల్ది జవా బిచ్చింది.

'అయితే అవకాశం ఉందన్నమాటేనా ?'

'ఎంతమాట. ప్రభువులు రావటమూ మరలిపోవట మూనా!' అని లోపలికి దారిచూపించింది ముసిల్ది.

వెంకటసుబ్బయ్యగారితోపాటు లోపలికి పోబోయిన ఆరణివంక చూసి,

'ఇక్కడుండరా కుర్రాడా. కాస్త చద్దిఅన్నం ఉంది పెడతాను - తిని ఈరాత్రికి అరుగుమీద పడుకో' అని లోప లికి నడిచింది ముసిల్ది. ఆరణి రావటం కిటికీలోంచి చూసిన సూర్యనారాయణ బయటికి వచ్చి, ఆరణిని చూసి 'ఆయ నెవరు?' అని ప్రశ్నించాడు.

'వెంకటసుబ్బయ్యగారు' అని సమాధానంఇచ్చి, ఆబగా లోపలికి చూడటం ప్రారంభించాడు ఆరణి.

'ఏమిటి చూస్తున్నావు?'

'లోపల నాట్యంసాగుతున్నదా?'

'అవును'

'ఆ ముసిల్ది ఎవరు?'

'మా అమ్మమ్మ'

వెంకటసుబ్బయ్యగారు ఆ ఇంట్లోకి ఎందుకువెళ్లారో, సూర్యనారాయణతల్లిని లోకం ఎందుకు చులకనచేస్తున్నదో నృత్యం తనని ఎందుకు ఆకర్షిస్తున్నదో ఆరణికి అర్థంఅయే సరికి మరో అయిదారేళ్ళు గడిచినయ్. ఈమధ్యకాలంలో ఆరణీ సూర్యనారాయణల స్నేహం చాలాఅభివృద్ధిపొందింది. ఉప్పుపడవలు వదిలేసి చదువుకు రాజమండ్రీ చేరిన ఆరణికి సూర్యనారాయణ చాలా సహాయంచేశాడు.

ఇద్దరూ ఒకేగదిలో ఉండేవారు. కనకాంగికి ఆరణి అంటే ఉండే అభిమానంవలన ఇద్దరికీ అయ్యేఖర్చు సూర్య నారాయణపేర పంపిస్తూఉండేది. ఆరణికి తను సహాయం చేస్తున్నసంగతి తనతల్లికి తెలియదని సూర్యనారాయణ ఉద్దేశ్యం.

ఏదిఏమయినా ఆరణికి కనకాంగిఅంటే చాలా అభిమానమూ, కృతజ్ఞతా ఏర్పడినాయి తను ఊరూ పేరూ లేకుండా పడవవాళ్ళకి దొరికాడు. చాలాకాలం పడవలమీదే బ్రతికాడు - అలాంటి చరిత్రహీనుడైన తనకి సమాజంలో ఎలాటిస్థానమూ ఉండదన్నసంగతిగ్రహించిన ఆరణి - తనని ఆదరించిన కనకాంగిఅంటే దైవంగా భావించటం ప్రారంభించాడు.

సూర్యనారాయణ అలాకాదు. అతను దరిద్రం ఎరగడు - చెడ్డదేఅయినా, అతనికి ఒక చరిత్ర ఉన్నది - అయితే, ఆ చరిత్ర చెడ్డదని అతను అపరిమితంగా బాధపడుతున్నాడు.

అతను సెలవలకికూడా ఇంటికి పోయేవాడుకాదు- ఆరణిమాత్రం ఒకసారి వెళ్ళి కనకాంగిని చూసివస్తుండేవాడు. సూర్యనారాయణకి ఇది కొంచెం కోపకారణంఅయిందికూడా.

తన తల్లిమీద ఇతని కెందుకు ఇంత అభిమానం? పాపకూపంలో జీవిస్తున్న తనతల్లిఅంటే అందరూ అసహ్యించుకుంటుంటే, ఇతనొక్కడే ఎందుకని అభిమానిస్తాడు? ఇదంతా ఏదో నాటకం అని లోలోపల విసుక్కునేవాడు సూర్యనారాయణ.

పైకి పల్లెత్తి మాటాడని సూర్యనారాయణ ఆంతర్యం ఆరణికి అర్థంకానేలేదు. అతను మామూలుగా కనకాంగిని అభిమానిస్తూనే స్కూల్ ఫైనల్ పాసయాడు.

పరీక్షలు అవగానే ఆరణి బలవంతంమీద సూర్యనారాయణకూడా ఆసారి ఊరికి బయలుదేరాడు. వాళ్ళకు తెలియకుండానే వాళ్ళల్లో యవ్వనం ప్రవేశించింది - రాగజలధి అలలుసాగడంకూడా ప్రారంభమయిందనేసంగతి గ్రహించే వయసూ, అనుభవమూ ఆ ఇద్దరికీ లేదు.

అన్నిదశలలోకీ అతివిచిత్రమైనదశ యవ్వనం - పొంగిపోయే ఆ లావాలో ఆశలూ ఆశయాలూ కోరికలూ అన్నీ కరిగి ఘనీభవిస్తాయనికూడా తెలియనంతటి నిషాని యవ్వనం మానవుడికి కలిగిస్తుంది.

సరిగా అదే నిషాలో ఆ యువకులిద్దరూ ఉన్నారు. అందులో ఒకడు చరిత్రహీనుడు; మరిఒకడికి చరిత్రేలేదు. తన చరిత్రహీనతకి ఒకడు విచారిస్తుంటే - ఇంకొకడు కనీసం అలాటి చరిత్రఅయినా తనకు లేకపోయిందే అని విచారిస్తున్నాడు. ఆ ఇద్దరూ ఇంటికి వెళ్ళారు.

కనకాంగితల్లి చుట్టకాలుస్తూ వాకిట్లోనే కూర్చుంది.

'బాగున్నావా మామ్మా?' అని ఆరణి ఆప్యాయంగా పలకరించాడు. సూర్యనారాయణకి ఆ ముసిల్ది అంటే చాలా ఏవగింపు. కనీసం దానివంక కూడ చూడకుండా లోపలికి వెళ్ళిపోయినాడు.

'చూశావా బాబూ, ఇదీ వరస. వీడిని నే నేంచేశాను? పరాయివాడివిఅయినా, నువ్వెంత ఆప్యాయంగా పలకరిం

చావు ? నా బిడ్డకడుపున పుట్టిన ఈ వేధనకి నే నెంత చేదయి నాను !' అని వాపోయింది ముసిలిది.

'సూర్యనారాయణస్వభావం అంతేలే మామ్మా, లోపలికి వెళ్ళి ఆవిడనికూడా పలకరించి వస్తాను' అని లోప లికి నడిచాడు ఆరణి.

ఎందుచేతనోగాని కనకాంగిని వరసపెట్టి పిలవడు ఆరణి. కొన్నిసంవత్సరాలక్రితం వెంకటసుబ్బయ్యగారితో ఈ ఇంటికి వచ్చిననాడు తనకి జ్వరంరావటం - ఆ జ్వరంతో ఉన్న తనని వదిలేసి పడవ వెళ్ళిపోవటం, అప్పటినుంచీ తను కన కాంగి ఆప్యాయతని చాటుగా పొందుతూ బహిరంగంగా సూర్యనారాయణస్నేహితుడుగా జీవించుతూఉండడం - అన్నీ ఆ పదిఅడుగులూ నడిచేలోపలనే ఆరణికి జ్ఞాపకంవచ్చినయ్.

కనకాంగి గదిగుమ్మానిన్ని ఆనుకుని నిలబడిఉన్నది. ఆమెమొగం చాలా దీనంగాఉన్నట్లు తోచింది ఆరణికి. పరీక్షగా ఆమెమొగంలోకి చూశాడు.

సూర్యనారాయణ తల్లిని పలకరించకుండానే తన గదిలోకి వెళ్ళిపోవటంవలన ఆమె చిన్నబోయిందని గ్రహిం చటానికి అట్టేసేపు పట్టలేదు అతనికి.

ఆరణిని చూడగానే కనకాంగి నవ్వింది. ఆరణికూడా ప్రతిగా నవ్వటంవలన ఆ విషాదచ్ఛాయలు తొలగి పోయినయ్.

'ఏమయ్యా, పరీక్షలు ఎలా వ్రాశారు ?' అని ఆప్యా యంగా ప్రశ్నించింది ఆమె.

'చాలా బాగా వ్రాశాం' అని చురుగ్గా జవాబిచ్చాడు ఆరణి.

ఆరణి ఎదిగాడు. అతనిమెడ కొద్దిగా లావయింది. అతను నవుస్తుంటే బరువుగా అడుగులుపడుతున్నయ్ - అతని కంఠస్వరంలో పూర్తిగామార్పువచ్చేసింది. కనకాంగి తనలో తనే నవ్వుకుని 'ఇదేమిటి అతన్ని ఇలా చూస్తున్నాను' అని చటుక్కున తలతిప్పేసుకుంది.

ఆరణి తెల్లపోయినాడు. అతని ఆంతర్యంలో చిత్రమైన ఒక అనుభూతి పొటమరించింది. కొన్ని సంవత్సరాలక్రితం కనకాంగి నృత్య సంగీతాలు విన్నప్పుడుకూడా తనకి ఇలాగే అనిర్వాచనీయమూ అర్థవిహీనమూఅయిన పిపాస ప్రారంభ మయింది. ఆ పిపాస ఇన్నాళ్ళూ నిద్రపోయి, తిరిగీ ఇప్పుడు మేలుకొన్నట్లు అనిపించింది అతనికి.

తలఎత్తి కనకాంగివంక చూశాడు. ఆమె అలాగే నిలబడిఉన్నది. సన్నని ఆమెనడుముకి వడ్డాణం తళుక్కు మంటోంది. గోచీపోసి కట్టిన ఆ చీర అలలు అలలుగా పిక్కల దగ్గరనించి తొడలవరకూ వ్యాపించిఉంది. వెనక నించి నగ్నంగాఉన్న ఆమెమడమలమీద పాంజేబుపట్టాలు మెరుస్తున్నయ్.

బలంగా బరువుగాఉన్న రెండురొమ్ములమధ్య కుప్పగా ఉన్న చంద్రహారం పమిటచాటునుంచి మంచుతెరమాటున చందమామలా అస్పష్టంగా కనిపిస్తున్నది. ఆమె ఫాలంమీద నిలువుబొట్టు ఎర్రగా రక్తపుచారికలా ఏదో భయాన్ని కలి గిస్తున్నది.

ఆమె స్త్రీ - అంతే

అంతే అర్థంఅయింది ఆరణికి. ఈమె ఎప్పుడూ ఇలాకని పించలేదే నాకు!' అనుకున్నాడతను.

కనకాంగికి ఇంతసేపటికి తెలిసింది తనని స్త్రీని చూచి నట్లు ఆరణి చూస్తున్నాడని. వెంటనేలోపలికివెళ్ళి గ్లాసుతో చల్లని మంచినీళ్ళు తెచ్చి ఆరణిచేతికి అందించింది ఆమె.

ఆమె అందిచ్చిన నీరు తేమగా అనిపించింది అతనికి.

సరిగ్గా అదేసమయంలో బయటికివచ్చిన సూర్యనారా యణ ఆ దృశ్యాన్ని చూసి అసహ్యించుకొన్నాడు - తల్లి వంక చురుగా చూశాడు - ఆ చూపులో అనేకభావాలు ఉన్నయ్.

చూశావా నీ బుద్ధి పోనిచ్చుకున్నావుకాదు. చివరకి ఇతన్నికూడ ఆకర్షించాలని ప్రయత్నిస్తున్నావు అన్న భావం సూటిగా కనకాంగి గుండెలకి తాకింది.

'ఎక్కడికి బాబూ!' అన్నది మెల్లిగా ఆమె.

'అబా భూషయ్యగారి ఇంటికి వెళ్ళివస్తాను' అని తల్లికి తప్పనిసరిగా సమాధానంచెప్పి ఆరణివంక చూడకుండానే బయ టికి నడిచాడు సూర్యనారాయణ.

ఆరణిమనస్సు చివుక్కుమంది. తనేదో తప్పుచేసినట్లు అనిపించినది కాని, ఆ తప్పుయొక్క సమగ్రస్వరూపం అతనికి తెలియలేదు. కనకాంగివంక మరోసారి చూడటానికి భయ పడిన ఆరణి నిశ్శబ్దంగా గదిలోకి పోయి, మంచంమీద బోర్లా పడుకొని దిండులో మొగం దాచేసుకున్నాడు.

అతనిమనస్సులో రకరకాల ఆలోచనలు సుళ్ళుతిరుగు తున్నాయ్ - ఏంజరిగిందీ తెలియటంలేదు - ఏదో జరిగింది. అదేమిటో ఎవరన్నా చెపితే బాగుండును - ఆలోచనలోంచి అలసటలోకి పాకిన అతనిమెదడు విశ్రాంతికోరింది - నిద్ర పోయినాడు ఆకణి.

కాఫీతీసుకుని గదిలోకి వచ్చిన కనకాంగి ఆరణి నిద్ర పోవటం చూసి కిటికీతలుపులు తెరిచి, నిశబ్దంగా వెళ్ళి పోయింది. ఆమెఅడుగులు బరువుగా పడినయ్.

# 3

వీధిమలుపు తిరిగాడు సూర్యనారాయణ. అతనికి తల్లి అంటే ఆరణిఅంటే అమ్మమ్మఅంటే అందరంటేనూ చాలా అసహ్యంగాఉంది. ఈ లోకమే ఒక పెద్ద బురదగుంట - ఇక్కడ అవినీతీ అబద్ధాలూ తప్ప మరేం లేవు - ఉన్నదంతా ఒకేఒక దుర్వాసనాభూయిష్టమైన మురికి.

దీనినుంచి తను ఎలా తప్పించుకోవాలి? ఇదే అతని ఆలోచన.

అసలు తనకులమే పాడుకులం - తనకులంలో ఆడ వాళ్ళు తమ శరీరాన్ని అమ్ముకుంటారు - ఆ పసుపుకూటి తోనే తమబిడ్డల్ని పోషిస్తారు - తనుకూడా అది తినే బ్రతుకు తున్నాడు.

అతనికి అకారణంగా ఏడుపువచ్చింది.

తను మగవాడుగా పుట్టకుండాఉంటే ఈ వాతావర ణానికి సరిపోయి - అమ్మనగలు పెట్టుకుని, ఆమెచీరలే కట్టు

కుని, తామెజీవనవిధానాన్నే అనుసరిస్తూ ఆలోచనారహితంగా హాయిగా బ్రతికేసేవాళ్ళేమో! మరి తనెందుకు అలా పుట్టలేదు?

అతనికి విరక్తి అనిపించింది.

అతను ఈ ఆలోచనలచిక్కులనుంచి తనని వదిలించుకుని పూజారి భూషయ్యగారివాకిట్లో అడుగుపెట్టాడు.

ఊరిబయట చెరువుగట్టున దేవాలయం ఉన్నది. అందులోవున్న శివుడికి రెండెకరాలపొలం ఉన్నది. ఆ పొలంలో పండిన పంట తింటూ, శివార్చనచేస్తున్నాడు పూజారి భూషయ్య. మధ్యాహ్నం వండిన అన్నంగిన్నె గిన్నెపాళంగానే గుళ్లోకి మోసుకుపోయి రెండుతడవలు ఆ గిన్నెమీద నించి చెయ్యితిప్పి గిన్నె ఇంటికి తీసుకువస్తాడు భూషయ్య. రెండురోజులకొకసారి గర్భగుడిలో దుమ్ముదులిపి - చెరువులోంచి ఒకబిందె నీళ్లు తెచ్చి ఆ లింగంనెత్తిన కుమ్మరించి అభిషేకంచేసినందుకు అందరిదగ్గరా తలోబేడా వసూలు చేస్తాడు. గుడికి కుడివైపు ప్రహరీగోడకి ఒకతలుపుఉంది. ఆ తలుపుతీసుకు నడిచితే పూజారి భూషయ్యపూరిపాక ఉంది.

ఆ పాకకి ముందు వున్న రెండుఅరుగులలోనూ ఒకదానిమీద గడవంచీ, మరోదానిమీద భోషాణం ఉన్నయ్. ఆ రెండిటిలోనూ వడ్లు పోసిఉన్నయ్. భూషయ్యకి అరవై పళ్లు ఉంటాయి.

నలభయిఅయిదు సంవత్సరాలనుంచీ శివార్చన చేస్తున్నాడు. ఆ రెండెకరాలలోపంట నలభయిఏళ్లు నిలవచేసి, ఆయిదేళ్ళక్రిందట ఒక పాలఘాట్ పిల్లని తెచ్చి పెళ్ళిచేసు

కున్నాడు. ఆ పిల్ల చాలా వినయవంతురాలు. ఓమాదిరి అందగత్తె. ఇతరుల దగ్గరనుంచి సానుభూతి తీసుకోటం ఆమెకు బాగా చేతనవును.

తల్లిని అసహ్యించుకుని దేవాలయాల్లో దాక్కోటం అలవాటయిన సూర్యనారాయణకి పూజారి భూషయ్యభార్య మీనాక్షిఅంటే చనువు ఏర్పడింది. ఆమె అంటే ఎనలేని గౌరవం ప్రేమా కలిగినయ్ అతనికి.

ఆమె చాలా పవిత్రురాలు తనతల్లిలాటి నికృష్టురాలు కాదు. ఆ ఒక్క ఊహే సూర్యనారాయణమనస్సులో మెదిలి మీనాక్షిని సింహాసనంమీద కూర్చోపెట్టింది. ఒంటరిగా ఊరిచివర ఉసూరుమంటూ జీవితాన్ని గడిపేస్తున్న మీనాక్షికి సూర్యనారాయణ కాలక్షేపానికి అవసరం అయినాడు.

అతను తనతల్లినిగురించి ఒక్క మీనాక్షితో చెప్పుకుని బాధపడేవాడు.

ఆమె నిట్టూర్చి 'నీవు చిన్నవాడివి. కొన్నాళ్ళుపోతే నీకే అర్థంఅవుతుంది' అనేది.

ఏమిటి తనకి అర్థంఅవుతుంది? తనతల్లి జీవనమార్గం సరిఅయినది అని తనకు అర్థంఅవుతుందా?

ఈవిధంగా ప్రతిరోజూ మీనాక్షితో కబుర్లుపెట్టుకొని కాలంగడిపేవాడు సూర్యనారాయణ. మీనాక్షివయసు తన వయసే - కాకపోతే ఏడాదో ఆరునెలలో పెద్దది అయిఉండవచ్చును. ఆడపిల్లఅవటంచేత ఏపుగా అందంగా ఉండేది. ఇతను పీలగా పసివాడిమాదిరిగా ఉండేవాడు. అందువల్లనే కాబోలు అతనిమీద ఆమె అధికారంచేస్తూఉండేది.

సన్నగా బలహీనంగాఉంటే ఈ అబ్బాయి భూషయ్య కళ్ళకి ప్రమాదరహితంగా కనిపించటంవలన మీనాక్షితో అతనిస్నేహాన్ని నిషేధించలేదు-అందుకని వారిస్నేహ ప్రవంతి అవిచ్ఛిన్నంగా ప్రవహించిపోతూఉంది-సెలవలకి వచ్చేవాడు రావటం మానేశాడు సూర్యనారాయణ. అందుకని ఈ తడవ మీనాక్షి ఆతనినిచూసి చాలాగోజులయింది.

గడమంచీకోటి నానుకుని బియ్యంలో రాళ్ళేరుతున్న మీనాక్షి, అడుగులచప్పుడు విని తలఎత్తి చూసింది - ఎదురుగుండా సూర్యనారాయణ.

చేట అవతలకితోసి పొంగిపోయే ఆనందంతో లేచి నిలబడింది ఆమె. సూర్యనారాయణ రెండోఅరుగుమీద భోషాణానికి ఆనించిపెట్టిన నవారుమంచం వాల్చుకుని కూర్చు న్నాడు.

'ఎప్పుడొచ్చావు సూర్యం ?'

'ఒకగంటయింది'

'బాగా లావయ్యావు, పొడుగెదిగావు ... పెద్దవాడివి అయిపోయినావు, అవునా?'

'అవును కాబోలు'

'అవునుకాబోలు ఏమిటి, నేను గుర్తేపట్టలేకపోయినాను'

'నువ్వే గుర్తుపట్టలేకపోతే నేనే నన్ను గుర్తుపట్టలేను'

'మాటలుకూడా నేర్చావే!'

'జీవితం అన్నీ నేర్పుతున్నది'

'బాగుంది కాని, వేదాంతం - పరీక్షలు బాగా వ్రాశావా?'

'అని అనుకుంటున్నాను'

'అనుకోటమేమిటి నీ మొహం'

'ఏదయినా నిర్ణయానికి రావటంకన్న అనుకోవటమే మంచిదనిపిస్తున్నది'

'ఏడిసినట్లుంది. ఉండు, కాసిని కాఫీనీళ్లు తీసుకొస్తాను' అని లోపలికి వెళ్ళింది మీనాక్షి.

ఆమెనడకలో కొద్దిగా కుంటి కనిపించింది సూర్యనారాయణకి. తిరిగి ఆమె కాఫీ తెచ్చేటప్పుడు పరీక్షగా చూశాడు. నిజమే, మీనాక్షి కుంటుతున్నది. కాఫీఅందుకుంటూ—

'కుంటుతున్నావెందుకు?' అని అడిగాడతను.

మీనాక్షి మాట్లాడలేదు.

'దెబ్బతగిలిందా?'

'అలాటిదే ఏదో... ఇంతకీ ఆరణి ఎలాఉన్నాడు?'

'చాలా హాయిగా ఆనందంగా ఉన్నాడు – నీవు ఏదో దాస్తున్నావు మీనాక్షీ కాలికితగిలింది నిజంగా దెబ్బేనా?'

మీనాక్షి మాట్లాడలేదు.

సూర్యనారాయణ లేచి ఆమెదగ్గరకి వెళ్ళి 'ఇటుచూడు నాదగ్గరకూడా కొన్ని దాచుకుంటున్నావన్నమాట!' అన్నాడు.

మీనాక్షి రెండుకళ్ళనిండా నీరునిలిచింది.

'చూడు, ఏంజరిగిందో చెప్పు, లేకపోతే నామీద ఒట్టే' అన్నాడు సూర్యనారాయణ.

'అంతమాటనకు సూర్యం, అంతమాటనకు' అంటూ మీనాక్షి రెండుచేతులూ మొగానికిఅడ్డం పెట్టుకునిఅవురుమంది.

సూర్యనారాయణ తెల్లపోయినాడు. అతను ఇదివర కెప్పుడూ మీనాక్షి ఏడవటం చూడలేదు. 'నిన్ను నేను బాధపెట్టలేదుగద?' అన్నాడు.

మీనాక్షి కళ్లుతుడుచుకుని 'నాకు చెప్పుకోవటానికి నువ్వే మిగిలావు - ఈపూట ఇక్కడ భోజనంచేస్తావా?' అన్నది;

'నువ్వు చెయ్యమంటే చేస్తాను - ఇంతకీ భూషయ్య ఏమయినాడు?'

'ఇంటికి రావటంలేదు'

'ఎందుకని?'

'అలా కూర్చో చెపుతాను. ఉండు, ముందు ఎసట్లో బియ్యంపోసి రానీ' అని లోపలికి వెళ్ళింది మీనాక్షి.

ఆమెను అనుసరిస్తూ తనూ లోపలికి వెళ్ళి వంటింట్లో పీటవాల్చుకుని కూర్చుని 'వంటచేసుకుంటూ చెప్పు, నేను పరాయివాడిని కాదుగా' అన్నాడు సూర్యనారాయణ.

'పరాయివాడివి కాదుగనకనే వంటఇంట్లోకి వచ్చావు' అని నవ్వింది మీనాక్షి.

అప్పటికి అర్థంఅయింది సూర్యనారాయణకి, వాళ్ళ వంటిట్లో తనప్రవేశం నిషిద్ధం అనేసంగతి. ఇవతలికి వచ్చి, పడమటింట్లో కూర్చుని 'ఇక చెప్పు' అన్నాడు.

'ఏంచెప్పను?'

'భూషయ్య కనిపించకపోవటానికీ నీవు కుంటుతూ నడవటానికీ కారణం?'

మీనాక్షి కొన్నిక్షణాలు మాట్లాడలేదు..

'నా కథ విని ఏమీ అనుకోవుగద?' అన్నది చివరికి.

'ఒట్టేయమన్నావా?' అని చేయిచాచాడు సూర్య నారాయణ. నిశ్శబ్దంగా అతనిచేతిలో తనచేయి ఉంచింది మీనాక్షి. కొన్నినిముషాలు ఎవరూ మాట్లాడలేదు.

'నేను పాలఘాట్‌లో పుట్టాను' మీనాక్షి తనకథ చెప్పటం ప్రారంభించింది.

'నేను పాలఘాట్‌లో పుట్టాను. దక్షిణభారతదేశంలో ఒక చిత్రమైన ఆచారం ఉన్నది. పెళ్ళిళ్లుకానివాళ్ళూ, సంప్రదాయవిహీనులూ, అధర్మప్రవర్తనులూ అయినవాళ్లు పాలఘాట్ వచ్చి, డబ్బుపెట్టి ఆడపిల్లల్ని కొని తెచ్చి పెళ్ళిళ్లు చేసుకుంటారు. అది ఇక్కడివాళ్ళకి తప్పుగా కనిపించదు'

'డబ్బుయిచ్చి కొనటానికి జంతువులా ఆడవాళ్ళు?'

'అంతకన్న హీనులు. మా దేశంలో మేము దరిద్రంతో చస్తాం - అరవతెనుగు మాట్లాడతాం - డబ్బుకోసం అయిదారుతడవలు పెళ్లిచేసుకుంటాం'

'అదేమిటి?'

'సామాన్యంగా మా దేశంలో ఆడపిల్లలు రాటుతేలి ఉంటారు - ఏ ముసలివాడో డబ్బిచ్చి ఇంతదూరం తెచ్చుకుని పెళ్ళిచేసుకున్నతరువాత ఒకనాటిఉదయంవాడికొంపలో ఉన్న చెంబూ, తప్పాలా మూటకట్టుకుని పత్తాచెప్పకుండా పారిపోతాం. ఆఅభాగ్యుడు మమ్మల్ని వెతుక్కుంటూ తిరిగీ పాలఘాట్ వచ్చినా మా ఆచూకీ వాడికి దొరకదు. ఈ విధంగా అయిదారుతడవలు చేసిన ఆడపిల్లలుకూడా మా బంధువులలోనే ఉన్నారు. అయితే, ఇందులో మరో చిత్రం

ఉంది. ఒక పిల్లపుడితే ఇక లాభంలేదు. మేమూ వెళ్ళం - వెళ్ళినా తల్లితండ్రులూ రానివ్వరు. అందుకని మమ్మల్ని కాపలా కాచేవాళ్ళు పిల్లలుపుట్టేదాకానే కాస్తారు - ఆతరు వాతపరవాలేదు' సూర్యనారాయణఆశ్చర్యంగా వింటున్నాడు ప్రపంచంలో ఇలాటివి సంభవాలే అన్నసంగతి కూడా అతని ఊహకి అందటంలేదు.

మీనాక్షి అన్నాన్ని ఒకసారి కలియబెట్టి తిరిగీ చెప్ప టం ప్రారంభించింది.

మమ్మల్ని పెళ్ళిళ్ళు చేసుకొని తెచ్చుకుంటారే గాని, ఎవరూ నమ్మరు. ఇంకో ఘోరమేమిటంటే, తల్లిదండ్రులనీ అన్నదమ్ముల్ని చూడటం అనేది లేదిపోతే తప్ప మాకు కుద రదు. అందుకే సగంమంది లేచిపోతారు. పాలఘాట్ పిల్లని పెళ్ళిచేసుకున్నాడంటే కులంలోంచి వెలివెయ్యరుగాని, కొం చెం నీచంగా చూస్తారు. ఇదీ సంఘంలో మా చరిత్ర'

సూర్యనారాయణ నిట్టూర్చాడు.

'ఇలాటి సంఘంమధ్య నేను పుట్టాను. ఎందువల్లనో గాని నాకీ ఆచారం అంటే అసహ్యం ఏర్పడింది- అయినా అమిత దరిద్రంతో అలమటించిపోతున్న నా తల్లి దండ్రులకోసం పాలులేక బాధపడుతున్న నా నాలుగేళ్ళ తమ్ముడికోసం, చదువుసంధ్యలు లేకుండా తిరుగుతున్న నా మరో సోదరుడికోసం నేను అమ్ముడుపోక తప్పలేదు. ఒకసారి కాదు రెండుసార్లు అమ్ముడుపోయాను'

సూర్యనారాయణ స్తబ్ధుడయిపోతున్నాడు. మీనాక్షి అన్నంగిన్నె దింపి, కందిపప్పు కడిగి పొయిమీదవేసి, తీరికగా

కొంగుకి చెయితుడుచుకుంటూ పడమటింటిగోడకి జార్లాబడి కూర్చుని కథచెప్పటం ప్రారంభించింది.

'అప్పుడే బిగుసుకుపోక. మరి వినాల్సింది ఇంకా చాలా ఉంది- నా తమ్ముడు పేరు నటరాజన్. నాకంటే ఒక సంవత్సరమే చిన్న. బహుశా నీవయసే ఉంటుంది. వాడికి తెలుగు బాగా వచ్చును. నాకన్న బాగా మాట్లాడతాడు. సరే, ఆసంగతి అలా ఉండనీ--నాకు పన్నెండేళ్ళవయస్సప్పుడు గుంటూరుజిల్లాలో ఒక మూగవాడికి నన్ను కట్టబెట్టి, కొన్నాళ్ళు దరిద్రంనుంచి విముక్తిపొందారు నాతలిదండ్రులు. నేను మూగవాడిభార్యగా నా జన్మస్థలాన్ని విడిచి, నన్ను కొన్న మా అత్తగారివెంబడి గుంటూరుజిల్లాకి వెళ్ళిపోయి నాను. నా మూగభర్తకి నేనంటే, అపరమితమైన అనురాగం. అప్పుడే పొంగబోతున్న నా యవ్వనం ఇంకెవరికీ కనపడ కుండాఉండాలని తనఉత్తరీయం నామీద కప్పేవాడు - నా దురదృష్టమేమిటోగాని, నా అత్తగారికి నేనంటే వల్లమాలిన ద్వేషం. మూగవాడైన కన్నకొడుకుకిపెళ్ళిచేయటానికికారణం ఒక బలిపశువుకోసమే కాదుగదా అనిపించేది నాకు. నా భర్తకి రెండెకరాలపొలం ఉన్నది. ఆ పొలంపని ఆయనే చేసే వారుట. నేను వెళ్ళినదగ్గరనుంచీ పసిదాన్ని అనే జాలికూడా లేకుండా, నాచేత గొడ్డుచాకిరి చేయించేది మా అత్తగారు. ఎర్రగా బొబ్బలెక్కిపోయిన నా అరిచేతులకు ఎవరూ చూడకుండా ఇంత కొబ్బరినూనె రాచేవారునాభర్త. అతను మూగవాడే కాదు; బధిరుడుకూడాను. అయితేనేమి ? అతని ఆంతర్యానిని దూరదృష్టి దూరశ్రవణాలున్నయ్

మొదట్లో నేను అతనినంతకూడా చూసేదాన్ని కాదు-తరువాత తరువాత నీటిజల్లులాటి అతనివలపుజల్లు-అత్తగారుపెట్టే అవస్థలలో అణగారిపోతున్న నాకు అపరిమితమైన శాంతినిచ్చింది.'

మీనాక్షి రెండుకళ్ళనిండా నీరునిండింది. కొన్ని క్షణాలు ఊరుకొని కొంగుతో కళ్ళుఅద్దుకుని చెప్పటం ప్రారంభించింది ఆమె.

'జీవితం ఉమ్మెత్తకాయలాటిది సూర్యనారాయణా! ఉమ్మెత్తకాయని శరీరంమీద కొడితే నెప్పి తెలియకుండానే నెత్తురొస్తుంది. అలాగే వలపు తెలియకుండానే వయసుపాకింది నాలో - పాకిన వలపు బలికోరింది'

'అంటే ?'

'ఏంలేదు, మా అత్తగారికి నేనంటే ఎక్కడలేని అనురాగం పుట్టుకొచ్చింది. ఏమిటి ఈ అకాల వసంతోదయం అనిపించినా, ఏవిధంగానూ అనుమానించలేకపోయాను - ఆవూరి మోతుబరి ఒకడు నన్ను కోరాడు. మా అత్తగారికి ఏదో ఇంత ముట్టచెప్పినట్లున్నాడు - మూగవాడు బధిరుడూ అయిన తనకుమారునికి పత్నీ అనవసరమే అని తనకు తెలిసికూడా, డబ్బుపోసి కొనుక్కురావటానికి ఆవిడ ఏమీ అంత తెలివితక్కువది కాదు - ఆవిడడబ్బు ఆవిడ వడ్డీతోసహా రాబట్టుకోవటానికి ప్రయత్నించింది'

'అంత అన్యాయమా ?'

'అది అన్యాయం ఎందుకయింది ? కొందరు బంగారం అమ్ముతారు, మరికొందరు చింతపండు అమ్ముతారు, ఇంకా కొందరు శరీరాన్ని అమ్ముకుంటారు. ఎవరిదగ్గర ఏముంటే

అది వ్యాపారవస్తువు కావటంలో ఆశ్చర్యంఏమీలేదు. సరే, కథ విను - ఒకనాటిరాత్రి ఆ మోతుబరి మా ఇంటికి రావ టానికి ప్రయత్నించాడు. చెప్పానుగా - నా భర్తకి దివ్య దృష్టి దివ్య శ్రవణా లున్నాయని - ఎలాగో ఆయన ఈ విష యం గ్రహించారు - ఆరాత్రి ఆ మోతుబరికి తల పగిలింది. కథ ఈవిధంగా అడ్డంతిరిగేసరికి మా అత్తగారు షాడిలిపోయి మా నాన్నకి నన్ను తీసుకుపొమ్మని ఉత్తరం వ్రాసింది.

ఆయన వచ్చేలోగానే, నేను శాశ్వతంగా ఆ వూరు వదలాల్సినస్థితి వచ్చింది. పగబట్టిన మోతుబరి అమాయికుడు అవిటివాడూ అయిన నా భర్తనిపొలంనుంచి వస్తుండగా తల పగలగొట్టాడు. రెండురోజుల అనంతరం పక్కవూరి హాస్ప టల్లో నా ఒడిలోనే అతను ప్రాణంవదిలాడు. ఏదో చెప్పా లనుకున్నాడు. ఇంకేదో వినాలనికూడా ప్రయత్నంచేశాడు: ఏదీ చేతకాలేదు - జన్మఎత్తినదగ్గరనించీ ఎంత నిశ్శబ్దంగా జీవించాడో అంత నిశ్శబ్దంగానే ప్రాణంవదిలాడు'

మీనాక్షి దుఃఖించటం ప్రారంభించింది. కొంచెం సేపటికి కళ్ళుతుడుచుకుని

'ఆ మరునాడో మూడవనాడో నాన్న వచ్చి నన్ను తీసుకువచ్చాడు. రైలు బెజవాడరాగానే అణా పూలూ, అణా కుంకుమా కొని, నన్ను కన్యనిచేశాడు నాన్న. తిరిగీ పెళ్ళిచేస్తాడు కాబోలు అనుకుని నాలో నేనే నవ్వుకున్నాను. నా మెదడూ హృదయమూ బండబారిపోయినయ్. అనుభూ తులూఅవసరాలు నన్నంటటంమానివేసినయ్. అవిటివాడైన నాభర్తనిఅపరిమితంగా ప్రేమించాను. కాని అతన్నిపోగొట్టు

కున్నాను. సరే, పోనీలే, నేను జన్మించినందుకు నా తల్లిదండ్రులయినా సుఖపడితే అంతే చాలనుకున్నాను. నా వ్యథనీ బాధనీ నటరాజకే అర్థంచేసుకున్నాడు. కాని ఎవరుచేసేదీ ఏమీలేదు. మళ్ళీ అయిదారు నెలల్లో ఈ పూజారి భూషయ్యకి భార్యగా వచ్చాను - రాక తప్పలేదు; తప్పించుకోవాలని కూడా నేను ప్రయత్నించలేదు. ప్రవాహంలోపూచిక పుల్లలా జీవితం ఎటుకొడితే అటు ఒరిగాను, అంతే. అంత కన్న ఇంకే ప్రత్యేకతా లేదు. కావాలనికూడా అనుకోలేదు'

మీనాక్షి ఒకసారి లేచి పప్పులో నీళ్ళుఉన్నాయో లేవో చూసి వచ్చింది.

సూర్యనారాయణ మొగాన నెత్తురుచుక్క లేదు. తన స్నేహితురాలు తనకి ఒకవిధంగా ఉపాధ్యాయిని. జీవితంలో ఇన్ని కష్టాలుపడిందా? ఇలాంటి తల్లిదండ్రులకా ఆమె జన్మించింది! ఆమె పడినకష్టాలలో ఆమెకున్న జీవితానుభవంలో తనెంత? తన కష్టాలు ఏకరువుపెట్టినప్పుడల్లా మీనాక్షి నవ్వుతూఉండేది ఇందుకేనా? అతను చాలా సిగ్గుపడిపోయినాడు. మీనాక్షి మళ్ళీ చెప్పటం ప్రారంభించింది.

'ఈ పూజారి భూషయ్యతోఈదేశం మళ్లీ వచ్చాను. ఈసారి నేను పెళ్ళిచేసుకుని వస్తున్నప్పుడు నా తమ్ముడు నటరాజన్ లేడు. మాట్లాడకుండా నా రెండోభర్తవెంబడి వచ్చేశాను. అతను పెట్టిన తిండి తింటూ, అతనుఇచ్చిన బట్ట కడుతూ - అతనికి వండిపెట్టి శరీరంయిస్తూ జీవిస్తున్నాను. కాలం బాగానే గడిచిపోయింది. ఒడుదుడుకులేమీ లేవు. ఈ జీవితంలోనూ కాలంలోనూ - నేనూ ఉన్నాను, అంతే'

'మరిప్పు డేమయింది?'

'ఏమీకాలేదు. పదిరోజుల కిందట నా తమ్ముడు నటరాజన్ వచ్చాడు - నా తల్లితండ్రులూ, నా చిన్న తమ్ముడూ అందరూ కలరావచ్చి చనిపోయినారట.'

సూర్యనారాయణ ఉలిక్కిపడ్డాడు.

'పోనీ, సుఖపడ్డారనుకున్నాను నేను - నటరాజన్ కూడా అదే అన్నాడు. ఈ ముసలాడుచచ్చాక మళ్ళీ పెళ్లిచేసుకోటం తప్పిందని' పేలవంగా నవ్వి తిరిగీ చెప్పటం ప్రారంభించింది మీనాక్షి.

'నటరాజన్‌కి ఆ దేశంలో ఇంకెవరూ మిగలలేదు. నన్ను వెతుక్కుంటూ ఊపూరు వచ్చాడు -ఊపూరిపేరుతో ఉన్న మరో నాలుగయిదుపూళ్ళు వెతికి టిక్కెట్టుకి డబ్బు లేక - తిండిలేక కూలిచేసుకుంటూ ఊపూరు చేరాడు. వచ్చేసరికి జ్వరంతో ఉన్నాడు. నటరాజన్ వచ్చినప్పుడు భూషయ్యగారు లేడు. వాడికి కాసిని కాచినపాలు ఇచ్చి మంచం మీద పక్కనే కూర్చుని కబుర్లుచెప్పుకుంటున్నాము - ఇంతలోనే భూషయ్యగారువచ్చి ఆ దృశ్యం చూసి మండిపడ్డారు. అతను నా సోదరుడనీ - మే మిద్దరమూ ఏకగర్భజనితులమనీ ఎంతచెప్పినా వినలేదు - పాలఘాట్‌పిల్ల లిలాగే ఎవడినో ఒకడిని అన్నయ్యనీ- బాబాయిఅనీ చెప్పుకుంటారని అంటూ. జ్వరంపేలిపోతున్న నటరాజన్‌ని మెడబట్టి వాకిట్లో మంచులోకి తోసి తలుపువేశాడు. నేను ఏమీ అనలేదు. నా కళ్లలో నీళ్లురాలేదు, నా మనసు కొంచెంకూడా నొచ్చుకోలేదు. నేను మెల్లిగా తలుపుతీసుకుని ఓరాత్రివేళ బయటికి వచ్చాను.

నాకోసమే కాబోలు అరుగుకింద దాక్కొని ఎదురుచూస్తు న్నాడు నటరాజన్ - నేను వాకిట్లోకి రాగానే నన్నుకూడా తనతో వచ్చేయమని అడిగాడు.

అతనే కాలునిలదొక్కుకోలేని సమయంలో నాబరువు కూడా మొయ్యవలసిరావటం చాలా కష్టం. నేను రానని చెప్పాను - అదీకాక ...'

'అదీకాక?'

'నీవు వస్తావని'

సూర్యనారాయణ ఆశ్చర్యంనించి తేరుకోకమునుపే మీనాక్షి తిరిగీ చెప్పటం ప్రారంభించింది.

'తను తెనాలి వెడుతున్నానని చెప్పి, ఆ జ్వరంతోనే తూలుతూ వెళ్ళిపోయినాడు నటరాజన్. నాదగ్గర ఉన్న ఒక జత బంగారుగాజులూ తీసివేసి అతనికి ఇచ్చాను. ఇదంతా భూషయ్యగారు కిటికీలోంచి చూసి మరింత అనుమానించి నన్ను కొట్టారు- అవే ఈ దెబ్బలు'

సూర్యనారాయణ పళ్ళు పటపట కొరికాడు.

'ఎవరిమీద కోపిస్తావు సూర్యం? ఇదంతా ఖర్మ. మన బ్రతుకులు వలదల్లో గడ్డిపరకలు! అంతే' అని మీనాక్షి నిట్టూర్చింది.

'ఆతరువాత?'

'ఆ తరువాత ఇక చెప్పే దేముంది? ఆయన ఇట్లోంచి వెళ్లిపోయినాడు. తను తిరిగి వచ్చేసరికి నేను కనిపిస్తే ఖూనీ చేస్తానని చెప్పారు'

'మరి ఇప్పు డేం చేస్తావు?'

'ఏంచేసేదీలేదు. ఖూనీచెయ్యనీ-ఏం మునిగిపోయింది?'

మీనాక్షి నిర్లిప్తంగా అన్న ఈ మాటలకి సూర్య నారాయణ ఉడికిపోయినాడు. అతనికి ఏమనటానికీ ఏం చెయ్యటానికీకూడా తోచలేదు. ఒకవిధమైన మంచితనపు నిషా అతనిని ఆవరించింది - ఆ నిషాలో తను ఏంచేస్తున్నదీ కూడా గ్రహించకుండా మీనాక్షి రెండుచేతులూ పట్టుకుని 'నిన్ను వాడు చంపటం ఇష్టంలేదు నాకు. నాతో వచ్చెయ్యి' అని ఉద్రేకంగా చేతుల్ని గుండెలకు అదుముకున్నాడు.

కొన్నినిముషాలు ఇద్దరూ మాట్లాడలేదు. ఇద్దరి మనసుల్లోనూ ఏదో మత్తు ఆవహించింది. ఉన్నట్లుండి మీనాక్షి పకపకనవ్వి "పద" అన్నది.

# 4

తెల్లవారింది - చాలా అందంగా హాయిగా ఉండాల్సిన ఉదయం ఉక్కగాఉన్నది. ఆరణికి మెలుకువవచ్చినా గాని, ఏదో ఆలోచిస్తూ పక్కమీదనుంచిదిగటానికి బద్ధకిస్తూ అలాగే పడుకున్నాడు.

కనకాంగి ఖంగారుని కప్పిపుచ్చుకుంటూ గదిలోకి వచ్చి 'సూర్యం ఏమయినాడు?' అన్నది.

ఆరణిబద్ధకం వదిలిపోయింది. ఒక్కఉదుటున లేచి కూర్చుని 'ఏమయినాడు?' అన్నాడు.

'కనిపించటంలేదు. పెట్టెలో డబ్బుకూడా లేదు'

ఆరణికి నోటివెంట మాటరావటంలేదు. ఏమయినాడు సూర్యనారాయణ? ఈ ఇంటితో శాశ్వతంగా తెగతెంపులు చేసుకొని పోలేదుగదా - తల్లికి చెప్పకపోతే పోనీ, కనీసం తనకయినా చెప్పవచ్చునుగదా. దీన్నిబట్టి చూస్తుంటే సూర్యానికి తనమీద మంచిఅభిప్రాయం ఏనాడూ లేదన్న మాట... ఇంతకూ సూర్యం ఏమయినట్లు?

'ఎక్కడకి వెళ్ళాడు, ఎందుకు వెళ్ళాడు?' అని కనకాంగిని ప్రశ్నించాడు ఆరణి.

'ఎక్కడికి వెళ్ళాడో తెలియదుగాని, ఎందుకు వెళ్ళాడో ఊహించగలను - తను ఇందుకు వెడుతున్నానని నాతో చెబితే కాదంటానా?' అని నిట్టూర్చింది కనకాంగి.

'ఎందుకు వెళ్ళాడు?'

'ఆడదాన్ని రక్షించినగర్వం దక్కించుకోటంకోసం. నువ్వు లేచి పూజారి మీనాక్షి ఉందో లేదో చూసిరా. ఈ సంగతి ముసిల్దానికి తెలియనివ్వకు. డబ్బుపోయిందానికి ఏడుస్తుంది - వెధవడబ్బు పోతేపోయింది' అని పేలవంగా నవ్వింది కనకాంగి.

ఆరణి ఆశ్చర్యపడిపోయినాడు. పూజారి మీనాక్షికి సూర్యనారాయణపరారీకి ఏమిటి సంబంధం? ఆ ప్రశ్నే కనకాంగిని అడిగాడు. కనకాంగి పకపకనవ్వి-

'ఈలోకంలో తల్లీ చెల్లెలూ కూతురూ కాని ఏ స్త్రీనయినా మొగవాడు స్త్రీగానే ప్రేమిస్తాడు. అదే సంబంధం' అన్నది.

'సూరి నా కెప్పుడూ చెప్పలేదు!'

'బహుశా సూరికికూడా ఆ విషయం తెలిసిఉండదు. అది తెలుసుకున్న వెంటనే వెళ్ళిపోయినాడు'

'ఇప్పుడు న న్నేంచేయమంటావు?'

'సూర్యం ఎక్కడికి వెడతాడో ఆలోచించగలవా?'

'ఆమెను తీసుకువెళ్లినప్పుడు మామూలుచోట్లకి వెళ్ళ డనుకుంటాను'

'అదీ నిజమే...కాని తనేదో తప్పుచేసినట్లు పారి పోవటం నాకు నచ్చలేదు. ఆమెను ఈ ఇంటికే తీసుకువస్తే ఎవరు కాదంటారు?' అని నిట్టూర్చింది కనకాంగి.

ఆరణి మళ్ళీ ఆశ్చర్యపోయినాడు. ఆ కొడుకు తల్లిని అసహ్యించుకొంటాడు - ఆ తల్లి కొడుకుని అర్థంచేసుకుం టుంది - ఈ సంస్కారానికి వేళ్ళు ఎక్కడ పాతుకున్నాయో అర్థంకావటంలేదు అతనికి.

'అదికాదు ఆరణీ ! ఈ ఇల్లు తనది, ఈ వాకిలి తనది. తనది కానిది ఇక్కడేమీలేదు - వీటిని తను ఇష్టానుసారం వినియోగించుకోటానికి పూర్తి హక్కున్నది. పూజారి కామాక్షి నా కొడుకు స్నేహితురాలుగా - ఈ ఇంటికి వస్తే కాదనటానికి నే నెవరిని?'

ఆరణి ఇక ఉండబట్టలేకపోయినాడు.

'నిన్నేమో వాడు అసహ్యించుకుంటున్నాడు, ద్వేషి స్తున్నాడు. ఆ సంగతి నీకు తెలుసా?'

'తెలుసు. అలా ద్వేషించటం వాడిరక్తంలోనే ఉంది. దానికి వాడిబాధ్యత లేదు. అందుకే వాడిని మార్చటానికి నే నెప్పుడూ ప్రయత్నించలేదు'

'నాకు అర్థంకాలేదు'

'అర్థంఅయేట్లు చెపుతా విను - నేను పదమూడు సంవత్సరాల పిల్లగా ఉండగా, ఒక బ్రాహ్మణఅయ్యవారునల్భై అయిదుసంవత్సరాల వయసుగల ఆయన భరతం నేర్పటంలో ప్రవీణులు, మండపేటలో ఉండేవారు. ఆయనకి భరతం మీదా సంగీతంమీదా యెంత అభిమానమో వేశ్యావృత్తి మీదా వేశ్యలమీదా అంత ఏవగింపు. ఆయన ఎవరికీ విద్య నేర్పేవారుకాదు. ఆయన జపాలు తపాలు సంసారం వీటిమధ్యే కాలంగడిపేస్తూఉండేవారు - ఆయన దగ్గరే ఎలాగైనా నాకు నాట్యంనేర్పించాలని అమ్మ పట్టు పట్టింది. ఎన్నితడవలు ఎన్నివిధాలుగా ప్రార్థించినా ఆయన కసిరికొట్టి పొమ్మన్నారు. ఇలాఉండగా, ఒకరోజున ఆయన కొడుకు అయిదేళ్ళవాడు చెరువులో కాలుజారి పడిపోయి నాడు. అక్కడే నీళ్ళుముంచుతున్న అమ్మ ప్రాణాలకుకూడా తెగించి ఆ పసివాడిని కాపాడింది.

'సింహాచలం, నీ ప్రాణాలకుకూడా తెగించి నా బిడ్డని కాపాడావు. నీ బిడ్డకి అభినయం నేర్పుతాను' అని ఆయనంతటఆయనే అన్నారు. అమ్మ ఏనుగెక్కింది. ఆవిధంగా ఆయనకు నేను శిష్యురాల్ని అయినాను. రెండేళ్ళుగడిచినయ్. నేను పూర్తిగా యవ్వనవతి నయినాను. నాట్యంలోకూడా ప్రవీణురాలినయినాననే చెప్పాలి - 'ఇంతవరకూ చెప్పి, కనకాంగి ఆగిపోయింది. ఆతనికి తనుచెప్పేది విసుగుకలిగిస్తున్నదేమో అని అనుమానించింది ఆమె. అతను ఇదంతా చిత్రంగా వింటున్నాడు.

ఆమె ఆపగానే తలెత్తిచూశాడు.

కనకాంగి తిరిగీ చెప్పటం ప్రారంభించింది 'ఈరోజు ఎందుకో నాకు అన్నీ చెప్పుకోవాలనిపిస్తున్నది... మేము దేవ దాసీలం - కళారాధకులం. కాని, కడుపుకోసం పడుపువృత్తికి ప్రాధాన్యం ఇచ్చేవాళ్ళం కాదు - కాని, పడుపువృత్తి చేసే వాళ్ళంగానే లోకం మమ్మల్ని భావిస్తుంది - అది మా దుర దృష్టమనే చెప్పాలి. సరే, అది అలా వదలివేద్దాం-అభినయం నేర్పుతున్నప్పుడు పొరపాటున నా చేయితగిలితే స్నానంచేసే వారు మాఅయ్యావారు. చిన్నతనంకావటంవలన నేను రోషం తెచ్చుకుంటూఉండేదాన్ని. తరువాతరువాత కావాలని రోజుకి నాలుగయిదుసార్లు ఆయన్ని ముట్టుకుంటూఉండే దాన్ని. ఇలా రెండు మూడు నెలలు గడిచినాక- ఆయన తడవ తడవాస్నానంచెయ్యటం మానేసి, ఏకంగా ఒకేసారి చెయ్యా నారంభించారు - ఇంకో రెండు మూడు నెలలు గడిచినాక ఆయనంతటికి ఆయనే నన్ను తాకేవారు.

ఈ మార్పుని నా విజయంగా తీసుకుని, గర్వించానే గాని, నాకు తెలియకుండానే నేను ఎంత పాదిత్యం మూట కట్టుకుంటున్నానో అర్థంచేసుకోలేని పసితనం కావటంవలన కావాలనే ఆయనని క్షమించేదాన్ని.

ఆరోజు నేను గోపాలస్వామివారి ఆలయంలో నా మొదటి నృత్యాంజలి అర్పించేరోజు - ఇక రేపటినుంచీ నేను నృత్యం నేర్చుకోనవసరంలేదు. సాయంత్రం ఆలయంలో నృత్యంచేశాను. అద్భుతంగా గర్వంతో క్షేత్రయ్యపదం అభి

నయించాను - ఊరు ఊరేకాదు, ఆలయంలో స్వామికూడా నా నృత్యానికి ముగ్ధుడయినాడు.

ఆరాత్రి అయ్యవారికి గురుదక్షిణ ఇవ్వాలి. అమ్మ పట్టుపంచలు తెప్పించింది - వేశ్యసొమ్ము ముట్టటం మహా పాపం అని కసిరికొట్టారుట. అమ్మ భయపడిపోయి - నన్ను నమస్కరించిరమ్మని పంపింది'

'ఈ ముసల్దే ?'

'ఇప్పుడయింది ముసల్ది. సరే, నేను వెళ్ళాను. నృత్యపు దుస్తులు విప్పలేదు. అలాగే వెళ్ళి అయ్యవారికి నమస్కరించాను-ఆయన నన్ను లేవతీశారు. 'కనకాంగీ, నీ యీ విద్య భగవంతుడిసేవకే వినియోగిస్తాననీ- అపూర్వమైన ఈ విద్యని ఆధారంచేసుకుని సొమ్ముచేసుకోననీ నాకు మాటఇవ్వాలి. అదే నా గురుదక్షిణ' అంటూ చెయ్యి ముందుకు చాచారు అయ్యవారు. నేను ఆయనచేతిలో చెయ్యివేసి నొక్కాను. ఆయన కొన్నిక్షణాలు నా కళ్ళల్లోకి చూసి, 'మహాఋషినైనా కవ్విస్తారు వేశ్యలు' అన్నారు. నేను నవ్వి తలవంచుకున్నాను. ఇంతలో పెద్దవర్షం రావటం, అక్కడఉన్న దీపం కాస్తా కొండెక్కటం జరిగింది. ఆ పరిస్థితిలో వేశ్యఅంటే అసహ్యించుకునే అయ్యవారు - పవిత్రతకి ప్రాధాన్యంఇచ్చే అయ్యవారు- నా కన్నెరకాన్ని కొల్లగొన్నారు. నేను బాధపడలేదు, సిగ్గు అసలేపడలేదు. పైగా కాస్తో కూస్తో సంతోషించాననే చెప్పాలి. కాని, ఆయన మహాపాపంచేసినట్లు బాధపడ్డారు. కొద్దిరోజులలోనే సన్యసించి వెళ్ళిపోయినారు'

కనకాంగి నిట్టూర్చి మళ్ళీ చెప్పటం ప్రారంభించింది.

'నేను సంగతంతా అమ్మకు చెప్పాను - అమ్మ సంతో షించింది. మా ఆచారం ఏమిటంటే, కన్నెరికం పెట్టినవానికి బిడ్డ కలిగేదాకా వృత్తిచెయ్యం. అలాగే నేనూను. సూర్య నారాయణ నా పుత్రుడే కాకుండా, గురుపుత్రుడుకూడాను. అందుకే అతనిని - నేను గౌరవిస్తాను. ఆ తొలిస్పర్శతోనే తల్లినయినాను. ఇప్పుడు అర్థమయిందా? సూరి వేశ్యని ఎందు కసహ్యించుకొంటున్నాడో' అన్నది కనకాంగి.

'ఆ తరువాత నయినా వృత్తిచెయ్యకపోతేనేం ?' అన్నాడు ఆరణి.

'డబ్బు కావాలి. అంతేకాదు, యవ్వనవాంఛలు తీరాలి - ఆపైన కులవృత్తి'

'తరువాత ?'

'తరువాతసంగతి మరోసారి చెబుతాను. సూరి ఎక్కడున్నాడో తెలుసుకోవటం అవసరం' అన్నది కనకాంగి.

లేచి దోడ్లోకి నడిచాడు ఆరణి.

# 5

అమెరికాలో టిజుయానా అనే చిత్రమైన పట్టణం ఒక టుంది. అక్కడ - పాపం, అక్రమప్రవర్తన అనేవాటికి అర్థం ఏమిటో ఎవరికీ తెలియదు - తినటం త్రాగటం వ్యభిచరిం చటం - మత్తుపదార్థాలు సేవించటం వారికి అతి మామూలు విషయాలు. ఇంకా వయసురానివాళ్ళు ఆ పట్టణంలో బహి రంగంగా త్రాగవచ్చును - నగ్నదృశ్యాలతోకూడిన చిత్రా

లకు వెళ్ళవచ్చును- స్త్రీలు నగ్నంగా నృత్యంచేసేశాలలు అక్కడ చాలావున్నయ్. వీధిలోకి వెళ్ళి బహిరంగంగా స్త్రీలనిఎన్నుకుని మహారాజులా అనుభవించవచ్చును-ఇలా ఇతర ప్రపంచం భరించలేని కుళ్ళుని టిజుయానా భరిస్తుంది.

ప్రక్కనవున్న పట్టణాలు పరిశుభ్రంగానూ - ఆరోగ్య కరంగానూ ఉన్నయ్యంటే దానికికారణం టిజుయానా.

ఉద్రేకంతీరని అగ్నివాంఛలను భరించే పాపాలభైరవి టిజుయానా.

ఆంధ్రలో దానికి పోల్చదగిన పట్టణం ఒకటి ఉన్నది- అది విజయవాడ.

టిజుయానా-విజయవాడ- ప్రాచ్య పాశ్చాత్య పాపాల కూపాలు విజయవాడ టిజుయానాలు.

టిజుయానానుంచి వచ్చిన మెక్సికన్‌వాడొకడు విజయవాడలో ఒక నైట్‌క్లబ్ స్థాపించాడు - పైకిమాత్రం అది ఒక హోటలు. తెల్లవారుఝామున కొంచెంసేపు ఆ హోటలుముందు నిలబడితే ఆంధ్రయువకులు హోటల్ టిజుయానాలోనుంచి తెగతాగి తూలుతూ నానాదుర్భాష లాడుతూ బైటికిరావటం చూడవచ్చును.

అలాటిస్థితిలో పోలీసులు వారిని అరెస్ట్‌చెయ్యవచ్చును కాని, వందలుగాఉన్న ఈ యువబృందం చాలా ఉన్నత కుటుంబాల్లోంచికూడా వచ్చినవారు - అక్కడికీ కొందరిని అరెస్టుచేస్తూనేఉంటారు - అయితే, అంతమాత్రంచేత పాప కూపమైన టిజుయానాలోకి ఆంధ్రయువకులు ప్రవేశించటం మానలేదు.

అక్కడి అమరసుఖాలని సేవించిన తదుపరి రెండోసారి వెళ్ళకుండా ఉండటం కష్టం - అంతేకాదు, ఈసారి తమతో మరికొందర్ని కూడా తీసుకువెడతారు వాళ్ళు.

ఒక్క విజయవాడలోనే. కాదు - చుట్టుపట్లనుండే ఊళ్ళనుంచికూడా తిరణాలకు వెళ్ళేజనంలాగా హోటల్ టిజు యానాలోని వినోదవిలాసాల నిషాకోసం, యువతీయువకులు వస్తూఉంటారు - భూతలస్వర్గమని భావిస్తూ టిజుయానాలో జీవిస్తూఉంటారు. అక్కడి గందరగోళం ఆంధ్రయువతీయువకుల్ని ఉద్రిక్తుల్ని చేస్తుంది. మెక్సికన్‌సంగీతం వారిని ఉత్సాహపరుస్తుంది - కన్నులు జిగేల్‌మనే కాంతికిరణాలు, నోరు ఊరించే పానీయాలు - తెలుగు ఇంగ్లీషుల్లో సంభాషణలు - మెక్సికన్ ఆంధ్రయువతుల అపూర్వ అంగవిన్యాసాలు - వారిని తన్మయంచేస్తూఉంటయ్యి.

ఇలాంటి టిజుయానాలో నటరాజన్ సర్వరుగా ప్రవేశించాడు. తెనాలిలో అతనికి పని దొరకలేదు సరిగదా, అక్కగారు ఇచ్చిన రెండుగాజుల్లో ఒకగాజు ఖర్చుఅయిపోయింది. రెండోగాజు ఖర్చుకాకమునుపే - విజయవాడ వచ్చి - టిజుయానాలో సర్వరుగా చేరాడు - టిజుయానాలో సర్వర్లు అంటే సామాన్యులుకారు - అనేకమంది అక్రమప్రవర్తనలూ, అధర్మకార్యాలూ వీళ్ళకి తెలుస్తయి. ఎక్కడైనా నోరుమెదిపినట్లు తెలిస్తే మెక్సికన్‌యముడు - ప్రాణాలు తీస్తాడు - నటరాజన్ ఒకవిధంగా కత్తిఅంచుమీద బ్రతుకుతున్నాడనే చెప్పాలి.

అక్కడ జీతాలు పెద్ద ఎక్కువేమీ ఉండవు కాని, సంపాదించుకోగలిగిన సమర్థుడికి కావల్సినంత సంపాదన.

నటరాజన్‌కి ఆ సమర్థత లేకపోవటంవలన ఒక మాస పత్రికకార్యాలయంలో ప్రూఫులుదిద్దటం ప్రారంభించాడు - ఎలాగైనా ఒక బంగారుగాజులజత చేయించి, తనఅక్కగారికి ఇవ్వాలి. ప్రస్తుతం తనజీవితధ్యేయం అదే.

తెలుగు బాగావచ్చిన నటరాజన్ పత్రికాకార్యాలయంలో పనిచేస్తూఉండటంవలన సాహిత్యం కథలూ అంటే అర్థంచేసుకోగలిగాడు. అంతేకాదు, వాటిని సృష్టించాలనికూడ తాపత్రయపడ్డాడు. వ్రాసి కొట్టివేసి-చివరకి వ్రాయగలిగిన ఒక కథ అతనిజేబులో ఉంటూఉండేది. పగలల్లా పత్రికలో ప్రూఫులుదిద్ది - రాత్రిళ్ళు టిజుయానాలో సర్వరుపనిచేసే నటరాజన్‌లో అపూర్వమైన ఒక దాహం ప్రారంభమైంది.

ఏదో చెప్పాలి... ఎంతో నివేదించాలి. ఏమో తెలియపరచాలి. ఇదీ అతని దాహం.

ఒకరోజు సాయంత్రం నాలుగుగంటలప్రాంతంలో గవర్నరుపేటసెంటరులో మీనాక్షీ కనిపించింది నటరాజన్‌కి. ఆమెతో ఒక యువకుడున్నాడు. ఏంచేసింది తనసోదరి? చివరికి తనబంధనాన్ని తెంచుకోగలిగిందా? నటరాజన్ నవ్వుకున్నాడు.

మరో బంధం తగిలించుకున్నప్పుడే- పాతబంధంనుంచి విముక్తురాల్ని అయినానని భ్రమిస్తుంది స్త్రీ.

కొంచెం త్వరగా నడిచి వారిని కలుసుకున్నాడు నటరాజన్- అతన్నిచూసి ఆనందంపట్టలేకపోయింది మీనాక్షి.

'సూరీ! నటరాజన్' అంటూ తమ్ముడిచెయ్యి పట్టుకుంది ఆమె.

'ఓ!' అన్నాడు సూర్యనారాయణ.

'ఇదేమిటి?' అన్నాడు నటరాజన్. అంతకన్న మరో ప్రశ్న అతనినోటివెంట రాలేదు.

'నువ్వుచెప్పినట్లు వచ్చేశాను తమ్ముడూ - తెనాలి వెళ్ళాం. నువ్వక్కడ లేవు - ఇక ఈ జీవితంలో నువ్వు కనిపిస్తావో కనిపించవో అర్ధంకాలేదు... నేడు చాలా మంచిరోజు. నువ్వు కనిపించావు' అన్నది మీనాక్షి. ఆమె రెండు కన్నులలోనూ విషాదం నీడలుసాచింది.

'పద, నా గదికి వెళ్ళి మాట్లాడుకుందాం - గదేమిటిలే, గుడిసెకి వెళ్ళి మాట్లాడుకుందాం' అని బాధగా నవ్వి దారితీశాడు నటరాజన్. ముగ్గురూ నడవటం ప్రారంభించారు. దుర్గకళామందిరం పక్కవీధిలో కాలువగట్టున సిమెంటు రాళ్ళతో కట్టి, తాటాకుకప్పిన పాకలలో ఒకదాంట్లో ఒక గదిపెట్టుకి నటరాజన్ మూడురూపాయలు అద్దె ఇస్తున్నాడు.

చిన్న ఇత్తడితాళం తెరిచి ఆ ఒంటిచెక్కతలుపు లోపలికి తోశాడు అతను -కీచుమంటూ తెరుచుకున్న ఆ తలుపు వెనకాల ఒకచాప, మరొక కొబ్బరితాటిమీద వేలాడుతున్న చొక్కా, కొన్నిపుస్తకాలూ తప్ప మరేం కనిపించలేదు సూర్యనారాయణకి.

అతను భయపడిపోయాడు. దరిద్రంఅంటే ఎలా ఉంటుందో ఏనాడూ ఎరగని సూర్యనారాయణకి ఆ దరిద్రం

ఇంత నగ్నంగా దర్శనంఇచ్చేసరికి ఎక్కడలేని భయమూ పుట్టుకువచ్చింది.

మెల్లిగా మీనాక్షి వెనకాల ఆ ఇంట్లో ప్రవేశించాడు.

'కూర్చోండి, ఇప్పుడే వస్తాను' అని మూలనున్న గాజుగ్లాసు తీసుకుని బయటికి వెళ్ళాడు నటరాజన్. సూర్యనారాయణ పడుతున్న అవస్థని మీనాక్షి గ్రహించింది.

'ఏం సూరిబాబూ, అలా ఉన్నావు?' అని నవ్వుతూ అడిగింది.

సూర్యనారాయణకూడా నవ్వేసి 'నిజంగా నేను చాలా అర్భకుడిని సుమా మీనాక్షి!' అన్నాడు.

'నువ్వు అదృష్టవంతుడివి సూర్యం. దరిద్రంఅంటే ఏమిటో, ఆకలి ఎంత భయంకరంగా ఉంటుందో, ఆ ఆకలి బాధకు తాళలేని తల్లిదండ్రులు కన్నపిల్లల్ని పశువులకన్న కనాకష్టంగా ఎట్లా చూస్తారో ఇవేవీ నీకు తెలియవు - మీ అమ్మ తప్పుచేసిందని ఆమెను ద్వేషిస్తూ - చాలా కష్టదశలో ఉన్నానని నిన్ను నీవే భ్రమపెట్టుకుని సానుభూతి చూపించుకుంటూ ఇంతవరకూ గడిపావు. నీ కష్టం అసలు కష్టాల్లోకి ఏనాటికీ రాదని నీవు తెలుసుకోవటం చాలా అవసరం'

సూర్యనారాయణ మాట్లాడలేదు.

'తినటానికి తిండిలేని తండ్రి అన్నం అడిగాడనే కోపంతో అయిదేళ్ళపిల్లాడిని నేలకేసిబాది చంపటం నీ వూహకి అందదు - చేసిన అప్పు తీర్చలేక యవ్వనంలో ఉన్న కూతుర్ని వ్యభిచారగృహానికి పంపటమంటే ఏమిటో నీకు

ఏనాటికీ బోధపడదు - తమ్ముడి జీతంకట్టటంకోసం రాత్రిళ్ళు రిక్షాలాగే అన్నగారి ఔదార్యమేమిటో నీకు అర్థంకాదు- ఈ ప్రపంచంలో తల్లి తప్పుచేసిందని బాధపడటంకన్న కష్టం లేదని నువ్వు అనుకుంటున్నావు. ప్రపంచాన్ని ఒక్కసారి విచ్చగొడితే కనిపించే పురుగులముందు నీ తల్లి చాలా ఆరోగ్యవంతురాలు సూర్యం!' అన్నది మీనాక్షి.

గ్లాసులోఉన్న టీని రెండుభాగాలుచేసి, అక్కగారికీ సూర్యానికీ అందిస్తూ 'ఏమిటి చెపుతున్నావు?' అన్నాడు అక్కగారివంక చూసి నటరాజన్.

'ఏంలేదులే తమ్ముడూ - ఇప్పుడు నువ్వేంచేస్తున్నావు? ఒంట్లో కులాసాగాఉందా?' అన్నది మీనాక్షి.

నటరాజన్ నవ్వి 'భూలోకస్వర్గంలో దేవదూతగా ఉంటున్నాను' అన్నాడు.

'అదేమిట్రోయ్!'

'అది అంతేలే - మీ రెక్కడుంటున్నారు?'

'ఏదో హోటల్లో దిగాం. సాయంత్రం ఇక్కడికొచ్చేస్తాంలే'

'నువ్వు ఫరవాలేదనుకో - ఆయన ఉండగలరా మరి?'

'ఏం సూర్యం?' అన్నది మీనాక్షి.

సూర్యనారాయణకి దడ ప్రారంభమయింది. ఈ మంచంన్నరగదిలో ఎలా బ్రతుకుతారు - మనుష్యులు? అతను మాట్లాడలేదు.

'సూర్యం!'

తలెత్తి చూశాడు సూర్యనారాయణ.

'నువ్వేమీ అనుకోకుండా ఉంటే ఒక విషయం చెప్తాను'

చెప్పమన్నట్లు తలఊపాడు సూర్యనారాయణ.

'నీకు కష్టాలంటే, కన్నీరంటే, దుష్టరోగంకన్నా నికృష్టమైన దరిద్రమంటే ఎప్పుడూ తెలియలేదు. ఇప్పుడు తెలియటంమాత్రం దేనికి? నా అదృష్టంవలన ఒకవారంరోజులలోనే నటరాజన్ కనిపించాడు. నీ సహాయానికీ అభిమానానికీ నేను చాలా కృతజ్ఞురాల్ని. నీవు మీవూరు వెళ్ళిపోవటం చాలా మంచిది' అన్నది మీనాక్షి.

'నీవు ఎలాచెపితే అలాగే చేస్తాను' అని నీరసంగా సమాధానంయిచ్చాడు సూర్యనారాయణ. మీనాక్షి సూర్యనారాయణకి దగ్గరగా జరిగి అతని రెండుచేతులూ పట్టుకొని

'ఈలోకంలో నీకన్న ఆప్తులెవరూ లేరు నాకు. నిన్ను అపరిమితంగా ప్రేమిస్తున్నాను - అందుకే వెళ్ళిపొమ్మంటున్నానుకూడా. నీవు నీ కులానికి అతీతమైన గౌరవాన్ని పొందాలి - గొప్పవాడివి కావాలి. ఏకులమయితేనేం? అతడు గొప్పవాడు అనిపించుకోవాలి. అలా అని నా చేతిలో ఒట్టువెయ్యి' అన్నది.

సూర్యనారాయణ ఆమెచేతిలో తనచేతిని ఉంచాడు.

'మరోమాట - లోకంలో జరిగే కొన్ని ఘోరాలతో పోలిస్తే నీ తల్లి అసలే పాపమూ ఎరుగదు. ఆమెని ద్వేషించటం మానివేస్తానని మాటఇయ్యి'

'ప్రయత్నిస్తాను'

'నీ వొక చిత్రమైనవ్యక్తివి సూర్యం. నీ వ్యక్తిత్వంలాంటి వ్యక్తిత్వం అందరికీ ఉండదు. రాగద్వేషాలు ఇంత

బలంగా అందరూ చూపించలేరు. కాని, సూర్యం! ఒక్క మాట. నీ రాగాన్ని చూపించు, ఫరవాలేదు. నీ ద్వేషాన్ని మాత్రం నీలోనే దాచుకోవటం చాలా మంచిది'

'అలాగే'

'ఒక్క సంగతి. నీ కేదయినా అవసరం కలిగినప్పుడు నేను ఉన్నానని గుర్తుంచుకో. నానుంచి నీవు పొందలేనిది - ఏమీ లేదు - నా కోసం కార్డుముక్క వ్రాస్తే పరిగెత్తుకువస్తాను... ఇంకో పదినిమిషాల్లో బండి ఉంది, వెడతావా మరి'

సూర్యం మాట్లాడకుండా లేచి నిలబడ్డాడు. అతని కంఠంనిండా దుఃఖం ఉన్నది. మాట్లాడితే అది పైకి పొంగుతుంది. జేబులోఉన్న డబ్బులోంచి ఒక పదిరూపాయలనోటు తీసుకుని మిగతాడబ్బు అక్కడ పెట్టి, నిశ్శబ్దంగా బైటికి వెళ్ళిపోయినాడు సూర్యనారాయణ.

అతను చూపులోంచి దాటిపోగానే వెక్కి వెక్కి ఏడుస్తూ చాపమీద పడిపోయింది మీనాక్షి.

అక్కగారితల నిమురుతూ 'అక్కా, ఏడుస్తున్నావా? చివరికి నువ్వుకూడా ఏడుస్తున్నావన్నమాట!' అన్నాడు.

మీనాక్షి చప్పున లేచి కళ్ళుతుడుచుకుని, 'ఎందుకో ఏడుపొచ్చింది తమ్ముడూ. ఇది రెండోతడవ... ...సరేలే, సూర్యంఇచ్చినడబ్బుతో వంటగిన్నెలూ బియ్యం కొనుక్కుందాం పద' అని లేచి నిలబడింది.

'ఓ! స్త్రీ నీ హృదయం ఎంత చిక్కుసమస్య!' అనుకున్నాడు నటరాజన్ - రచయిత కాబోతున్న నటరాజన్.

# 6

'పూర్వం ఒకరూపాయికి ఉన్న కొనుగోలుశక్తి ఈ నాడు ఉండటంలేదు' అని నిట్టూర్చాడు వరదరాజు. అంత వరకూ తలవంచుకొని ప్రూఫులుదిద్దుతున్న నటరాజన్ తలఎత్తి,

'పూర్వం ఒకరూపాయికోసం చేసినంతపని యీనాడు చేయటంలేదు కనుక' అన్నాడు.

వరదరాజులు ఆ మాసపత్రికఎడిటరుగారికి ఆప్త మిత్రుడు. సంతకం పెట్టటంకూడా సరిగా రాదు అతనికి. అయితే ఏం? అతనంతమేధస్సుకలవ్యక్తి ఇంకెవరూ లేరు. చాలా డబ్బుంది. రెండు అడితీలూ, మూడు టీషాపులు, నాలుగు కిల్లీకొట్లూ, ఒక కూల్ డ్రింక్ షాపూ నడుపు తున్నాడు. ఏ కొంచెం తీరికచిక్కినా పత్రికా కార్యాలయా నికి వచ్చి, కూర్చుని, కబుర్లుచెవుతూఉంటాడు. ఎందుకో తెలియదుగాని, అతనికి నటరాజన్ అంటే చాలా ఇష్టం ఏర్ప డింది. మొదలకుండా ఒక మూల కూర్చుని తనపని తను చేసు కుంటూనే అద్భుతమైనపదో ఒకమాట అంటాడు నటరాజన్.

అందుకే నటరాజన్ అంటే వరదరాజులుకి ఇష్టం. నట రాజన్ పై సమాధానం చెప్పగానే

'భేష్... సరేగాని, నటరాజన్! ఇంత చక్కగామాట్లా తావు, ఓ రెండు కథలు వ్రాసిపారెయ్యకూడదూ' అన్నాడు.

'వ్రాస్తే ఏంలాభం, అచ్చుపడవద్దూ?'

'అదేమిటోయ్; అలా అంటావు, మాసపత్రికలో పని చేస్తూను? - నువ్వు కథవ్రాయి, అచ్చువేయించేభారం నాది'

వరదరాజులు అన్నమాటకి అంతవరకూ తలవంచుకుని ఏదో వ్రాస్తున్న ఆంజనేయులుగారు తలఎత్తి,

'నువ్వు వ్రాస్తావా నటరాజన్?' అన్నారు. ఆయన ఆ మాసపత్రికకి ఎడిటరు. ఆపత్రికకి పెద్ద సర్క్యులేషన్ లేదు గానీ, పత్రికఖర్చు గడిచిపోగా ఆంజనేయులుగారి సంసారానికి కావల్సిన రాబడి వస్తున్నది దానిమీద. అంతకన్న ఎక్కువేమీ ఆయన ఆశించలేదుకూడా. కాకపోతే, అందులో వ్రాస్తున్నరచయితలకి పెద్ద ప్రతిఫలమేమీ ఆయన ముట్ట చెప్పలేకపోతున్నాడు. అందు కాయన అనుక్షణం విచారిస్తూనేఉంటాడు. ఎడిటరుగా తనకున్న బాధ్యతల్ని ఆయనెప్పుడూ దుర్వినియోగం చెయ్యలేదు. ఒకవ్యక్తినిగాని, ఒకపార్టీనిగాని ఆయన నిందించటం ఏనాడూ జరగలేదు.

నటరాజన్‌కి ఆంజనేయులుగారంటే అపరిమితమైన గౌరవం. టిజుయానాలో పాపపుంజాల్ని తిలకించి తిలకించి విసుగెత్తిపోయిన నటరాజన్‌కి ఆపత్రికాకార్యాలయం-ఆపేద సంపాదకుడూ, సిరామరకలతో నిండినపాతటేబిలూ, మసితో నిండిన కాగితంపీలికలూ ఎంతో శాంతినిచ్చేవి.

ధర్మంలో శాంతీ, అధర్మంలో అశాంతీ ఉంటుందనే విషయం అతను అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు.

ఆంజనేయులుగారు అడిగిన ప్రశ్నకి నటరాజన్ సమాధానంచెప్పకుండా రెండునెలల్నించీ తన జేబులోఉన్న కథ తీసి ఆయనటేబిలుమీద పెట్టి మళ్ళీ తలవంచుకుని ప్రూఫులు దిద్దటం ప్రారంభించాడు.

వరదరాజులు పకపకా నవ్వి 'బిగ్గరగా చదవండి పంతులుగారూ, నేనూ వింటాను' అన్నాడు.

ఆంజనేయులుగారు అదివరకు తనచేతిలోవున్న పనిని కట్టిపెట్టి నటరాజన్‌కథ చదవటం ప్రారంభించారు.

కథపేరు నెత్తుటిస్పర్శ - అన్నదమ్ములకీ, తల్లి తండ్రులకీ ఉండే నెత్తుటిస్పర్శ అద్వితీయమయిందేమీ కాదనీ, ఏ మమతలకయినా మూలకారణం ధనమేననీ - ఈ నెత్తుటి స్పర్శ ఈ మమకారాలూ అన్నీ పుస్తకాల్లోకనిపించే మాటలనీ ఆ కథసారాంశం.

భాష చాలా స్వచ్ఛంగా - వాక్యాలు సూటిగా కథ నిజాయితీగా నడిచింది.

'నిజమేనయ్యా, నువ్వు వ్రాసిందంతా నిజమే. ఏమంటారు పంతులుగారూ?' అన్నాడు వరదరాజులు.

'కొంతవరకు నిజమేగాని - బొత్తిగా అంత అన్యాయంగాఉంటుందా అని?' అన్నారు ఆంజనేయులుగారు.

నటరాజన్ మాట్లాడలేదు.

వరదరాజులే తిరిగీ అందుకున్నాడు.

'అంతా నిజమే పంతులుగారూ - నా చిన్నతనంలో మా అమ్మ నా కోమాదిరిగా మా అన్న కోమాదిరిగా అన్నంపెట్టేది. నాకు వెన్నపూసవేసి రహస్యంగా తినమనేది. దానికి కొన్నాళ్ళు సంతోషించానుకూడా. తరువాత తెలుసుకున్నాను, ఆవిడ తిన్నట్లు నాకూ పెట్టదని'

'తల్లినిగురించి అలా మాట్లాడకూడదు వరదరాజులూ'

'ఇందులో అబద్ధంలేదు పంతులుగారూ - అన్నిటికీ డబ్బే ముఖ్యం అనుకోండి'

'అన్నిటికీ డబ్బే ముఖ్యంఅయితే- నాకు డబ్బులేదు, నటరాజన్‌కి అసలే లేదు - నువ్వు డబ్బున్నవాడివి- అయినా మమ్మల్ని ఎందుకు అభిమానిస్తున్నావు?'

'ఇప్పుడు నావిషయం కాదు పంతులుగారూ, నేను చెప్పింది. లోకవిషయం. నాకు డబ్బంటే మంట. తమాషా ఏమిటంటే, డబ్బంటే నాకు ఎంత కోపమో అంత డబ్బు ఒచ్చిపడుతున్నది. ఆ డబ్బుని ఏదో ఒకటి చెయ్యాలి కనుక తాగుతాను, బ్రాకెట్లు ఆడుతాను. ఆడవాళ్ళకి ఖర్చుపెడ తాను. అయినా శాంతిలేదు. అప్పుడప్పుడు మీలాటి సహృదయులతో మాట్లాడితే ఎంతో కులాసాగా ఉంటుంది' అని నిట్టూర్చాడు వరదరాజులు.

దిద్దుతున్న ప్రూఫులు పక్కనపెట్టి నటరాజన్ వరదరాజులు చెప్పేది విననారంభించాడు.

'డబ్బుతో మంచిపనులు చేస్తే శాంతిగా ఉంటుంది' అన్నారు ఆంజనేయులుగారు.

'నేను కొన్నాళ్ళు కాలేజీకుర్రాళ్ళకి జీతాలు కడుతూ ఉండేవాడిని - అందులో ఒకడు జీతంకోసంఅని నాదగ్గర పట్టుకెళ్ళిన డబ్బుతో నేను వెళ్ళినఇంటికే వచ్చాడు - ఆరాత్రి వాడిఅవసరమూ నా అవసరమూ నా డబ్బుతోనే తీరినయ్యి. ఆమాటకొస్తే ఏది మంచో ఏది చెడో ఇంత మటుకూ నాకు అర్థంకాలేదు'

'చదువుకుంటే తెలుస్తుంది?'

'చదువుకోకుండానే ఇన్ని ఆలోచనలతో చస్తున్నాను గదా - చదువుకుంటే ఆ వేడి భరించలేక నా బుర్ర పేలి పోతుందేమోనని నా భయం'

'నీఅంత స్వచ్ఛమైన మనిషిని నేను ఇంతవరకూ చూడలేదు వరదరాజులూ' అని నవ్వారు ఆంజనేయులుగారు.

'ఇంతకూ మీా పత్రికలో నటరాజన్‌కథ వేస్తారా వెయ్యరా ?'

'ఎందుకు వెయ్యను ? - కంపోజుకిచ్చా నటరాజన్' అన్నారు ఆంజనేయులుగారు.

నటరాజన్ ఆనందానికి అవధిలేకపోయింది. ఈరోజు తనజీవితంలో ఒక అపూర్వసంఘటన జరిగింది. పుట్టినదగ్గర నుంచి దరిద్రంతోనూ ఆకలితోనూ నిరాశతోనూ బ్రతుకు తున్న తన బతుకులో ఒక విద్యుల్లత తళుక్కుమన్నది.

తను రచయిత. ప్రపంచంలో జీవిస్తున్న మానవకోటి కంతటికీ ఆలోచించిపెట్టగల మేధావంతులలో తానూఒకడు- అతని మొదటికథ అచ్చుఅవబోతున్నది- దీనికికారణం వరద రాజులు.

నటరాజన్‌కన్నులలో తళుక్కుమన్న కృతజ్ఞతని వరదరాజులు పసికట్టి చాలా తృప్తిపడ్డాడు.

'నాకు చదువురాదు కనుక, నీవు కథవ్రాసినప్పుడల్లా చదివి వినిపిస్తూఉండు' అని నవ్వాడు వరదరాజులు.

తాను ఈనాడు అధిరోహించబోతున్న అత్యున్నత శిఖరంనుంచి పడిపోకుండా రక్షించమని భగవంతుని మనసు లోనే ప్రార్థించాడు నటరాజన్.

అప్పటికి సాయంత్రం అయిదయింది - ఏడింటికల్లా టెజుయూనాలో డ్యూటీకి వెళ్లాలి. నటరాజన్ లేచి నిలబడ్డాడు వరదరాజులుకూడా నుంచుని

'వస్తాను పంతులుగారూ గవర్నరుపేట టీకొట్లో పంచదార అయిపోయిందట. కొండయ్య గోలెడుతున్నాడు. పోయి ఇప్పించాలి' అంటూ సమాధానానికికూడా ఎదురు చూడకుండా వాకిట్లోకి నడిచాడు.

కొన్నిఅడుగులు నడిచింతరువాత నటరాజన్ - వరద రాజులు రెండుచేతులూ పట్టుకొని,

'మీరు నాకు చాలా ఉపకారంచేశారు' అన్నాడు.

'నేను చేసిందేముందయ్యా పిచ్చివాడా! అంతా ఆ ఏడుకొండలవాడిదయ - నువ్వు గొప్పవాడివయితే నాకంటే సంతోషించేవాళ్ళుండరు' అని నవ్వాడు వరదరాజులు.

అప్పటి కిద్దరూ దుర్గాకళామందిరందగ్గరికి నడిచారు. నటరాజన్ సందేహిస్తూ 'ఒక్క మనవి' అన్నాడు.

'ఏమిటది ?'

'ఆ కనిపించేదే మా ఇల్లు. ఒకసారి దయచేస్తే ...'

'ఓస్, ఇంతేనటయ్యా! ఈ మాత్రానికే అంత సందేహించాలా? పద పద. ఎక్కడ?' అన్నాడువరదరాజులు.

ఇద్దరూ వచ్చేసరికి మీనాక్షిచిరిగినచీర కుట్టుకుంటున్నది

'మా అక్కయ్య' అన్నాడు నటరాజన్.

'అలాగా, అయితే నాకూ అక్కయ్యే. అక్కయ్యా, కాసిని మంచినీళ్ళియ్యి తల్లీ' అన్నాడు వరదరాజులు. మీనాక్షి లేచివెళ్ళి మంచినీళ్ళిచ్చింది. అవి త్రాగి 'వస్తా

నయ్యా పంతులూ, వస్తానమ్మా అక్కయ్యా. అర్జెంటు పనుంది. మళ్ళీ ఒకసారి వస్తాలే' అని వెళ్ళిపోయినాడు.

'ఎవరితను ?' అన్నది మీనాక్షి.

'వరదరాజులు'

'చాలా చిత్రమైనవాడే !'

'అవును, ఈనాడు నాకు చాలా ఉపకారం చేశాడు... అన్నం ఉంటే పెట్టు, పోతాను, డ్యూటీకి టైమవుతున్నది' అని కాళ్ళూ చేతులూ కడుక్కోవటానికి వాకిట్లోకి వెళ్ళాడు నటరాజన్.

ఉట్టిమీదనుంచి గిన్నెదించి కంచంలో అన్నంవడ్డించి, ఇంత ఉల్లిపాయకారం దొండకాయకూరా వడ్డించింది మీనాక్షి.

అన్నంకలుపుకుంటూ 'చల్ల మరో అణావి తీసుకోవే అక్కయ్యా, వేసంకాలం' అన్నాడు.

మీనాక్షి మాట్లాడలేదు-మరో ఉట్టిమీదనుంచి పులుసు తీసి వడ్డించింది. అరవం మర్చిపోయినా సాంబారు మర్చిపోలేదు మీనాక్షి. ఆ పులుసువాసన కమ్మగా కొట్టింది నటరాజన్‌కి.

రెండుముద్దలు తిన్నతరువాత 'చివరికి మనిద్దరం మిగిలాం' అన్నాడు అతను.

మీనాక్షి మాట్లాడలేదు.

'ఏమిటి ఆలోచిస్తున్నావు?'

'భూషయ్యగారికి నేను జ్ఞాపకంలేనా అని'

'అదేమిటేవ్, ,ఆయనంటే అంత ప్రేమపుట్టుకు వచ్చింది?'

'భారతదేశంలో సతికి పతే దైవంకదరా మరి?' అని మీనాక్షి నవ్వింది.

ఆ నవ్వులో అగ్నిపర్వతాల వేడి-భూకంపాల విసురు, సముద్రగర్భంలోని దుఃఖం ఒక్కసారి కనిపించినయ్ నటరాజన్ కి.

'అక్క సుఖపడటంలేదు అనుకున్నా డతను ఆఖరి ముద్ద తిని, చెయికడుక్కుంటూ.

తమ్ముడు వెళ్ళిపోయినతరువాత ఆ ఎంగిలికంచం కడిగి సగంకుట్టిన చీర కుడుతూ కూర్చుంది మీనాక్షి.

ఆ ఇల్లు చాలా అసహ్యాకరమైన పరిసరాల్లో ఉంది-కాలువఒడ్డునే నాలుగు సిమెంటురాళ్ళతో చుట్టూ గోడలు పెట్టి మధ్యలో నిట్టాడి పాతి దానిమీద కప్పునిలబెట్టారు. అలాటిఇళ్ళు ఆ కాలువఒడ్డున చాలా ఉన్నయ్. ఆ ఇంట్లో మధ్యకి ఒక తడిక అడ్డంపెట్టి, ఇంకో కాపురం ఉన్నది. ముందు రోడ్డు-వెనుక కాలువపక్కన అలాటిఇళ్లేమరికొన్ని.

మీనాక్షి ఎంత ధైర్యస్తురాలయినా ఇలాటి వాతావరణాన్ని ఎన్నడూ చూసిఉండలేదు- ఇంట్లో మరోవాటాలో చిన్నమ్మ ఉంటున్నది- శుభ్రమైన రైతుకుటుంబంలో పుట్టిన చిన్నమ్మ కొన్ని అనివార్యకారణాలవల్ల విజయవాడ వచ్చి స్వేచ్ఛగా బ్రతుకుతున్నది. వాయిలుచీరలు కడుతుంది. రోజూ సినిమాకి వెడుతుంది- పుట్టెడునంగితో ఉన్న చిన్నమ్మ అంటే కిల్లీకొట్టు రాములుకి చాలా ఇష్టం. అది వెధవపని

చేసినప్పుడల్లా దాన్ని తంతూ - లేనప్పుడు కోడిమాంసం కొనుక్కొచ్చి దానికిస్తూ - దాని సంగీతపుమాటల్ని బాల మురళీకృష్ణసంగీతం వింటున్నట్లు వింటూ బ్రతికేస్తున్నాడు రాములు. వాడు ఒక్కరోజు రాకపోతే దానికి తోచదు.

ఇక కుడివైపుఇంట్లో ఇడ్లీలువేసి అమ్ముకునే ఒక ముసలమ్మా మనుమరాలూ ఉన్నారు. ఆ మనుమరాలు మిషన్‌కుడుతుంది. ఆ ముసల్ది పొద్దున్నే లేచి ఇడ్లెన్నవాయితీసి అమ్ముకురావటానికి వెడితే మనుమరాలు ఇంటికొచ్చి కొనుక్కునేవాళ్ళకి ఇడ్లెన్ను అమ్ముతుంది. ఆ బజారు బజారంతా పిచ్చమ్మ ఇడ్లెన్నే కొంటారు. ఇక రాత్రిళ్ళు పిచ్చమ్మ మనుమరాలి సంగీతం వినేందుకు చాలామంది వచ్చి పోతూఉంటారు. ఆ నవ్వులూ కేరింతలూ హార్మోనియమ్ మీద సినిమాపాటలూ, సోడాబుడ్డికొట్టిన చప్పుళ్ళూ నిరంతరాయంగా తెల్లవారుఝామునదాకా వినిపిస్తూనేఉంటాయి.

ఎడంవైపుఇంట్లో బేబీ, దానితమ్ముళ్ళూ, చెల్లెలు సరళా; తల్లీ ఉంటున్నారు. బేబీకి ఇద్దరుపిల్లలు. తండ్రి అంటూ ఆ పిల్లలకి లేడు. అదీ దానిచెల్లెలూ పాచిపన్లుచేస్తారు. మనుమడినీ మనుమరాలినీ నులకమంచం తిరగేసి ఇంటి ముందు వేసుకొని ఆడిస్తూ అక్షులూపక్షులూరాత్రేళ్లు లోకుల్ని తిడుతూఉంటుంది బేబీతల్లి.

బేబీతమ్ముళ్ళల్లో ఒకడు లారీల్లో పనిచేస్తాడు. రెండోవాడు సోడాబండి లాగుతాడు. సామాన్యంగా వాళ్ళిద్దరూ ఇంటికి డబ్బుఇవ్వరు. పదహారేళ్లు ఒకడికీ, పధ్నాలుగుపళ్ళు ఒకడికీ ఉంటాయి. ఏ నాలుగురోజులకో ఒకసారి వాళ్లు ఇంటికి

వస్తే వాకిట్లో వాళ్ళనిచూడగానే తల్లి తిట్టటం ప్రారంభిస్తుంది. కుర్రాళ్ళిద్దరూకూడా తల్లికేమీ తీసిపోరు. కాసేపు తల్లీకొడుకులు ఒకరిమాట ఒకరికి వినపడకుండా తిట్టుకున్న తరువాత, పిల్లలదార్ని పిల్లలు వెళ్ళిపోతారు.

మళ్ళీతిరగేసిఉన్న నులకమంచంమీద కూర్చుని తిట్టటం ప్రారంభిస్తుంది తల్లి.

బేబీచెల్లెలు సరళకి పన్నెండేళ్ళు ఉంటాయి – కొబ్బరినూనె కొనలేక తల్లి దానికి జుట్టుతీయించింది. తీయించిన ఆ జుట్టుకోసం రోజూ ఒకతడవ విలక్షణంగా ఏడుస్తుంది అది.

ఇంటికెదురుగా బూబమ్మ దుకాణం ఉంది. ఈ బజారులో ఎవరికే అవసరంవచ్చినా రూపాయికి బేడ వడ్డీతీసుకుని అప్పులిస్తుంది బూబు. మొత్తంఅందరికీ అది పెట్టుబడిదారిణి కావటంవలన అసంటే మొత్తంవీధివీధంతటికీ షాడలు.

కొన్ని సమయాల్లో ఆ ఇళ్ళల్లో మహాకూజితాలు వినిపిస్తాయి – ఇంకొన్నిసమయాల్లో గోత్రస్ఖలనాలు వినిపిస్తాయి – మరికొన్ని వేళల్లో బలాత్కారంవలన కలిగిన యమయాతనతో కూడిన ఆర్తనాదాలు వినిపిస్తాయి.

దరిద్రం – విశృంఖలత – సిగ్గులేనితనం–అనారోగ్యం–అబద్ధాలు – గొంతుకోసుకోడాలు–అక్కడ అతి మామూలు విషయాలు.

మీనాక్షి వీటికి ఇప్పుడిప్పుడు అలవాటుపడిపోయింది. మొదట్లో వెగటుగాఉండేది– ఇల్లుమార్చమని నటరాజన్తో అంటే టిజుమానాలో సభ్యత, ధనం అనే ముసుగుల

చాటున జరిగే ఘోరాలతోనూ నేరాలతోనూ పోల్చిచూస్తే ఈకాలువగట్టుగుడిసెలు- స్వర్గకుటీరాలే' అన్నాడు.

ఒక్క సంగతిమాత్రం నిజం. వీళ్ళు మానవులు. మానవత్వం వీరి నింకా వదిలిపోలేదు - అనికూడా వ్యాఖ్యానించాడు. ఇప్పుడు మీనాక్షి వాటికి అలవాటుపడిపోయింది. ఆకలిఉన్నచోట అవినీతి ఉండకతప్పదనే విషయం జీవితం ఇచ్చిన అనుభవంవలన తెలుసుకోగలిగింది మీనాక్షి.

కనుకనే ఇప్పుడామె దేనికీ ఆశ్చర్యపడటంలేదు. జీవితాన్ని జీవితంగానే చూస్తున్నది. రంగుఅద్దాలతోనూ వికృతపుదుస్తులతోనూ విభిన్నకోణాలతోనూ జీవితాన్ని పరిశీలించడం మానుకుంది ఆమె.

జీవితంలో యథార్థాన్ని తెలుసుకోటమే నిజమైన కళాస్వాదన.

ఒకపదినిమిషాలుగా చిన్నమ్మఇంట్లోనుంచితరంగాలు-తరంగాలుగా వస్తున్న తిట్లు మీనాక్షిని ఉక్కిరిబిక్కిరిచేస్తున్నయ్. ఇంతలో రెండుదెబ్బలు కొట్టిన చప్పుడు - దాని వెంటనే చంపేస్తున్నాడర్రోయ్ అనే కేక - ఆ కేకచివర గాలానికి చేపలా చిన్నమ్మ వచ్చి మీనాక్షిముందు పడ్డది.

చిన్నమ్మ వెక్కివెక్కి ఏడుస్తున్నది. మీనాక్షికి తెలుసు చిన్నమ్మ ఎందుకేడుస్తున్నదో- రాములుచేతదెబ్బలు తినకపోతే దానికి తోచదు- అందుకని రోజూ ఒకసారయినా వాడితో పోట్లాడి, ఆ పోట్లాటతాలూకు వివరాన్ని మీనాక్షికి వినిపించి వెడుతుంది చిన్నమ్మ.

మీనాక్షి నవ్వుతూనే 'ఎందుకు చిన్నమ్మా' అని అడిగింది.

'వీడినోరుబడ! - వీడిచేతులిరగ !'

'విషయం చెప్పు మరి?'

'కొట్టాడండీ - చూడండి మీనమ్మగారూ! ఇమాం గాడిని నేను రమ్మన్నానా చెప్పండి-వాడేవప్పుడన్నా వస్తాడు. నే నేమన్నా బుద్ధితక్కువపనిచేస్తే చెప్పుతీసుకు తన్నండి, పడతాను. అన్నదమ్ముడిలాగా వాడు వస్తుంటే - ఎలా కాదనటం చెప్పండి' అన్నది చిన్నమ్మ.

మీనాక్షి తనలో తనే నవ్వుకుంది. చిన్నమ్మ ఎవరి విషయంలోనూ నీతిగాఉండదు. రాములు అవేమీ పట్టించు కోడు. ఇమాం విషయంలో అది నిజంగానే నీతిగాఉంటుంది. అయినా రాములు చావగొడుతూనేఉంటాడు. చిన్నమ్మఅంత రాంతరాల్లో ఏమూలో మిగిలిపోయిన స్త్రీత్వంమాటున పచ్చి ఆరనివలపుహారక్రింద ఇమాం వేలిముద్రలు కొన్ని ఉన్నయ్.అవి చెరగవు. అందుకే రాములికి ఇమాంఅంటే తగనిఅసూయ.

'రాములుచేతిలో రోజూ దెబ్బలుతినకపోతే వాడు చెప్పినమాట వినరాదూ?' అంది మీనాక్షి.

'ఎందుకు వినాలి? వాడేం పెట్టిపోషిస్తున్నాడా? నా పొట్ట నేను నింపుకుంటుంటే, మద్దెన ఈడి జులుం ఏటి?'

'అలాఅని ఊరుకోవుగామరి-వాడు రెండురోజులు రాక పోతే వెతుక్కుంటూ పోతావయ్యె !...'

'ఆడదానిమనసు అంతటిది కావటంవల్లనే మొగసచ్చి నోడికి అంత లోకువ'.

చిన్నమ్మ జవాబుకి నవ్వింది మీనాక్షి. యుగయుగాలుగా గట్టిపడని స్త్రీఅంతర్యం స్పాంజిలా కన్నీటిని పీల్చుకునే స్త్రీఅంతర్యం అతి పేదరాలుగా ఆమెకళ్ళకు కట్టింది.

ఈ వాతావరణంలో కూడా జీవించవచ్చును. ఇక్కడ కూడా బ్రతుకు తన చైతన్యపుకోరలని ఝుళిపిస్తూనే ఉంది. ఆకోరడా విదిలింపులోనుంచి చిరునవ్వులూ కన్నీటిచుక్కలూ రాలుతూనేఉంటాయి.

నటరాజన్ అన్నట్లు వీరంతామానవులే. మానవత్వం ఇంకా వీరిలో చావలేదు.

'సరేగాని, చిన్నమ్మా! ఎక్కడయినా వంట పని ఉంటే చూపిద్దూ. ఏమీ తోచటంలేదు' అన్నది మీనాక్షి. చిన్నమ్మ ఒళ్ళువిరుచుకుని 'బేబీని అడక్కపోయి నారా అమ్మగారూ? అది పనిచేసేఇంట్లో ఎవరికో కావాలంది' అని సలహాచెప్పింది.

మీనాక్షి ఆలోచించింది. కాలక్షేపానికన్నా తను ఏదో ఒకపని చేయాలి. 'నటరాజన్‌ని అడిగి ఏసంగతీ చెప్తాలే చిన్నమ్మా' అన్నది.

ఆ సాయంత్రం నటరాజన్‌తో సంప్రదించినతరువాత వంటచేయటంకన్న అగ్గిపెట్టెలఫ్యాక్టరీలో ప్రవేశించటం మంచిదని తేల్చుకుంది మీనాక్షి.

# 7

దేవదాసీ నృత్యసంప్రదాయం మన తెలుగుదేశంలో గొప్ప పేరెన్నికగన్న సంప్రదాయం. ఆ సంప్రదాయంలో గొల్లకలాపం భామాకలాపం చెప్పుకోదగ్గవి. ఆరోజుల్లో సింహాచలానికి పెద్ద పేరుఉండేది. సింహాచలానికి 75 సంవత్సరాలు దాటినా పలుకుగాని - మాట ధాటిగాని తగ్గలేదు. సింహాచలం తన ఏడవఏటనే నాట్యంలో శిక్షణపొందటం ప్రారంభించి, పదిసంవత్సరాలు నిండేసరికే నాట్యప్రదర్శనలు ఇవ్వటం ప్రారంభించింది.

మేళాలుచేయటానికి ఆమె ఎన్నడూ సుముఖత చూపలేదు. కాలవ్యయమూ ధనవ్యయమూ అయినా, చాలా పట్టుదలతో - అపరిమితమైన భక్తిశ్రద్ధలతో చాలాకాలం గొల్లకలాపం నేర్చుకున్నది సింహాచలం. ఆ నృత్యానికి అవసరమైన సంగీతం తాళలయలు అడుగులు అభినయవిశేషాలు భాషాజ్ఞానం సాకల్యంగా నేర్చుకొని- గొల్లకలాపంలో సింహాచలం అందెవేసినచెయ్యి అనిపించుకుంది.

కనకవల్లి గ్రామవాస్తవ్యులైన పెదరావూరి రామయ్యగారు దానికి ప్రథమగురువులు. తరువాత సిద్ధాంతం అశ్వత్థనారాయణగారిదగ్గర తనవిద్య పూర్తిచేసుకుంది. సింహాచలం గొల్లకలాపం సంపూర్ణంగా నేర్పిన ఖ్యాతి అశ్వత్థనారాయణగారిదే. చినసుబ్బయ్య పెదసుబ్బయలనే అన్నదమ్ములు సింహాచలం నాట్యానికి హంగుదారులుగా ఉంటూ ఉండేవారు. అనేక గొప్పగొప్పసభలలో ప్రదర్శనలుఇచ్చి అఖండ

ఖ్యాతి ఆర్జించుకొన్నది సింహాచలం. తనకి ఏభయిఏళ్ళు వచ్చే వరకూ నృత్యం మానలేదు.

గురువులంటే సింహాచలానికిఎనలేనిభక్తి. గొల్లవేషము చక్కగా అవగాహనచేసుకుని, బహునేర్పుగా ప్రౌఢంగా ప్రదర్శించేది - రకరకాల అభిరుచులుగల ప్రేక్షకులకి అనుకూలంగా మధ్యమధ్య శ్లోకాలు, సంస్కృతగీతాలూ, అధ్యాత్మరామాయణం పాడి అభినయిస్తూ ప్రదర్శనం రక్తికట్టించేదట. భుక్తికీ రక్తికీ పనికివచ్చే చౌకబారు జావళీలు అభినయించడమంటే సింహాచలానికి గిట్టేదికాదు. ఆరోజుల్లో దేవదాసీలకు వివాహంచేయాలనే వాదం రాగా, సింహాచలం దాన్ని వ్యతిరేకించింది. 'నాట్యం చేసేవారికి వివాహాలు సూచిస్తున్నారు, బాగానేఉన్నది. అసలు నాట్యకళ భవిష్యత్ నిగురించికూడా ఆ సంస్కర్తలు ఆలోచిస్తే బాగుండును' అని వాపోయింది.

'మా జాతికి కళవల్ల అపచారం జరుగలేదు. ఆ కళాస్వాదనం కళాభ్యున్నతి తెలియని మగజాతివలన మాకు అపకారం జరిగింది' అన్నది సింహాచలం.

గొల్లవేషమూ - భామవేషమూకూడా ఏకపాత్రాభినయాలు - గొల్లకలాపంలో నాయిక పరకీయ అవటంచేత మాసేవాళ్ళకు అది చిత్రంగాఉండేది - రెండు అభినయాలు కూడా సుకుమారమైన అంగవిన్యాసముతో - సూక్ష్మమైన భావప్రదర్శనంతో గీతవాచికాభినయ సౌలభ్యానికి అవకాశమున్న నృత్యాభినయాలు.

భామకంటె గొల్ల వేషం రక్తికట్టించటం చాలాకష్టం. బరువుగా నడిచే ఈ పాత్ర లోతైన ఆధ్యాత్మికవిషయాల్ని స్పృశిస్తుంది. ఒక్కొక్కసారి రసికులూ పండితులూ అయిన ప్రేక్షకులు సభలో ఉంటే - మూడురాత్రులు అభినయించేది సింహాచలం.

ఇప్పుడు సింహాచలం వృద్ధురాలయిపోయింది. విశ్రాంతాంగి అయింది. కృష్ణా రామా అని చుట్టకాల్చుకుంటూ - భాగవతం చదువుకుంటూ - ఈ సంధ్యాసమయాన్ని భక్తి వైరాగ్యాలతో గడిపివేస్తున్నది.

ఆమెయవ్వనంలో కొన్ని మధురానుభూతుల్ని అనుభవించకపోలేదు. ఆ అనుభవాలలో ఒకదానికి ప్రతిఫలంగా ఆమెకు కనకాంగి జన్మించింది. ఆమెకు తను నేర్చిన విద్యలే కాకుండా భరతంకూడ నేర్పించింది.

కనకాంగికి సూర్యనారాయణ జన్మించినరోజున తన జీవితం సఫలమైందని భావించింది సూర్యనారాయణని క్షణం క్రిందికి దించలేదు.

అనుకోకుండా సూర్యనారాయణ మాయమైనరోజు నించీ - కనకాంగి ధైర్యంగానే ఉంది కాని, సింహాచలం మంచంపట్టింది. వ్యభిచారాన్ని అసహ్యించుకునే సింహాచలం కనకాంగికోసం ఎవరైనా వస్తే, ఆహ్వానించింది. కడుపు మాడినా కన్నీరుపెట్టని సింహాచలం సూర్యనారాయణ మాయమైనరోజున మంచంపట్టింది. ఆదర్శకళాకారిణి సింహాచలం ప్రస్తుతం వేశ్యమాతగా తయారయి తనస్థితికి తనే విచారిస్తూ చరమజీవితాన్ని భారంగా గడుపుతున్నది. దీని

కంతటికీ కారణం తనకూతురు సుముగమనంచేయటంవలన అనే నమ్మకం అంతరాంతరాల్లో ఆమెకు భాషిస్తున్నది.

మొదట తనఇంట బ్రాహ్మణబిడ్డ జన్మించనున్నాడని సంతోషించింది. తరువాత చీపురూ, అలుకూ తాకకుండా సూర్యనారాయణని పెంచింది

ఒకప్పుడు దేవదాసీల వివాహాలకు విముఖతచూపిన సింహాచలం ఈనాడు మొదలకుండా ఊసుకొంటోంది. సూర్య నారాయణకి పెళ్ళిచేసి చనిపోవాలని ఆమెవాంఛ. ఆమె వాంఛ పూర్తికాకుండానే సూర్యనారాయణ మాయంఅవ టంతో ఆమె మంచంపట్టింది.

ఆరుగంటలు దాటిన ఆ వేసవిసాయంత్రం చుట్ట కాలుస్తూ కూర్చున్న సింహాచలంకళ్ళల్లో నీటితెరచాటునుంచి సూర్యనారాయణ రావటం కనిపించింది.

'నా తండ్రి- నా బాబు వచ్చాడు' అని శోవజోయి కూలింది సింహాచలం.

పడకుండా పట్టుకున్నాడు సూర్యనారాయణ. మను మడు పసితనంలో తప్ప ఊహతెలిసినదగ్గరినించీ ఇంత ఆప్యా యత చూపించటం ఎరగని సింహాచలం అపరిమితంగా ఆనందపడిపోయింది - పోగొట్టుకున్న వస్తువేదో పొందినట్లు అనిపించింది దానికి.

'అమ్మలూ, అబ్బాయి వచ్చేడే' అని లోపలికి ఒక కేకవేసింది - 'ఒద్దులేవే. నేనే లోపలికి పోతాను' అంటూ లోపలికి వెళ్ళాడు సూర్యనారాయణ.

సరాసరి తల్లిగదిలోకి వెళ్ళిన సూర్యనారాయణకి తల్లి మంచంమీద ఆరణి పడుకునిఉండటం చిత్రం అనిపించింది. మెదలకుండా బయటికివచ్చాడు. కనకాంగి కాఫీకాస్తూ అడుగులచప్పుడు విని వెనక్కితిరిగిచూసింది.

'ఎప్పుడు వచ్చావు బాబూ?'

'ఇప్పుడే'

కనకాంగి కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత

'ఈ ఇల్లు నీది. ఈ వాకిలి నీది - ఇక్కడున్న ప్రతిదీ నీదే - నీదికానిది ఇక్కడేమీ లేదు - నువ్వు వెళ్ళవల్సిన అవసరంలేదు' అన్నది.

సూర్యనారాయణ సమాధానంఇవ్వలేదు.

'సరే, అయిందేదో అయిపోయింది. ఆ అమ్మాయిని అన్యాయంచేయలేదుగద - ఒకవేళ అలాచేస్తే అది మరింత తప్పు'

తల్లి సంస్కారానికి సూర్యనారాయణ మనసులోనే మెచ్చుకున్నాడు. తను మీనాక్షికి తల్లిని అసహ్యించుకోనని మాటఇచ్చాడు - మీనాక్షి ... తనని ఇంతగా ఆక్రమించుకుందేమిటి ? బహుశా ఆరణికూడా తను మీనాక్షిని ఆరాధించినట్లే ఆరాధిస్తున్నాడేమో తనతల్లిని - మరి తను అపార్థంచేసుకోటం దేనికి ? ... అపార్థమేకాదు, యథార్థం అయితే మాత్రం తప్పేమిటి ?

ఆంతర్యం అతిచిత్రమైనది. చెల్లెలు, భార్య, కూతురూ తప్పుచేస్తే మగవాడు అరచి గోలచేస్తాడు. అదే తనతల్లి తప్పుచేస్తే నిశ్శబ్దంగా ఉంటాడు - లోపలలోపలే యమయా

తన అనుభవిస్తాడు - వాడికి ప్రపంచంఅంటే అసహ్యం, మానవుడంటే మంట, జీవితంఅంటే వెగటు - ఇదీ పరిస్థితి. సూర్యనారాయణకూడా ఇన్నాళ్ళనుంచీ అదేస్థితిలో ఉన్నాడు గాని - మీనాక్షి కొంచెం తనకళ్ళు తెరిచింది.

ఇదే జీవితానికి భిన్నమైన అనేకజీవితాలు ఇంతకన్న నికృష్టమైనస్థితిలో ఉన్నాయనికూడా తను గ్రహించాడు. వాటితో పోలిస్తే తను చాలా ఉన్నతస్థితిలోనే ఉన్నాడు.

'లేదమ్మా, ఆవిడ వాళ్ళతమ్ముడుదగ్గర ఉంది' అని తల్లికి సగౌరవంగా జవాబుచెప్పాడు సూర్యనారాయణ.

కనకాంగి:- కొడుకుజవాబులో ధ్వనించినఆప్యాయతకీ, అనురాగానికీ మనసులో చాలా సంతోషించింది. మీనాక్షికి ధన్యవాదాలు అర్పించింది. 'కాఫీ తాగుతావా నాయనా' అని అడిగింది కొడుకుని.

'ఎటూకానివేళ కాఫీఏమిటి? ఆరణి పడుకున్నాడేం?'

'నీకోసం ఈ వారంరోజులనుంచీ వెతుకుతూనేఉన్నాడు. నిన్ననే వచ్చాడు. వచ్చినదగ్గరనుంచీ జ్వరం పేలిపోతున్నది.

తను ఎంత అపార్థంచేసుకున్నాడు! తల్లిమంచంమీద నిద్రపోతున్నకారణం ఒళ్ళుతెలియని కారణంకాదు. వెంటనే ఆరణిదగ్గరకు పోయి నుదిటిమీద చెయ్యివేశాడు సూర్యనారాయణ. జ్వరం నూటమూడు నూటనాలుగుకి తక్కువవుండదు.

'మరి మందేవరమ్మా?'

'ఆచార్యులుగారే ఏదో ఇస్తున్నారు'

'ఆరణీ!' అని మెల్లిగాపిలిచిన సూర్యనారాయణపిలుపు ఆరణికి అందలేదు.

'ఏంచేద్దాం? ఎవరయినా ఇంగ్లీషుడాక్టర్ని తీసుకొద్దామా?' అన్నాడు సూర్యనారాయణ తల్లివంక చూస్తూ.

'నాకూ అలాగే అనిపిస్తున్నది' అన్న కనకాంగి మాట పూర్తికాకుండానే - వాకిట్లో కారు ఆగిన చప్పుడయింది.

ఆ కారుచప్పుడు ఆ తల్లీ కొడుకులకి సుపరిచితమే. ఆయనపేరు జగన్మోహనరావుగారు. పెద్ద కాంట్రాక్టరు. సహృదయుడు - తన తల్లిప్రియులు ఇద్దరు ముగ్గురిలో ఈయనంటేనే సూర్యనారాయణకి కాస్త గౌరవం. ఏడాదికి ఒకసారో రెండుసార్లో వచ్చిపోతారు, జగన్మోహనరావుగారు. ఆ ఒకటిరెండురోజులూ కనకాంగి అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తుంది. అది ప్రేమ అని ఎవరయినా అంటే ఆమెకి అభ్యంతరంలేదు.

'ఏమోయ్, ఇల్లంతా నిశ్శబ్దంగా ఉందేమిటి? సింహాచలం గుర్రుతప్ప' అంటూ జగన్మోహనరావుగారు లోపలికి వచ్చారు.

ఆయన ఆరడుగుల భారీవ్యక్తి. శాంతంగా హుందాగా నడుస్తారు. ప్రతిమాటలోనూ హాస్యం తొంగిచూస్తుంది

గబగబా పమిటకొంగు ఒళ్ళంతా కప్పుకుని ఎదురువెళ్ళి నమస్కరించింది కానకాంగి. ఆమెలో ఉండే ఈ ఇల్లాలితనమే జగన్మోహనరావుగారికి ఇష్టం. లేక ఆయనకి ఇష్టం అని తెలిసే కనకాంగి అలా నడుచుకుంటుందం టేసరిపోతుంది.

సూర్యనారాయణ ఆయనకి నమస్కారంపెట్టి అక్కడి నించి వెళ్ళిపోయినాడు. వెడుతున్న అతనిని నిదానించి చూశారు జగన్మోహనరావుగారు.

'ఏమిటి అలా చూస్తున్నారు?' నవ్వుతూ అడిగింది కనకాంగి.

'ఏమీలేదు. నీ కొడుకు పెద్దవాడయినాడు – గురువుగారిపోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయ్' అన్నారు ఆయన.

అయ్యవార్ని జగన్మోహనరావుగారు బాగా ఎరుగుదురు. ఆతరువాత జరిగిన కథా – సూర్యనారాయణ అయ్యవారిసంతానమే అన్న సంగతీకూడా ఆయనకి తెలుసు.

కనకాంగి నవ్వి ఊరుకొంది.

'ఈ అబ్బాయికూడా పెద్దవాడయినాడు' అన్నారు జగన్మోహనరావుగారు అక్కడేఉన్న పడకకుర్చీలో కూర్చుంటూ. అరణికి చదువువిషయంలో సలహా ఇచ్చింది కూడా జగన్మోహనరావుగారే.

'ఆ అబ్బాయికి నిన్నటినుంచీ జ్వరం పేలిపోతున్నది.' అన్నది కనకాంగి.

'వడతగిలిఉంటుంది. కొంచెం తడిగుడ్డ మొగాన వెయ్యి' అని సలహా ఇచ్చారాయన. కనకాంగి జగన్మోహనరావుగారికి కాఫీఇచ్చి – అరణిపక్కలో కూర్చుని, అతని నుదుటిమీద తడిగుడ్డ మారుస్తూ సంభాషణ ప్రారంభించింది.

'ఎలాఉన్నారు ?'

'కనిపిస్తూనేఉన్నదిగా, డబ్బుతోపాటు శరీరంకూడా పెరుగుతున్నది' అని సిగరెట్ ముట్టించారు ఆయన.

కనకాంగి నవ్వి 'నిజమే కాని, ఇప్పుడే అందంగా ఉన్నారు' అన్నది.

'అవును, నలభయిదాటాక మనిషికి చిత్రమైన అందమేదో వస్తుంది'

'చిత్రమైన అందంకాదు - స్థిరమైన అందం'

'నలభయిదాటిన ప్రతిమనిషీ తనమొహానికి తనే బాధ్యుడు అన్నాడు అబ్రహాం లింకన్'

'ఎక్కడనుంచి ఎక్కడికి వెడుతూ ఇక్కడకి దయ చేశారో అడగవచ్చునా?'

'అవశ్యమూ, తమరు అడుగావచ్చును - నేను చెప్పా వచ్చును'

'చెప్పండి మరి?'

ఇంతసేపూ నుదుటిమీద తడిగుడ్డలు పడటంతో కొంచెం జ్వరం జారింది ఆరణికి. కొద్దిగా కళ్లు తెరిచాడు. తన ప్రక్కలో కనకాంగినీ ఎదురుగుండా కుర్చీలో జగన్మోహన రావుగార్ని చూసి - తిరిగీ కళ్ళుమూసుకుని వారి సంభాషణ వినటం ప్రారంభించాడు. జగన్మోహనరావుగార్ని ఆరణి ఎరుగును. కనకాంగికి ఆయనంటే చాలా ఇష్టమూ గౌరవమూ అన్నసంగతికూడా అతను గ్రహించాడు. అంతరాంతరాల్లో ఆయనంటే అసూయకూడా లేకపోలేదు.

'చెప్పండి మరి' అన్న కనకాంగిప్రశ్నకి మరో సిగరెట్ వెలిగించి సమాధానంగా జగన్మోహనరావుగారు- 'నీకు తెలియనిది ఏముంది?' అన్నారు.

'అక్కడినించేనా ?'

'అవును, ఈసారి దర్శనంకావటంకూడా గగనం అయింది'

'చూడనేలేదు ... అవునా?'

'మామూలే. మూణ్ణాళ్ళంతస్తుమీద నుంచుని నోట్లో తిరుగుతుంటే చూశాను'

'పోనీ వెళ్ళకపోయినారా?'

'అదీ చేశాను. కోడలికి జడవేస్తూ పమిటకప్పుకుని అత్త గారికి కావల్సిన సరుందాతో ఏవో నాలుగుమాటలుమాట్లా డింది'.

'అత్తగారేమిటి'?

'కొడుక్కి మొన్న పెళ్ళిఅయింది'

'పెళ్ళికి వెళ్ళలేదా మీరు?'

'నా కాలువిరిగినప్పుడు తను వచ్చిందా?'

కనకాంగి పకపకా నవ్వటం ప్రారంభించింది.

'ఎందుకూ నవ్వుతావు?'

'ఎప్పుడూ ఉన్న పొలయలు కేగదా అని!'

జగన్మోహనరావుగారుకూడా నవ్వారు.

కళ్ళుమూసుకుని వింటున్న ఆరణికి ఈ సంభాషణ ఏమీ అర్థంకాలేదు. మెల్లిగా కళ్లు తెరిచాడు.

'ఏమయ్యా, ఎలాఉంది?' అన్నది కనకాంగి నుదుటి మీద తడిగుడ్డ మారుస్తూ.

'కొంచెం తలనొప్పి తగ్గింది ... నమస్కారం అండీ' అన్నాడు ఆరణి నీరసంగా.

'నమస్కారం ... నమస్కారం ... అదేమిటోయ్ ముసలి వాళ్ళం మేం బాగానే ఉన్నాం; కుర్రాళ్ళు మీరు అడిలి పోయారేమిటి ఎండలకి!' అన్నారు. జగన్మోహనరావుగారు.

నీరసంగా నవ్వాడు ఆరణి.

"రేసుచెట్టు ముదిరినకొద్దీ చేవ తేలుతుంది'' అని నవ్వింది కనకాంగి.

'సూర్యం వచ్చినట్లున్నాడు?' అన్నాడు ఆరణి.

'ఎక్కడికెళ్ళాడేమిటి?' అని సిగరెట్టు ముట్టించారు జగన్మోహనరావుగారు.

'మామూలే. స్త్రీలని ఉద్ధరించడానికి' అని వెక్కిరింపుగా అన్నది.

'కాని నీవు ఉద్ధరించనివ్వలేదు, అవునా?'

'నేనుకాదు, ఆ స్త్రీయే ఉద్ధరించనివ్వలేదనుకుంటాను'

'అబ్బా!' అని నుదురు పట్టుకున్నాడు ఆరణి. మూడు నిముషాలలో ఆరిపోయిన గుడ్డని తిరిగీ తడుపుతూ,

'స్త్రీజాతికిపట్టిన గ్రహచారమే అది. సాహసించి ఎవరయినా ఉద్ధరిస్తామని ముందుకివస్తే, లక్ష అనుమానాలతో వాడిని వెళ్ళగొడుతుంది'

'అందరూ అలాఉండరు. కేవలం నా అదృష్టంలోనే అలా వ్రాసిపెట్టిఉంది'

'అందులో ఆనందం అనుభవిస్తున్నారుగా మీరు'

'ఆనందంకంటే దుఃఖం ఎక్కువని నీకూ తెలుసు' అని సిగరెట్ నుసిని రాల్చారు జగన్మోహనరావుగారు.

'ఒకఅవధికి చేరుకున్నాక ఆనందమూ దుఃఖమూ ఒకటిగానే ఉంటాయి' అన్నది కనకాంగి.

'నువ్వీమధ్య వేదాంతినివి అయిపోతున్నావు'

'పేలాలు గాలికి ఎగిరిపోతుంటే, కృష్ణార్పణం అనటం కూడా వేదాంతమే అవుతుందికదూ' అని నవ్వింది కనకాంగి.

ఆరణికి అయోమయంగాఉంది ఈ సంభాషణ. జ్వరం మండిపోతున్నది - కళ్లూ మెదడూ బద్దలయిపోతున్నవి. ఈ బాధలోకూడా అనిర్వచనీయమైన ఒక ఆనందాన్ని అనుభవిస్తున్నాడు ఆరణి.

అది కనకాంగిస్పర్శ - ఆమెకు వయసులేదు, స్త్రీత్వమే తప్ప.

ఆ స్త్రీత్వపు మాధుర్యం - ఉష్ణోగ్రతతో ప్రవహిస్తున్న అతని రక్తాన్ని చల్లబరుస్తున్నది. స్పర్శలో చిత్రం అది. మామూలుసమయంలో రక్తంలో వేడి హెచ్చుతుంది. రక్తం వేడిగాఉన్నప్పుడు స్పర్శ దాహశాంతిచేస్తుంది. అదీ స్పర్శలోఉండే విచిత్రం.

'నేను వెడతాను కనకం' అంటూ నిలబడ్డారు జగన్మోహనరావుగారు. కనకాంగి ఆరణినుదుటిమీద గుడ్డ సరిచేసి, ఆయనవెంట సాగనంపటానికి నడిచింది.

ఆమెనడకలో ఒయ్యారాన్నీ, నడుస్తున్నప్పుడు చలిస్తున్న జఘనసౌందర్యాన్నీ నిదానించి చూశాడు ఆరణి- ఈ జ్వరంలో ఈ బాధలో అంతకంటె ఉధృతమూ బాధాకరమూ అయిన వాంఛ అతనిని వెర్రివాడిని చేస్తున్నది.

మంట - నరనరాల్లోనూ పోట్లు - మెదట్లో పెనుతుపాను - అంతర్యంలో అకాలపు వెల్లువ- అర్థరహితమైన విషపునిషా- అరణిని నిద్ర ఆవహించింది.

# 8

'నటరాజన్, నీవు వ్రాసిన కథ బాగుందని ఒకమ్మాయి దగ్గరినించి ఉత్తరంవచ్చింది'

అంటూ ఆ ఉత్తరాన్ని నటరాజన్ కూర్చున్నవైపు విసిరివేశారు ఆంజనేయులుగారు.

నందిత పేరు చాలా బాగుంది అనుకుంటూ ఉత్తరాన్ని చదవటం ప్రారంభించాడు నటరాజన్.

'అద్ గదీ, ఆడపిల్లదగ్గరనుంచి ఉత్తరం వచ్చిందంటే, నువ్వు గొప్పవాడివి అయిపోయినట్లేనయ్యా' అన్నాడు అంతవరకూ సిగరెట్ పొగరింగుల్లో విశ్వసంచారంచేస్తున్న వరదరాజులు.

'ఇదిగో,నీకుఇంకోకవరు?' అంటూమరోబరువైనకవరు విసిరేశారు ఆంజనేయులుగారు. ఆ కవరు విప్పిచూడగానే నటరాజన్ మొగం చిన్నబోయింది - తనకథ బాగుందని నలుగురూ అనటంతో మరోకథ వ్రాసి ఒక పెద్దపత్రికకి పంపాడు - ఆ కథ ఇప్పుడు తిరిగివచ్చింది. నటరాజన్ తను చేసినపనికి నొచ్చుకుంటూ ఆ కథ దాయటానికి ప్రయత్నించటం వరదరాజులు గమనించి

'ఏమి టది?' అని ప్రశ్నించాడు.

'కథ'

'కొత్తది వ్రాశావేంటయ్యా - మరి నాకు వినిపించ లేదేం? చదువురానివాణ్ణనికదూ' అన్నాడు వరదరాజులు.

'ఇక తీరికగా వినిపిస్తాలెండి. తిరిగివచ్చిందిగా'

'ఎక్కడికి కెళ్లిందేమిటి?'

'మద్రాసు'

'అలా చెప్పు. పత్రిక్కి పంపితే తిప్పేశారన్నమాట - ఒకపనిచెయ్యి. ఇందాక ఉత్తరం వ్రాసిందే, ఆ ఆడపిల్ల పేరుతో పంపు - వాళ్ళు వేసుకోకపోతే నన్నడుగు!' అని సిగరెట్ పొగ రింగులుగా వదలటంలో నిమగ్నుడయ్యాడు వరదరాజులు.

ఆ సలహా అద్భుతంగా నచ్చింది నటరాజన్‌కి. నిజమే, ఆడవాళ్ళ పేరుతో పంపితే, వేసుకుంటారు. వెంటనే కథానిక పేరు మార్చి, రచన-నందిత అని వ్రాసి వెంటనే వాకిట్లోఉన్న పోస్టుడబ్బాలో పడేసి వచ్చాడు నటరాజన్. వెలిసిన ఎర్ర రంగుతోఉన్న ఆ డబ్బా అతని తెలివికి దీవించింది.

'చెప్పినసలహా వెంటనే ఆచరించేస్తావయ్యా - అందుకే నువ్వంటె నాకు ఇష్టం' అని నవ్వాడు వరదరాజులు.

'నటరాజన్ - ఈ తడవ జ్ఞాపకాల శీర్షికకి ఏమీగా రాలేదు - నువ్వేమయినా వ్రాస్తావేమిటి?' అన్నారు ఆంజనేయులుగారు.

'వ్రాయవయ్యా, ఏ పుట్టలో ఏ పామున్నదో ఎవడు చూశాడు!' అని వరదరాజులు మద్దతుఇచ్చాడు.

ప్రతిఫలం ఇవ్వలేని ఆ పేదపత్రికకి - ప్రతిఫలంకోరని నటరాజన్ వ్రాయటం ప్రారంభించాడు. నటరాజన్‌కి వచ్చిన భాష పరిమితం- అతను సాహిత్యంకూడా ఏమీ చదువలేదు.

అయితేనేం? అతని రచనల్లోని సహజత్వం చాలా ఆకర్షణీయమైనది - ఉన్నది ఉన్నట్లు చెప్పటంలో అతనికి అద్భుతమైన ప్రత్యేకత ఉన్నది. పాఠకుల్ని ఆకర్షించడానికి కొంచెం సెక్సుపాలు ఎక్కువగా నింపటం మొదలుపెట్టాడు. ఒకవందకాపీలుసర్క్యులేషన్ పెరిగింది. నందిత పేరుతో అతను పంపిన కథ అచ్చువటమేకాకుండా ప్రతిఫలంగా ఒక పదిరూపాయలుకూడా పంపారు. ఆ పదిరూపాయిలనోటు అతనిలో అపరిమితమైన ఆత్మవిశ్వాసాన్ని నింపింది.

జీవితంఅన్నా - ఆలోచించటంఅన్నా - అతనికున్న ఆసక్తి మరింత పెరిగింది. చక్కని సెక్సుకథలు వ్రాస్తున్న అతనికలం అంతటితో తృప్తిపడలేదు. ఇవి వ్రాయటం కేవలం బ్రతుకు తెరువుకోసమే... ఇంతకన్న ఉన్నతమైనవీ- ఆలోచించటానికి అవకాశమిచ్చేవీ లోకంలో ఎన్నో ఉన్నాయి.

వాటిని చిత్రించాలి. అప్పుడే తనకి పరిపూర్ణత లభిస్తుంది. ఆర్థికంగాకూడా అతనికి అట్టే ఇబ్బందిలేదు. పగలల్లా అగ్గిపెట్టెలఫ్యాక్టరీలో పనిచేసి, సావలో అయిదణాలో తెస్తుంది మీనాక్షి. నటరాజన్‌కి ఆ ఫ్యాక్టరీఅంటే తగనికోపం. అక్కడ ఎండలో రేకులకింద అహర్నిశలూ-శ్రమిస్తూ సౌందర్యాన్నీ శక్తినీ పోగొట్టుకుంటున్న స్త్రీలని చూస్తే అపరిమితమైన జాలి. ఇంత శ్రమించినా ప్రతిఫలం తక్కువ.

అంతఃపురాల్లో పట్టు తెరలమాటున దాచి, అమూల్య వస్తువుగా కాపాడుకోవల్సిన స్త్రీని అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలో చాకి రీకి పంపుతున్న మగవాళ్ళంటే అతనికి మంట.

నీవు ఆ పావలా సంపాదించకపోతే కొంపవమీ మునిగి పోదు అని అనేకసార్లు మందలించాడు. మీనాక్షి ఊరికే కూర్చుంటే తోచదు అని సమాధానం ఇస్తుంది - నీవు హోటల్లో చాకిరీ చెయ్యటంలేదూ ? అంతకన్న నా ఎక్కు వేమిటి ? అని ఎదురు ప్రశ్న వేస్తుంది.

చివరికి ఆ సంగతి వదలివేయక తప్పలేదు నటరాజన్‌కి.

పగల్లా ఏదో వ్రాసుకోవటం, రాత్రిళ్ళు టిఫెయా నాలో పనిచేయటం, సాయంత్రాలు పత్రికాఫీసులో గడప టంగా నటరాజన్ ఆరు నెలలు గడిపివేశాడు. క్రమక్రమంగా అతనిరచనలో కనిపించే ప్రత్యేకత పెరగటం ప్రారంభించింది.

భవిష్యత్ వర్తమానంగా మారినప్పుడు - ఆశలు సంభవాలుగా పరిణతిచెందినప్పుడు - అదృష్టం అరచేతిలోకి అందివచ్చినప్పుడు - మానవుడు కొన్ని క్షణాలు దిగ్భ్రాంతి చెందుతాడు. అప్పుడప్పుడు ఆ భ్రాంతినుంచి ఇంకా తేరు కోకుండానే - వర్తమానం భూతకాలం అయిపోతుంది - ఆశలు అసంభవాలై అదృష్టం అడ్డుకుంటుంది.

ఒక దుర్ముహూర్తంలో నటరాజన్ జీవితంలోకి నందిత ప్రవేశించింది - పరమఅసహ్యంగా - అతినీచంగా ప్రవేశిం చింది.

నందితని నటరాజన్ ఇంటికి తెచ్చినప్పుడు మీనాక్షి అవుననీ కాదనీ అనలేదు; ఆదరించింది, అంతే. 'అభాగ్య

రాలు నాలాటి మరో స్త్రీ' అనుకుని జాలిపడ్డది - చరిత్ర హీనలూ ఆశోపహతులూ అయిన ఆ ఇళ్ళల్లోవారు నందితనీ నందితఅందాన్నీ చూసి ఆశ్చర్యపోయినారు.

సన్నగా తెల్లగా పెద్దకళ్లు, పెద్దజుట్టుతో ఉన్న నందిత - తన సౌందర్యకాంతులు ఆ పూరిపాక సందుల్లోంచి సూర్యరశ్మిలా రోడ్డుమీదకి ఫోకస్ చేస్తున్న నందిత - నటరాజన్‌కి సమస్యగా తయారయింది.

హోటల్ విజయానాలో దిక్కులేకుండా ఉన్న నందితని ప్రేమించి తీసుకురాలేదు, నటరాజన్. జాలిపడి తీసుకు వచ్చాడు.

ఆమె ఎవరో - ఎందుకని హోటల్ విజయానాలోని అవినీతి మందిరాల్లోకి వచ్చిందో - తరువాత ఏంజరిగిందో అతను ఆమెని అడగలేదు - మామూలుగా రాత్రి పదింటికి భోజనం తీసుకువెళ్ళాడు తను.

నందిత బోర్లాపడుకుని ఏడుస్తున్నది. నటరాజన్ లోపలికి వెళ్ళగానే-

'సర్వర్, నీ పేరేమిటి?' అన్నది కళ్ళుతుడుచుకుంటూ.

'నటరాజన్'

'అయితే నాకో చిన్న ఉపకారం చేస్తావా?'

'యస్ మేడమ్!'

'అయితే వెంటనే నన్నిక్కడినుంచి తీసుకెళ్లిపో' అన్నది నందిత.

నటరాజన్ హడిలిపోయినాడు. రోజుకి పదిరూపాయలు ఇచ్చి హోటల్లో నెలరోజులిన్నించి ఉంటున్న ఈ మహారాణి

తనతో వచ్చేస్తానంటున్నది - వందరూపాయల ఖరీదుగల చీరని నిర్లక్ష్యంగా కట్టుకున్న ఈ సుందరికి ఈ క్షణంలో తనకన్న ప్రియబాంధవుడు ఇంకెవరూ కనిపించలేదు.

'ఏం సర్వర్, మాట్లాడవేం?'

'యస్, మేడమ్'

'క్షమించు నటరాజన్ - నీవు సర్వర్‌వి కావు, నేను మేడమ్‌ని కాను. ఈక్షణంలో దిక్కులేని స్త్రీని. నన్ను ఇక్కడి నుంచి నీవు తీసుకెళ్లాలి'

ఒక అందమైన స్త్రీ - విచిత్రప్రకృతిగల ఒక వన్నెల చిన్నారి తనని రక్షించమంటోంది. ఆ క్షణంలో తను ఆకాశంఅంత ఎత్తు ఎదిగినట్లు అతనికి అనిపించింది. యుగయుగాలుగా ఆ గర్వంలో శక్తిని నింపుకుంటున్న పురుషుడు అతను - టిజుయానాలో సర్వరు కాడు- ప్రూఫ్‌రీడరూ కాడు.

అశక్తురాలైన స్త్రీని తన శక్తిప్రాకారంలో దాచి, కాపాడుకుని పూజించుకునే పురుషుడు అంతే... నటరాజన్ సరే నన్నాడు నందితతో. నందిత నవ్వింది. వానలోతడిసినవెన్నెలలా నవ్వింది - పర్సులోంచి రూపాయలు తీసి నటరాజన్ కిచ్చి బిల్లు ఇచ్చిరా అని ఆదేశించింది.

యాంత్రికంగా ఆమె చెప్పినట్లు చేశాడు నటరాజన్ - అంతే. సాయంత్రమే ఆ సౌందర్యాధిదేవత నటరాజన్ పూరిగుడిసె నడిచివచ్చింది. వందరూపాయల చీరతో, అమూల్యమైనకి ఆభరణాల్తో అద్భుతసౌందర్యంతో- నిశ్శబ్దంగా - నులకమంచంలో పడుకుని నెలరోజులు గడిపివేసింది నందిత.

ఎవ రీ నందిత? తనకు ఉత్తరం వ్రాసింది ఈమెయేనా? ఈపేరుతో తను కథలు వ్రాస్తున్నాడు. అసలు తను అభిమానించిన కథ వ్రాసిన రచయిత హోటల్లో సర్వర్ నటరాజన్ అని ఆమెకు తెలిస్తే ఎలాఉంటుంది? అసలు ఎవ రీమె? ఏ వూరు ఈ పిల్లది?

నటరాజన్‌కి అన్నీ ప్రశ్నలే - అయినా ఆమెని ఏమీ ప్రశ్నించలేదు. అసలు తను తరుచుగా ఇంట్లో ఉండటంమాని వేస్తున్నాడు.

మీనాక్షికూడా ఏమీ అడగటంలేదు. ప్రేమగా ఆప్యాయంగా ఇంత నందితకి పెట్టి, తను తిని - నందిత మంచంపక్కన చాపవేసుకుని ఏదో కుడుతూ, పగలల్లా గడిపి వేస్తుంది. నందిత వచ్చినదగ్గరనుంచీ ఆమె అగ్గిపెట్టెల ఫ్యాక్టరీకి వెళ్ళటం మానివేసింది.

ఒకరోజు మధ్యాహ్నం నిద్రపోతున్న నందిత ఏదో అస్పష్టంగా కలవరించింది. 'ఎవరి కెవరూ లేరు. ఎవరి కెవరూ లేరు'

మీనాక్షి నవ్వుకుంది- అందరి కందరూ ఉన్నారు; కాని ఎవరి కెవరూ ఉండరు. అదే చిత్రం జీవితంలో.

మీనాక్షికి సూర్యనారాయణ జ్ఞాపకంవచ్చాడు. 'ఈలోకంలో ఒకరికొకరే ఉంటారు-ఒకరు స్త్రీ అయితే ఇంకొకరు పురుషుడు - ఆ ఇంకొకరు పురుషుడయితే ఆ ఒకరు స్త్రీ; అంతే- తనని ఆదుకున్నది సూర్యనారాయణ. ఈమెని ఆదుకున్నది నటరాజన్.

చిత్రం ఏమిటంటే ఆ స్త్రీలనుంచి వారేం పొందగలరో ఆ భగవంతుడికీ వాళ్ళకే తెలియాలి.

నందిత మళ్ళీ కలవరించింది-

ఏమిటీ ఈ పిల్లబాధ? ఏమగవాడిచేతులోనో మోస పోయిఉంటుంది అని పేలవంగా నవ్వుకుంది మీనాక్షి.

'నువ్వు సర్వేశ్వి కాదు. నేను మేశన్ని కాదు' మళ్ళీ కలవరించింది నందిత.

'ఓహో!' అనుకుని నవ్వుకుంది మీనాక్షి.

అప్పుడే లోపలికివచ్చిన నటరాజన్ కూడా ఆ కలవరింత విన్నాడు. పాపం అనిపించిం దతనికి.

ఆతరువాత పదిరోజులకి తను ఎవరో, ఎక్కడినుంచి వచ్చిందో! మళ్ళీ ఎక్కడికి వెడుతున్నదో! చెప్పకుండానే నందిత వెళ్ళిపోయింది... క్రమంగా పదిరోజులలో ఆమెని మర్చిపోయాడు.

నందిత అనే పేరుతో నటరాజన్ వ్రాసిన, 'నీతి అవి నీతులు' అనే నవల ఒక ప్రఖ్యాత పత్రికలో సీరియల్‌గా పడటం ప్రారంభమైంది. రచయితగా అతనుగుర్తించబడ్డాడు. ఈసమయంలోనే అతనికి మరో సంఘటన ఎదురయింది.

నటరాజన్ ముగ్గురుపిల్లలుగల వితంతువు ఒకామెతో దైహికసంబంధాన్ని ఏర్పరచుకున్నాడు ఆమె అన్నకి అది తెలియటంతో, అదివరకే దరిద్రంవలన చెల్లెల్ని పిల్లల్ని పోషించలేక బాధపడుతున్న అతను ఇదో వంకగా చెల్లెల్ని పిల్లల్ని వెళ్ళగొట్టేశాడు. ముగ్గురుపిల్లల్తోనూ ఆమె నట రాజన్ఇంటికి వచ్చేసింది. పరిస్థితి ఇందాకావస్తుందని నట

రాజన్ ఏనాడూ ఊహించలేదు - ఆ తల్లినీ పిల్లల్నీ అతను పోషించక తప్పలేదు. తప్పదు అనుకున్నప్పుడు ఆ పని హృదయపూర్వకంగానే చేస్తున్నాడు నటరాజన్.

ఒకానొకప్పుడు దేశంలోని నిరంకుశత్వం బలిసిపోయింది - అప్పుడు భావుకులకూ - మేధావంతులకూ జనం స్వాగతమిచ్చారు. అందుకు కారణం ఉన్నది. అప్పుడు మేధావులు అనుభవానికీ వాస్తవికతకీ దూరంగా నిలబడి చర్చలు సాగించేవారు కాదు.

వాస్తవికచిత్రంపై చూపు నిలిపి పరీక్షించేవారు - అందుకనే జనం వారిని ప్రతినిధులుగా ఎన్నుకునేవారు. ఇప్పటి పరిస్థితి దీనికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంది. తెలివితేటలు కొంచెం అతిగా ఉన్నయ్. జీవితానికి విలువలు తగ్గినయ్.

నిత్యానుభవంపై అశ్రద్ధ ఎక్కువయింది. కోటానుకోట్ల ప్రజల సుఖ-దుఃఖాలు, రాగ-ద్వేషాలు వీటిని సరిగా అర్థంచేసుకుని అందుకుతగ్గట్టు స్పందించడం మానేసి, ఊక లాటి వాక్యాలు వ్రాస్తున్నాడు ఆ మేధావంతులలో ముఖ్యుడైన రచయిత.

జీవితంకన్న సిద్ధాంతం ముఖ్యమైపోయింది. బతుకునుగురించి అనాదిగా మేధావులు చర్చిస్తూనే ఉన్నారు. జీవితాన్నిగురించి నిజానికి తేలేది ఏమీలేదు. ఇదంతా తేలేదాకా - జీవితంమాత్రం చేతులుముడుచుకుని కూర్చోలేదు చైతన్యంతో కలిసి అవిచ్ఛిన్నంగా ప్రవహించి పోతూనేఉంది.

క్రియారూపంలోకి మార్చలేని రచన వృథా, చర్చ వృథా - కళలు అసలే వృథా - అనుభవానికన్న వెనకబడిన జ్ఞానం అంతకంటే వృథా-

నటరాజన్ ఈ సిద్ధాంతంతోటి రచించిన నవల 'నీతి-అవినీతులు'. అనుకోకుండా దానికి అద్భుతమైన పేరువచ్చింది- పత్రిక కాపీలు దొరకటం కష్టంగాఉంది.

రచయితగా ఒకస్థానాన్ని సంపాదించుకొన్న నటరాజన్‌కి ఆర్థికంగా కష్టం ఎక్కువయింది. తన పొట్టతోసహా ఆరుపొట్టలు నిండాలి - తనూ మీనాక్షీ ఉండగా కూడబెట్టుకున్న వందరూపాయలు కూడా అయిపోయినయి. ఒకపూట అంబలికాచి తాగుతున్నారు అందరూను.

కాస్త పెద్దపిల్లవాడికి మిగతా ఇద్దరుపిల్లల్ని అప్పచెప్పి మీనాక్షీ, తాయారూ ఫ్యాక్టరీకి వెళ్ళి పనిచేసి వస్తున్నారు. అయినా కడుపునిండటమే గగనంగాఉంటి.

ఆమెపేరు తాయారు. దరిద్రంలో పుట్టింది, దరిద్రంలో జీవించింది. దరిద్రంలోనయినాసరే, ఆమె స్త్రీత్వం ఆమెని విడనాడలేదు. ఫ్యాక్టరీలో పనిచేస్తున్నభర్త కలరా వచ్చి చనిపోవటంచేత అన్నగారిఇంటికి వచ్చింది. ఆ అన్నగారిపేరు రాజేశ్వరరావు. ఇప్పటికి మూడుతరాలక్రిందట ఒకస్త్రీ ఎవరితోనో వెళ్ళిపోవటంవలన ఈ కుటుంబాన్ని వెలివేశారు.

ఆ కుటుంబంలోనివారు ప్రపంచాన్ని వెలిగాచూస్తారు ప్రపంచం ఆ కుటుంబాన్ని వెలివేసింది.

ఈ పరిస్థితిలో నీతిశీలలు కొంచెం పదులుగా ఉండటం సహజం. తాయారు పరిపూర్ణమైన స్త్రీ. బలమైన ఆమె అవయవాలు - సన్నని ఆమెనడుం - కొట్టవచ్చినట్లున్న ఆమె కన్నులు - అతి దాహాన్ని కలిగించి - ఆ దాహశాంతి చేస్తయ్యి. వరదరాజులుతో ఒకసారి వెళ్ళినప్పుడు తాయారుని చూశాడు నటరాజన్. అప్పటినించీ దేహం ఎదురుతిరిగినప్పుడు తాయారుదగ్గరకి వెళ్ళటం నటరాజన్‌కి అలవాటయింది.

ఆఇంట్లో ఒకరిసంగతి ఒకరికి పట్టదు - ఒకరిబాధ్యత ఒకరికిలేదు - ఒకరితిండివిషయం మరొకరు ఆలోచించరు- ఈ పరిస్థితిలో ఒకరోజున తాయారు అన్నగారికి ఆరెండు గదులమురికికూపంలో ఒకగది అద్దెకివ్వాలనిపించింది - వెంటనే తాయారు ముగ్గురుపిల్లలూ అక్కడఉండటం అనవసరమనిపించి - చెల్లెలు అవినీతి ప్రవర్తన విషయం తనకి అప్పుడే తెలిసినట్లు నటిస్తూ ఆమెని వెళ్ళగొట్టాడు

తాయారుకూడా ఏమీ ఆలోచించకుండా నటరాజన్ ఇంటికి వచ్చింది.

ఈస్థితిలో నటరాజన్‌కి ఆరోగ్యంకూడా సరిగా ఉండటంలేదు - టెజుయూనాలో రాత్రిపూట పనిచేస్తూ కూలిపోతున్నాడు. తాయారుకి నటరాజన్ అంటే ప్రాణం. అతని కాలులో ముల్లువిరిగితే తనప్రాణంతో ఆ ముల్లు తీస్తుంది.

వరదరాజులుమాత్రం నటరాజన్ చేసిన ఈ పనికి ఆమోదించలేదు.

'ఏంపని చేశావయ్యా! ముగ్గురుపిల్లలతల్లిని - ఇవం చెత్తదాన్ని ఇంట్లోపెట్టుకున్నావు, మన్నేం సుఖపడతావు' అన్నాడు.

నటరాజన్ నవ్వి 'అంతకన్న గొప్పవాళ్ళు మనని ఇంత ప్రేమించరు, ఇంత కృతజ్ఞతకూడా చూపించరు. ఎలా వచ్చారో అలాగే అదృశ్యమైపోతారు' అన్నాడు. అతని మనసులో సందిత్ర తళుక్కుమన్నది.

'ప్రేమా కృతజ్ఞతా ఇవన్నీ ఉత్త పిచ్చిమాటలు. కడుపునిండా తిండీ, ఒంటినిండా కండా ఉన్నప్పుడు ఆలోచించాల్సినమాటలు' అన్నాడు వరదరాజులు.

'ఒకవిధంగా నిజమే - తాయారంటే నాకేం పెద్ద అభిప్రాయంగాని - అభిమానంగాని లేదు - దిక్కులేని ఆడది నీవే దిక్కని ఒచ్చింది - ఉంటే తింటుంది, లేకపోతే మానేస్తుంది. అయితే, ఒకటే బాధ - ఆ గుడిసెల్లో ఇరకటం బాధగా ఉంది' అని నిట్టూర్చాడు నటరాజన్.

వరదరాజులు మాట్లాడలేదు. మీనాక్షిని గురించి ఆలోచిస్తున్నాడు. ఆమె అంటే అతనికి ఎనలేని గౌరవం. నటరాజన్ చేసిన పిచ్చిపని ఆమె ఎలా ఆమోదించిందో అతనికి అంతుబట్టటంలేదు - బహుశా మనసులో బాధపడుతూ ఉంటుంది అని వరదరాజులు ఊహించుకున్నాడు.

రోడ్డుమీద నిలబడి మాట్లాడుతున్న ఆ ఇద్దర్నీ వాన జల్లువచ్చి పూర్తిగా తడిపివేసింది.

'ఇదెక్కడి జల్లయ్యా! చిలిపిపిల్లలా కొక్కిరించి పోయింది' అని విసుక్కున్నాడు వరదరాజులు.

అక్కడికి నటరాజన్ ఇల్లు దగ్గిరఅవటంవలన ఇద్దరూ అటు నడిచారు.

కాలసర్పాన్ని భరించటానికి వీలులేని దుర్వాసన వస్తున్నది కల్మషాలతో నిండిన భూమిమీద వానపడటం ప్రారంభించేసరికి - సహజగంధవతి ధరణి భరింపరాని దుర్గంధాన్ని విడుదలచేస్తున్నది.

నరకంఅంటే వేరేలేదు - తన కల్మషాలమధ్య తనే బ్రతకక తప్పని మానవుడి ఆవాసమే నరకం.

వానచేత తడిసి చితచితలాడుతున్న బురదనేల దాటి - మాసినబట్టలూ, ఎంగిలిమెతుకులూ, పిల్లలఏడుపులతో నిండిన ఆ ఒంటరిపాకలోకి ఆ ఇద్దరూ ప్రవేశించారు.

తాయారు బియ్యంలో రాళ్ళేరుతున్నది. మీనాక్షి నులకమంచంలో కూర్చుని, తనచీరని ఆరోతడవ కందికాయ కుట్టు కుడుతున్నది. వరదరాజుల్ని చూసి తాయారు మొగం చిట్లించుకుంది. మీనాక్షి మంచంమీదనుంచి లేచి - వరదరాజుల్ని కూర్చోమని గోనెపట్టా అడ్డుగట్టిన రెండోగదిలాటి దాన్లోకి ప్రవేశించి ఒక గోధుమరొట్టె ఒకగ్లాసుడు మజ్జిగ తెచ్చి ముందుబెట్టింది.

వరదరాజులు అవి ఆప్యాయంగా అందుకోటం చూసి అంతకన్న మరేమీ ఇవ్వలేనందుకు నటరాజన్ చాలా సిగ్గుపడ్డాడు.

దరిద్రంలో బ్రతకటం అంత బాధకాదు గాని, దరిద్రంలో బ్రతుకుతున్నామని తెలుసుకోటంమాత్రం అపరిమితమైన బాధ.

డబ్బు ఎలాంటిదో - అదిఇచ్చే సుఖాలస్వరూపం ఎలా ఉంటుందో తెలిసినప్పుడు - దరిద్రంపెట్టేబాధ పదిరెట్లు అవుతుంది.

నటరాజన్ పడుతున్నబాధ వరదరాజులు గ్రహించాడు - 'ఒక్కరొట్టె పెడితే నాకేం చాలుతుంది? ఒక రూపాయిపూరీలు పట్టుకురారా' అంటూ తాయారుపెద్ద కొడుకు ప్రసాద్‌కి ఒక రూపాయికాగితం ఇచ్చాడు. ఆ మాటతో పిల్లలమొగాలు చాటంత అయినయ్.

అంతర్గతంగా తాయారుకూడా సంతోషించింది. ఇంట్లో పావుశేరుబియ్యం ఉన్నయ్ - కనీసం అవయినా వండి, నటరాజన్‌కి పెట్టకపోతే అతనిఆరోగ్యం మరింత పాడవుతుంది. పిల్లలకి నిన్నమధ్యాహ్నం కొనిపెట్టిన జామకాయలు తప్ప మరేం పెట్టలేదు.

తనూ మీనాక్షీ ఆ ఉన్న గోధుమరొట్టె చూచి, రాత్రి మంచినీళ్ళుతాగి ఉన్నారు. ఇప్పుడా రొట్టెనే వరదరాజులుకి పెట్టింది మీనాక్షి. పరిస్థితి ఇలా ఉన్నప్పుడు వరదరాజులు తెప్పిస్తున్న పూరీలు ఈపూటకి పిల్లలఆకలి తీరుస్తయ్ - రెండురోజులదాకా ఫరవాలేదు.

తాయారు మొగంమీద కనిపించిన సంతృప్తి నటరాజన్‌కి చాలా బాధకలిగించింది. ఆమెను తను సుఖపెట్టలేక పోతున్నాడు - కనీసం కడుపునిండా తిండికూడా పెట్టలేక పోతున్నాడు.

అయినా - ఆమె కిమ్మనకుండా అన్నీ భరిస్తున్నది. ఆమె ఒక స్త్రీమాత్రమే కాదు - తల్లికూడా. ఆ తల్లిముఖమే

ఇప్పుడు తళుక్కుమన్నది. తనబిడ్డల కడుపునిండటం అనే ఊహ ఆమెకి చాలా సంతృప్తినిచ్చింది - ఆ సంతృప్తిని ఆమె దాచుకోలేదు.

వరదరాజులుకూడా ఇది గ్రహించాడు. పరిస్థితులు ఎంత దుర్భరంగాఉన్నాయో అతనికి అర్థమయిపోయింది. నటరాజన్ త్యాగానికి లోలోపల మెచ్చుకోకుండా ఉండలేక పోయినాడు. తనుకూడా తాయారుని చాలా తడవలు ఉపయోగించుకున్నాడు - కాని, ఆమెకష్టదశలో కొంచెం కూడా సహాయంచేయలేదు. తనకి డబ్బుఉన్నది, ఆంత ర్యంలేదు- నటరాజన్ కి డబ్బులేదు, ఆంతర్యం ఉన్నది. వరద రాజులు సిగ్గుపడ్డాడు.

ఆ కుటుంబానికి సహాయంచేయాల్సినబాధ్యత తన యందున్నది అనిపించింది - కాని, ఎలా సహాయంచేయటం? నటరాజన్ దానికి ఒప్పుకుంటాడా? తలఎత్తి చూశాడు వరదరాజులు.

నిట్టాడినిఆనుకుని నిలబడే కుడుతున్నది మీనాక్షి. ఆమె చాలా చిక్కిపోయింది. అసలే పెద్దవైన ఆమెకళ్ళు చిక్కటంవలన మరింత పెద్దవిగా కనిపిస్తున్నయ్.

ఎందుకో తెలియదు, ఆ క్షణంలో తనకి ప్రియబాంధవిగా కనిపించింది మీనాక్షి. స్త్రీని స్త్రీగామాత్రమే ఇంతవరకూ తను చూడగలిగాడు — తను ఎంత డబ్బుఇస్తే ఎంతసుఖం ఆమెనుంచి పొందగలనా అనిమాత్రమే తను ఆలోచించాడు ఇంతవరకూ. దేహవాంఛకి భిన్నమైన మరో

అనుభూతి స్త్రీనుంచి పొందవచ్చుననేసంగతి ఇదివరకు అతని అనుభవంలోకి రానేలేదు.

పెద్ద సౌందర్యవతిగాని ఈ మీనాక్షి ఎవరు? తనకి ఏమవుతుంది? ఆమెఅంటే తనకి ఇంత గౌరవం దేనికి?

అట్టే చదువుకోని వరదరాజులుకి అనుభవమే సరి అయిన సమాధానంచెప్పింది - ఈమె తనకి ప్రియబాంధవి. ఏవిధంగా?

ఏవిధంగానయినాసరే - తనకి ఆప్తురాలు మీనాక్షి.

కుడుతూ కుడుతూ తలఎత్తి చూసింది మీనాక్షి. అంతవరకూ ఆమెనేచూస్తున్న వరదరాజులు సిగ్గుపడి చటుక్కున తలవంచుకున్నాడు.

రాగజలధికి తరగలు ఉన్నాయని మీనాక్షికి తెలుసు- ఆ తరగతులు ఆమెకు అననుభూతముకాదు - అతని కన్నులలో ఆ తరగల అలజడిని పసికట్టింది మీనాక్షి - చటుక్కున సూర్యనారాయణ జ్ఞాపకంవచ్చాడు. ఆమెకి.

ఇంతలో పెద్దపిల్లవాడు పూరీలు తెచ్చాడు. ఆపూరీలు రెండు తిని, పిల్లలందరికీ తలో రూపాయీ ఇచ్చి వెళ్ళిపోయినాడు వరదరాజులు.

అతన్ని వాకిలిదాకా సాగనంపి, వెనక్కివచ్చి నులకమంచంలో వాలిపోయినాడు నటరాజన్. అతనిమెదడు ఆలోచనలతో పగిలిపోతున్నది. తను ఏమార్గంలో నడవాలి? జీవితంఅంటే ఏమిటి? ఈ సంసారభారం ఎలా మోయాలి? వ్యధకలిగించే ఇలాంటి ఆలోచనల మధ్యనుంచి - తను కొత్త కథ ఎలా వ్రాయాలి? ఆ రచనకి ధ్యేయం ఎలాఉండాలి?

అనే ఆలోచనలు అతనిని సేదతీరుస్తున్నాయి. వీటన్నిటినీ చీల్చుకుని అంతరాత్మ అట్టడుగునించి సవ్యసాచి బాణ ప్రయోగంనుంచి వెలికుబికిన పాతాళగంగలా నందిత, ఎవరో ఏవూరో తెలియని నందిత.

ఆ నులకమంచాన్నే ఇంద్రుడిసింహాసనం అనిపింప చేస్తున్నది - అతనికి నిద్రపోవాలనిపించింది. కాని, ఆయి దయింది- కాళ్ళీడ్చుకుంటూ టిజుయానాలో నైట్ డ్యూటీకి బయలుదేరాడు నటరాజన్. రోడ్లు తెగసాగిపోయినట్లు అని పించింది - అరగంటసేపు ఆరోడ్డుని ఈది గట్టు చేరుకున్నాడు నటరాజన్.

డ్రెస్ మార్చుకుంటూఉండగా క్రిష్ణా వచ్చి 'రూమ్ నెంబరు ఫార్టీఫోర్ లోకి ఆమె మళ్ళీ వచ్చిందిరోయ్'అన్నాడు

నటరాజన్ ఉలిక్కిపడి 'ఎవరు?' అన్నాడు.

'ఆమేరా, ఆరోజు నువ్వు రైలెక్కించలేదూ, ఆమె' అన్నాడు కృష్ణా.

నందిత... నందిత తిరిగీ వచ్చింది. క్రిష్ణాకి రైలుఎక్కిం చానని చెప్పాడు తను. ఎందుకు వచ్చిందిమళ్ళీ? లోపలిఉద్వే గాన్ని అణచుకోటానికి ప్రయత్నిస్తూ 'ఎప్పుడు వచ్చింది?' అన్నాడు.

'ప్రొద్దున వచ్చినదగ్గరనించీ స్మారకంలేదు. బాగా త్రాగింది. మెక్సికాసురుడు అటుకేసి ఎవరినీ వెళ్ళొద్దన్నాడు' అన్నాడు క్రిష్ణా. మెక్సికన్ ప్రొప్రయిటరుకి నటరాజన్ పెట్టిన పేరు మెక్సికాసురుడు.

'క్రిష్ణా! అస లావిడ ఎవరో నీ కేమయినా తెలుసు నట్రా?' అని ప్రశ్నించాడు నటరాజన్.

'తెలియ కేం, లక్షాధికారి కూతురుట-విశాఖపట్నంలో డాక్టరీ చదువుతున్నదట' అన్నాడు క్రిష్ణా ఇన్ని వివరాలు తనకి తెలిసినందుకు గర్విస్తూ.

'నువ్వంటే నిజమే అయిఉంటుంది' - అన్నాడు నట రాజన్.

మరికొన్నిఘడియల్లో - ప్రతిభావంతుడైన అజ్ఞాత రచయిత నటరాజన్ హోటల్ సర్వారు డ్రెస్‌లో తాగిపడున్న నందితదగ్గర కాఫీ చేతో నిలబడ్డాడు. నందిత మత్తుగాఉంది. ఎర్రబడిన ఆమెకళ్ళు విరిసిన మంకెనపువ్వులు అయినయ్. ఈ పెద్దింటి పిల్ల ఈ అందాలరాణి - పాపకూపమైనటిజుయా నాలో తాగిపడుండటం నటరాజన్‌కి చాలా బాధ అని పించింది. ట్రే బల్లమీద పెట్టి 'మేడం!' అన్నాడు.

'యస్'

'కాఫీ'

'ఛ ... ఛ ... వెధవకాఫీ, విస్కీ- కావాలి సర్వర్'

'ఇది ప్రొహిబిషన్ఏరియా'

నందిత నవ్వి 'హోటల్ టిజుయానాలో చేనికీ ప్రొహి బిషన్ లేదు సర్వర్. ఇది ఒక స్వర్గధామం' అంటూ దించు కొంచి తలఎత్తింది.

నిదానించి రెండునిమిషాలు అతనికళ్ళల్లోకి చూసి 'నీవా?' అన్నది.

'అవును, మేడమ్' అన్నాడు నటరాజన్ కాఫీకలుపుతూ. నందిత ఉత్తప్పుడు ఎంత తక్కువ మాట్లాడుతుందో తాగినప్పుడు అంత ఎక్కువగా మాట్లాడుతుంది.

'నేను ఎందుకొచ్చానో తెలుసా సర్వర్?' అన్నది.

నటరాజన్ తెలియదన్నట్లు తలఊపాడు.

'నీకోసమే సర్వర్. నిన్ను ప్రేమిస్తున్నాను' అన్నది నందిత.

'ప్రేమంటే ఏమిటి మేడమ్?'

'అదేమో నాకేం తెలుసు? నీవు కథలు వ్రాస్తావుగా, నువ్వే చెప్పు'

నటరాజన్ తెల్లబోయినాడు. నందిత పకపకా నవ్వి - 'నా పేరుతో కథలువ్రాసి, నువ్వు వేస్తున్నావు. మీ ఆంజనేయులుగారికి వ్రాశాను. ఆయన నువ్వేనని అన్నారు... నీకు తెలుసో తెలియదో నీ నెత్తుటిస్పర్శ అనే కథకి నే నొక ఫాన్ లెటర్ వ్రాశానుకూడా' అన్నది.

నటరాజన్ మాట్లాడకుండా కాఫీకప్పు చేతికి ఇచ్చాడు.

'సర్వర్, ఆ తలుపువేసి రా' అని ఆజ్ఞాపించింది నందిత.

'ఇలా కూర్చో నటరాజన్....నీవు నాకు సర్వరువీ కావు, నేను నీకు మేడమ్‌నీ కాదు' అని అతని చేయిపట్టుకొని లాగింది నందిత.

ఈ మత్తులో ఆమె అనుచితమైనపని ఏదీ చెయ్యదు గదా అనిపించింది నటరాజన్‌కి. వెంటనే మరో ఊహకూడా తళుక్కుమన్నది అతనిమనసులో. ఏవో కొన్ని మత్తులలోపడి

కొందరు అష్టగోలుగా ప్రవర్తిస్తేనేగాని, మరికొందరికి అదృష్టం పట్టదు. తనలో తనే నవ్వుకున్నాడు నటరాజన్. నందిత తిరిగి అతనిచెయ్యి పట్టుకుని, 'ఏం నటరాజన్ కూర్చోవూ?' అన్నది.

'నేను డ్యూటీమీదఉన్నాను మేడమ్'

'ఫరవాలేదు... అసలు జీవితంలో డ్యూటీఅనేది ఒకటి ఎప్పుడూ ఉండకూడదు'

'అలా లేనివాళ్ళు జీవితంఅంతా గమ్యస్థానం అంటూ లేకుండా పరిభ్రమిస్తూ గడుపుతారు'

'నాలాగా అంటావు?'

'నే నలా అనలేదు'

'అనలేదుగాని, ధ్వనించావు. ఎంత చెడ్డా రచయితవి గదా మరి?'

'ఇప్పుడీ చర్చంతా దేనికి ? ఇంతకీ న న్నేం చెయ్యమంటారో చెప్పండి!'

'అంత విసుగ్గా ఉంటే, ఏమీ చెయ్యనక్కరలేదు ' అన్నది బుంగమూతిపెట్టి నందిత. నటరాజన్ నవ్వి

'మీరు అలా చిన్నపిల్లలా అంటే ఎలా? ఇది హోటల్ టెజయానా. ఇందులో మీబోటివారు దిగటమే పొరపాటు. ఆపైన అనామకుడైన ఒక హోటల్ సర్వరుతో – చనువుగా ఉండటం రెండో తప్పు' అన్నాడు.

'నేను మొదటినుంచీ తప్పులుచేయటానికే అలవాటు పడ్డాను సర్వర్! ఫరవాలేదు, వచ్చి కూర్చో'

నటరాజన్ తటపటాయించాడు. నందిత అతనిని లాగి కూర్చోపెట్టింది.

'ఏం సర్వర్, తప్పులూ పొరపాట్లూ అంటే నీ కంత భయం దేనికి'? అన్నది అతనిచెయ్యి తనచేతిలోకి తీసుకుంటూ నందిత.

'నేను తప్పులూ పొరపాట్లూ మధ్య పుట్టి దరిద్రమూ దురదృష్టమూ మధ్య పెరిగాను' అంటూ నవ్వాడునటరాజన్.

'ఏదన్నాసరే నువ్వు నాకు కావాలి' అన్నది నందిత.

'కాని మేడమ్, మీరు నాకు అవసరంలేదు' నటరాజన్ సీరియస్‌గా అన్న ఈ వాక్యానికి నందిత తెల్లబోయింది కాని, ఆ తెల్లబోవటాన్ని కప్పిపుచ్చుకొని, 'ఎందుచేత?' అన్నది.

'మీరు లక్షాధికారికూతురు. నాజన్మలో నేను రూపాయి నోటుకూడా ఖర్చుచేయలేని దరిద్రుడిని. మీరుడాక్టరీచదువుతున్నారు. నాకు తెలుగు తమిళాలు తప్ప మరో భాషరాదు. మీరు ఏదో పొరపాటున తప్పుచేశారు. కనుక, ఆ సమయంలో నేను ఏదో సహాయించేశాను కనుక ఆ సహాయాన్ని ఆధారం చూసుకొని మీమీద ఆశలు కల్పించుకొనే తెలివితక్కువ నాకులేదు. ఆపైన మీ రిప్పుడు నిషాలో ఉండి మాట్లాడుతున్నమాటల్ని నేను నమ్మనూ నమ్మను' అని కుండపగలగొట్టినట్లు చెప్పాడు నటరాజన్.

నందితమత్తు దిగిపోయింది... కొన్నిక్షణాలతరువాత 'నా సంగతులు నీకు ఎలా తెలిశాయి?' అన్నది.

'మనసుంటే మార్గం దొరకదా మేడమ్'

'మరిప్పుడు మనసుండీ మార్గంలేదనేకదా అన్నావు సర్వర్?'

'అలా అనలేదు. ఆ మార్గం చాలా బాధాకరమైనదని అన్నాను'

'ఆ మార్గాన్ని ప్రయాణం చేయటంలోనే అద్భుతమైన ఆనందం ఉన్నది నటరాజన్'

'న న్నేంచేయమంటారు ?'

'మళ్ళీ అదే ప్రశ్నా ?' అని అతనిబుగ్గమీద చిటికె వేసింది నందిత. నటరాజన్ చివాలున లేచి నిల్చుని 'క్షమించండి మేడమ్!' అన్నాడు.

నందిత చిన్నబుచ్చుకుని 'నన్ను అవమానపరుస్తున్నావు?' అన్నది.

'లేదు, నా అభిమానాన్ని గౌరవిస్తున్నాను'

'అంటే నీ అభిప్రాయం ?'

'ఏమీ లేదు, కొన్ని వాంఛలకీ – మరికొన్ని కోరికలకీ అతీతమైన ఆరాధన ఉన్నచోట దైహికసంబంధం నాకుఇష్టం ఉండదు'

'ఇదెక్కడి సిద్ధాంతం ?'

'ఎక్కడిదయినా అది గొప్పది – మలినాన్ని చీపురు కట్టతో ఊడవాలిగాని, చమరీవాలంతో కాదు'

'నీవు రచయితవు – గగనవిహారివి. మేము వాస్తవం. ప్రతిదీ కోసి చూస్తాం. నీతి అవినీతులు ఆరాధన ఆంతర్యం ఇవి మాకు బోధపడవు. ఏ మనిషిమీదయినా వస్తువుమీద నయినా వాంచకలిగిందో అనుభవిస్తాం. కలుగలేదూ, వాటి జోలికి పోము. ఇష్టానికీ వాంఛకీ ప్రేమఅనే పేరుపెట్టి కథలూ

గేయాలూ అల్లటం మాకు చేతగాదు' అన్నది నందిత నటరాజన్‌లాగానే నొక్కి పలుకుతూ.

నటరాజన్ నవ్వి 'మీరు జీవితంతోనూ ఆరాధనతోను ఆడుకోగలరుకాని, అవే మాకు ప్రాణం' అన్నాడు.

నందిత అతనివంక చిత్రంగాచూసి 'తాగిఉన్నాను కనుక ఇలా మాట్లాడుతున్నానని అనుకుంటున్నావుగదూ? కాదు, నటరాజన్, నువ్వంటే నాకు ఇష్టం. నువ్వు నా ప్రియ బంధువివి' అన్నది.

'అదృష్టవంతుడిని మేడమ్ - అందుకే ఆ అదృష్టాన్ని పోగొట్టుకొంటానేమో అని అనుక్షణమూ భయపడుతూ ఉంటాను' అని నిట్టూర్చాడు నటరాజన్.

దేనికీ భయపడకూడదు, దేనికీ లొంగిపోకూడదు, ఏదీ పోతుందేమోనని ఆరాటపడకూడదు. బ్రతుకుని ప్రోబ్లమ్ చేసుకుని, ఆన్సర్ కోసం అన్వేషించకూడదు. అప్పుడే సుఖం లభిస్తుంది నటరాజన్!' అన్నది నందిత.

ఆమెనిషా ఇందాకటికన్న కొంచెం దిగింది. ఆమె కొద్దిగా నిలదొక్కుకుని మాట్లాడగలుగుతోంది. నటరాజన్‌కి నందితఅంటే ఎవరో ఏమిటో ఇంకా పూర్తిగా తెలియదు.

అయినా ఆ స్త్రీని తను ఆరాధిస్తున్నాడు. దేవీ మూర్తిని ప్రియురాలిగా భావించవచ్చును గాని, శారీరికంగా ఆమెని స్త్రీగా భావించటం అతనికి చేతగాదు. అందుకే నందితలో స్త్రీని చూడలేకపోతున్నాడు. అతనుపవిత్రుడుకాడు.

స్త్రీని డబ్బుపెట్టి కొనుక్కోవడం మాత్రమే కాదు, అందిన ప్రతిచోటా అవకాశాన్ని వృథాపోనీయకుండా అను

భవించాడు - కాని, ఈ నందిత ఏ పూర్వజన్మ పుణ్యఫలం గానో తనకి లభించిన మహా వరం.

లేకపోతే తనెక్కడ? ఆమె ఎక్కడ? ఈ అయాచిత మైన ఈ అదృష్టం ఎక్కడ?

'సర్వర్!'

'యస్ మేడమ్!'

'కాఫీ ఇలా ఇచ్చి, ఆ తలుపు దగ్గిరికివేసి వెళ్ళు; కొంచెంసేపు నిద్రపోతాను' అన్నది నందిత.

ఆమెచెప్పినట్లుచేసి నిశ్శబ్దంగా మెట్లుదిగాడు నట రాజన్. ఆమె సమక్షంలోంచి బయటికి రావటంఅంటే అత నికి కష్టమే అనిపించింది. తనకుతానై ఆమె ఆహ్వానించి నప్పుడు ఆమెను పొందలేక అదే ఆరాధనఅని తనని తను ఎందుకు భ్రమపెట్టుకోవాలి? ఇందువలన తను పొందగలిగింది ఏమిటి? ఏమీలేదు-ఏదో మహాత్యాగం చేశాననేతృప్తితప్ప.

నటరాజన్ మెట్లు సాంతందిగి తనపని తను చేసుకోటం ప్రారంభించాడు.

# 9

ఆరణి ఇంకా బలహీనంగానే ఉన్నాడు. జ్వరం వలన వచ్చిన నీరసంనుంచి అతనింకా కోలుకోలేదు. ఆ నీరసం వలన అతని అందం మరికొంచెం ఎక్కువయింది. తన దిక్కు లేనితనాన్ని తనలేమినీ ఏనాడో మర్చిపోయిన ఆరణిలో - ఇప్పుడు స్థైర్యం ఎక్కువయింది. అప్పుడే ఇంత ఉసిరి కాయపచ్చడీ-చింతకాయపచ్చడీ చారుతో మెత్తగా అన్నం పిసికిపెట్టింది కనకాంగి.

జ్వరంవచ్చి లేచినతరువాత పత్యంతిన్న రెండుమూడు రోజులవరకూ పగలు నిద్రపోకూడదు. అందుకే కనకాంగి ఆరణిని కాపలాకాస్తున్నది.

'ఆరోజు వచ్చారే జగన్మోహనరావుగారు ఆయన ఎవరు?' తమలపాకులు ఈనెలుతీస్తున్న కనకాంగిని ప్రశ్నించాడు ఆరణి.

కనకాంగి తలఎత్తిచూసి నవ్వుతూ 'ఈ ప్రశ్నకి సమాధానంచెప్పాలంటే ఒకకథ ప్రారంభించాలి' అన్నది.

'చెప్పు'ఎలాగూ నిద్రపోనియ్యవుగా' అని దిండు గోడకి చేరవేసి కూర్చున్నాడు ఆరణి. తమలపాకులు ఈనెలుతీసి పాన్‌దాన్ మూసివేసి_చెప్పటం ప్రారంభించింది కనకాంగి.

'నువ్వు పసివాడివి - జీవితపు అవతలిగట్టున ఎడారులే ఉన్నాయో, ఎండమావులే ఉన్నాయో! అర్థంచేసుకునే వయసు నీకు లేదు. బహుశా ఇప్పుడు నేను చెప్పబోయే కథ నీకు అర్థంకూడాకాదు' అని కొంచెంసేపు ఆగింది కనకాంగి.

'జగన్మోహనరావుగారు తమ పద్దెమూడవఏట ఆ అమ్మాయిని చూశారు.నిజంచెప్పాలంటే మొదటఆఅమ్మాయే ఆయనని కవ్వించింది. ఈవిధంగా అయిదారేళ్లు గడచిపోయినయి. ఈ అయిదారేళ్ళూ ఆ అమ్మాయిని కలుసుకోవటానికి వీలుకాలేదు. కొన్ని కుటుంబవ్యవహారాలవల్ల ఆయన ఆ వూరు వదలివెళ్ళిపోయినారు. ఈలోగా ఆపిల్లకి పెళ్ళిఅయింది. ఒకరోజు సాయంత్రం ఆయన వీధిలో వెడుతుంటే లోపలికి రమ్మని పిలిచింది. అదివరకు ఎన్నడూ మాట్లాడని స్త్రీ

తన కలల్లోని అప్సరస అనుకోకుండా ఆహ్వానించేసరికి ఆయన ఆశ్చర్యపోయి - లోపలికి వెళ్ళారు'

'స్త్రీ తలుపులుతీసి ఆహ్వానిస్తే లోపలికి వెళ్ళనివాడు ఉంటాడా మరి!' అన్నాడు ఆరణి. కనకాంగి నవ్వి తిరిగీ చెప్పటం ఆరంభించింది.

'ఆవిధంగా గొడ్లసావిట్లోనూ ఇంట్లోనూ రెండుమూడు రోజులు రహస్యంగా కలుసుకున్నారు. మూడవరోజున ఇరుగు పొరుగుల్లో ఎవరో చూసి, ఆవిడభర్తకి చెప్పేసరికి - అతను కర్రల్తో కాపువేశాడు. జగన్మోహనరావుగారికి ఆ ఇల్లు అల వాటేకనుక, గోడదాటి పారిపోయినారు. ఆ భర్త ఆ అమ్మా యిని నిగ్గదీస్తే - నాకేం తెలియదు. అతనే నన్ను బలవంతం చేశాడని చెప్పి నేరంఅంతా అతనిమీదికి తోసింది - ఈ మాట విని జగన్మోహనరావుగారికి అసహ్యంవేసి, ఆవూరు నించి వెళ్ళిపోయినారు...అంటే అసహ్యంవేసినందువల్ల ఊరు కొంచెం తొందరగా వదిలారు. అదివరకే ఆయన ఉద్యోగంలోఉన్నారు. సరే, ఆయనవెళ్ళిన కొన్నిరోజులకి ఉత్తరంవచ్చింది - గత్యంతరంలేక అలా చెప్పాననీ, క్షమిం చమనీ ఉన్నది అందులో. చిత్రంఏమిటంటే, జగన్మోహన రావుగారికి ఆమెఅంటే అపరిమితమైన ప్రేమా, ఆరాధనా, వాంఛా ఉన్నాయి. కాని, ఆవిడే మధ్యమధ్య అతన్ని అవ మానించటం, దూరంగాపోవటం చేస్తూఉంటుంది. పోనీఅని ఆయన కొద్దిరోజులు దూరంగాఉంటే - ఉత్తరం వ్రాసో - కబురుపంపో మళ్ళీ ఆకర్షిస్తుంది. ఇక ఆ ఆకర్షణికి ఈయన తట్టు

కోప్పేరు - ఆవిడ అబద్ధమాడినతరువాత ఆయన కొన్నిసంవత్సరాలు ఆమెని చూడలేదు'

'విచిత్రమైన ప్రేమకథ'

'అప్పుడే ఎక్కడ అయింది, విను - ఈ కొన్నిసంవత్సరాల్లో ఆమె ఇద్దరుపిల్లల తల్లికావటం, భర్తపోవటం జరిగింది. అప్పుడు జగన్మోహనరావుగారు మద్రాసులో ఉన్నారు. ఇంకా ఆయనకు పెళ్ళికాలేదు. ఈ పరిస్థితిలో హటాత్తుగా ఆమె వీరిఇంటికి వచ్చింది. జగన్మోహనరావుగారి తల్లికి వీళ్ళు బంధువులు. సరే, మళ్ళీ కొన్నిరోజులు ఇద్దరూ కలిసిఉన్నారు. రాత్రిళ్ళు వీళ్ళ రాకపోకల్నిఆమెఅన్నగారూ, జగన్మోహనరావుగారితల్లీ ఇద్దరూ చూశారు.

'చూస్తే పరవాలేదు. నిన్ను పెళ్ళిచేసుకుంటా'నని ఎన్నివిధాలో చెప్పారు. ఆమె వినలేదు - మరునాడు అన్నగారితో వెళ్ళిపోయింది. వివాహాన్ని తిరస్కరించిందనే కోపంచేత మళ్ళీ కొన్నిసంవత్సరాలు మాటలులేవు. వీళ్ళు పొందింది లేకపోయినా వీళ్ళప్రేమగాథ లోకానికి తెలియనే తెలిసింది. నాలుగుఇళ్ళఅవతల ఆమెఇల్లు ఉందిట వాళ్ళఊళ్ళో. ఆమె దొడ్లో తిరుగుతుంటే కనిపించాలని ఆయన మూడు అంతస్తులమేడ కట్టించారంటే, ఆ ప్రేమ ఎంత బలవత్తరమైనదో ఆలోచించు' అన్నది కనకాంగి.

'ప్రేమ ఎప్పుడూ బలవత్తరమైనదే. సరే, కథ కానీ' అని నవ్వాడు ఆరణి.

'ఆ విరక్తిలో తల్లిచెప్పినట్లు విని, ఒక డబ్బుగల అమ్మాయిని పెళ్ళిచేసుకుని ఆ డబ్బుతో వ్యాపారం ప్రారం

భించారు - బాగా కలిసి వచ్చింది. ఇక్కడ ఈయన ఇలా ఉండగా, అక్కడ ఆమెఆస్తి వ్యాజ్యంలో ఇరుక్కుంది. త్రాగుమోతుఅన్నగారు సరిగా కనుక్కోటంలేదు. ఈ దిగులు తోనూ, ఆ దిగులుతోనూ ఆమె మంచంపట్టింది. వైద్యులు కాన్సర్ అన్నారు - పిల్లలిద్దరూ చిన్నవాళ్ళు. ఈ స్థితిలో ఆమె కొన్నిఏళ్ళతరువాత జగన్మోహనరావుగారికి ఉత్తరం వ్రాసింది. ఆ ఉత్తరం చూడగానే - తల్లినీ, భార్యనీ బంధువుల్నీ, గౌరవాన్నీ లెక్కచేయకుండా ఆమెను మద్రాసు తీసుకువచ్చి నయంచేయించారు ఆయన. మళ్ళీ కొన్ని రోజులు ఆమెసమక్షంలో స్వర్గందొరికింది. 'నీవు నాతో ఉండిపో' అని అడిగారు. ఆమె మళ్లీ ఒప్పుకోలేదు.

ఆమె నయంఅయి వెళ్ళిన కొన్నిరోజులకి జగన్మోహనరావుగారికి కారుయాక్సిడెంట్‌లో చాలా ప్రమాదం జరిగి, రెండునెలలు మంచంలో ఉన్నారు. అప్పుడు ఆమెను చూడాలనిఉంది, రమ్మని ఉత్తరం వ్రాయించారు. ఆమె రాలేదు సరిగదా - ఆఖరికి సమాధానంకూడా ఇవ్వలేదు. అప్పుడాయనకి చాలా విరక్తికలిగింది. తనతల్లికీ భార్యకీ నచ్చచెప్పి, తనప్రేమలోఉన్న ఔన్నత్యాన్ని చెప్పి, ఆమెకి జబ్బుచేసినప్పుడు డబ్బు ఖర్చుపెట్టటమేకాకుండా, తనభార్య చేత ఆమెకి సేవచేయించారు. కనీసం వాళ్ళఎదుట తనపరువు దక్కించటంకోసమైనా ఆమె రావాలి. కాని రాలేదు'

'ఎందుకని?'

'అదే ఆయనకీ అర్థంకాలేదు.బంధువులందరూ వచ్చి చూచినప్పుడు బంధువుగానయినా ఆమె వచ్చి చూడవచ్చు

ను - అలాగూ చేయలేదు - పోనీ, తనకు ఆయన చేసిన సహాయానికి కృతజ్ఞతతో అయినా రావచ్చును, లేదా బాల్యం నించీఉన్న ప్రేమాభిమానాలచేతనయినా రావచ్చును. ఆమె ఏదీ చేయలేదు'

'లోకానికి భయపడిందేమో!'

'ఆ భయం ఆమెకు లేదు. పట్టపగలు గొడ్లసావిడిలో ఆయన్ని కలుసుకున్నప్పుడూ, రాత్రిళ్ళు ఆయనగదికి రాకపోకలు సాగించినప్పుడూ ఆమె లోకానికి భయపడలేదు - ఎవరయినాచూస్తారేమో అని ఆయన అంటే, నవ్వి, చూస్తే ఫరవాలేదు అన్నదిట. అలాటిస్త్రీకి లోకభయం అంటే అర్థంలేదు. పైగా లోకానికి తెలియనేతెలుసు. ఇలా కొన్నాళ్ళు గడిచింది. జగన్మోహనరావుగారు కోలుకొన్న తరువాత తిరిగీ ఆ వూరు వెళ్ళారు. అప్పుడు పాలేరుకి ఒకసారి రమ్మని చీటీఇచ్చింది. అది జగన్మోహనరావుగారి తల్లి చేతిలో పడటమూ, ఆవిడ పాలేరునీ, పంపినవాళ్ళనీ కలిపి నానామాటలూ అనటమూ జరిగింది. నా బిడ్డ లోకాన్ని లెక్కచెయ్యలేదు. వాడికి అంత దెబ్బతగిలితే వచ్చి చూడలేదే అని ఆవిడకోపం.

'మేడమీదనుంచి ఇదంతా చూస్తున్న జగన్మోహనరావుగారు - ఆ పిలుపులోఉన్న ఆకర్షణని తట్టుకోలేక - తన కోపాన్ని మర్చిపోయి, ఆరాత్రి ఆమెయింటికి వెళ్ళారు. ఆమె పెద్దకొడుకు పధ్నాలుగుఏళ్ళవాడు _ ఈయన గోడదూకడం చూసి, దొంగ అనుకుని కేకలుపెట్టటమూ, ఆమె అన్న,

ఒదిన, చెల్లెలూ, తల్లీ మూగటమూ జరిగింది. తలవంచుకుని మాట్లాడకుండా వచ్చేశారు జగన్మోహనరావుగారు'

'మరి ఆమెసంగతి ఏమయింది?'

'తనకేం తెలియదనీ, అతనే వచ్చాడనీ చెప్పి తప్పించుకుంది'

'విచిత్రంగా నేఉంది!'

'అది విని జగన్మోహనరావుగారితల్లి నానామాటలూ అన్నది. ఆయనకికూడా కోపంవచ్చింది. కొన్నిసంవత్సరాలు ఆమెని మేడమీదినుంచి చూసి తృప్తిపడ్డారు. మొన్న ఆమె కొడుకుపెళ్ళి అయిందిట. వెళితే రెండుమాటలు మాట్లాడిందిట'

'ఆవిడకి ఎన్నేళ్ళుంటాయి?'

'ఆయనవయసే. నలభైఏండ్లు ఉండవచ్చును'

'ఈయనికి ఆవిడంటే అసహ్యమూ ప్రేమా ఉన్నాయి కదూ?'

'ఏమో అర్థంకాదు - కాని ఒకటిమాత్రం తెలుసు. ఆవిడవలన ఏమీ పొందలేకపోయినాగాని-ఎన్నిఅవమానాలు పొందినాగాని ఆ స్త్రీ ఆయన సర్వస్వం. - పదమూడోఏట ఆమెని చూసినదగ్గరనుంచీ అంటే, ఈ ముప్ఫయిఏళ్ళనుంచీ అనుక్షణం ఆమె జ్ఞాపకం ఆయనని విడవటంలేదు. తిడుతూనో పొగుడుతూనో ఆమెనితల్చుకుంటూ నేఉంటారు. ఆమె కన్యగా వున్నప్పటినించి అత్తగారయిన ఇప్పటిదాకా ఆమెతో ఆయనగడిపినకాలం ఒక నెలకూడా పూర్తిగాఉండదు'.

'వాళ్ళిద్దరికీ దైహికసంబంధం ఉందా?'

'ఉన్నది... కాని, ఆమె రోగిష్టిది. కాన్సర్‌తో బాధ పడుతున్నది. దైహికంగా ఆమెకివ్వగలిగిన పెద్ద సుఖమేమీ లేదు'

'మరి ఈయననిగురించి ఆవిడకిఉన్నభావం ఎలాటిది?'

'అదే అర్థంకాదు. మొదట ఇతన్ని రెచ్చగొట్టింది ఆమే. తరువాత తనతో గడపమని కోరిందీ ఆమే. అవమానించిందీ ఆవిడే. తరువాత ఇంకోచిత్రం ఏమిటంటే, రహస్యంగా సుఖపడవచ్చును - అలాచేయదు - ఆ ఉన్నదికాస్తా బయటపెట్టుకోటంలో ఆనందం ఆవిడికి. దొంగఅని కొడుకు చేత అరిపించిందీ - మొగుడికి చెప్పి కాపలాకాయించిందీ ఆమేనని నా ఉద్దేశ్యం'

'అదేమిటి?'

'అంతే మరి - కొందరు ఆడవాళ్ళకి ప్రేమభంగాలంటే చాలా ఇష్టం. జగన్మోహనరావుగారు ఆమెని కాదంటే, ఆవిడకోరిక నెరవేరిఉండేది - ఈయన కాదనలేదు. అందుకే అసహ్యం కలిగించే పనులన్నీ చేసింది. కొన్నాళ్ళు ఆయన అసహ్యించుకోవటమూ- విఫలప్రేమతో ఈవిడ ఆయనకి ఉత్తరంవ్రాయటమూ జరిగింది. ఆ వ్రాయటంలో ఆమెకి ఆనందంఉన్నది'

'బాగుంది'

'చెప్పానుగా, సంయోగంలోకన్న వియోగంలోనే ఆనందం కొందరికి - ఆ వియోగం కల్పించుకోటంకోసం ఇలా చేస్తున్నదని నా అనుమానం' అన్నది కనకాంగి.

ఆరణి మాట్లాడలేదు. అతనిమనసులో రకరకాల ఆలోచనలు సుడితిరుగుతున్నాయ్. జ్వరంతో నీరసించిన అతనిశరీరం ఆలోచనలబరువుకి తట్టుకోలేకపోయింది.

ఆలోచనలచిక్కులోంచి తననితాను వదిలించుకుని, కనకాంగివంక చూశాడు. సంగపండుచాయ; కంచిపట్టుచీర కట్టుకుని, అదేరంగురవిక తొడుక్కుని తాంబూలరాగంతో అరుణమైన అధరాన్నివిరిచి పండిందో లేదో పరీక్షించుకుంటున్న కనకాంగి అతనిని మోహపెట్టింది.

ఆ క్షణంలో ఆమెకు తనఈడుకొడుకే ఉన్నాడన్నసంగతి ఆరణికి గుర్తురాలేదు. ఆ క్షణంలో తనస్థితికూడా అతనికి గుర్తురాలేదు - ఆమెవంక అలాగే చూస్తున్నాడు. అతని మనసులో కలిగిన సంచలనాన్ని కనకాంగి గ్రహించింది.

ఈ పసివాడు తనని ఆరాధించటమేకాదు - వాంఛిస్తున్నాడు. కోడెనాగు పడగవిప్పినట్లు ఆ వాంఛ అతనిలో ఇప్పుడు పడగవిప్పింది. ఈ జబ్బుస్థితిలో అదెంత అనర్ధదాయకమో ఆమెకు తెలుసు.

కనకాంగి తలుపు దగ్గరికివేసి అక్కడినించి వెళ్ళిపోయింది.

ఆమెవెళ్ళిన అయిదారునిముషాలలో సూర్యనారాయణ ఆ గదిలోకి వచ్చాడు. ఆరణి అతన్నిచూసి పక్కకి జరిగి కూర్చోమన్నాడు.

'మీనాక్షి ఉత్తరంవ్రాసింది' అన్నాడు సూర్యనారాయణ ఆరణిపక్కనే కూర్చుంటూ.

ఇప్పుడు సూర్యనారాయణ తల్లిని అసహ్యించుకుంటం లేదు. ఆరణిని అర్థంచేసుకున్నాడు. అందుకే మీనాక్షిఉత్తరం సంగతి చెప్పటానికి అతనిగదిలోకి వచ్చాడు.

'ఏం వ్రాసింది?' ఆరణి లేచికూర్చుంటూ అడిగాడు.

'నన్ను వెంటనే బయలుదేరి రమ్మన్నది'

'ఎందుకుట?'

'కారణం ఏమీ వ్రాయలేదు'

'వెడతావా మరి?'

'వెళ్ళాలనే అనుకుంటున్నాను' అన్నాడు సూర్య నారాయణ.

ఆరణి మాట్లాడలేదు. మీనాక్షిఅంటే సూర్యనారాయణకి విపరీతమైన అభిమానం అన్న సంగతి అతనికి తెలుసు కాని, ఆ అభిమానంయొక్క స్వరూపం ఎలాటిదయిందీ - ఎంతదూరం ఆ అభిమానం వెళ్ళిందీ అతనికి తెలియదు - తెలుసుకోవాలనికూడా అతను ప్రయత్నించలేదు. అందుకోసమే అతను సూర్యనారాయణకి సలహాలిచ్చేస్థితిలో లేడు.

'మీఅమ్మకి చెప్పకపోయినావా?' అన్నాడు, ఆ నిముషంలో అరవయిఏళ్ళు పెరిగిపోయిన ఆరణి.

'నువ్వు చెప్పు - అందుకే వచ్చింది'

ఆరణి సమాధానం చెప్పలేదు.

'నేను సాయంత్రంబండికి వెడతాను. అమ్మ ఏమీ అనుకోదని తెలిసికూడా ఎందుకో ఆమెకు చెప్పబుద్ధికావటం లేదు' అని నిట్టూర్చాడు సూర్యనారాయణ.

చివరికి సరేనని తలవూపక తప్పలేదు ఆరణికి.

సూర్యనారాయణకృతజ్ఞతాపూర్వకంగా అతనివంక చూసి వెళ్లిపోయినాడు. అంతర్యంపెకుతున్న అగ్నిపరీక్ష తాలూకు వేడికి శరీరం అలిసి వివశమైపోగా - నిద్ర నిషేధ మని తెలిసినాకూడా అన్నీ విస్మరించి నిద్రలోకూరుకుపోయి నాడు ఆరణి.

# 10

నీకంటె ప్రియబంధువు మరెవరూ లేరు, వెంటనే రా, అని మీనాక్షి వ్రాసిన వాక్యాలు సూర్యనారాయణకి అపరి మితమైన ఆనందాన్నీ తృప్తినీ ఇచ్చినయ్.

అనాథా - అమిత జ్ఞానవంతురాలూ అయిన ఒక స్త్రీ నీకంటె నా కెవరూ లేరు - అనటంలో అపరిమితమైన తెలివినికూడా ప్రదర్శిస్తుంది. అయితే, ఆ తెలివి స్వార్థం కోసమే అనుకుంటే పొరపాటు. అందులో ఆ స్త్రీ - పురుషు లిద్దరిఆనందమూ ఇమిడిఉంది. అందుకే అలా వ్రాసింది మీనాక్షి. ఆమె అనుకున్నట్లుగానే సూర్యనారాయణని ఆ వాక్యాలు తృప్తిపరిచినయ్. అతను గొప్పసంతృప్తిచెందాడు.

ఆ సంతృప్తితోనే అతను దుర్గాకళామందిరం పక్క రోడ్డులోని మురికినీ కశ్మలాన్నీ కూడా గుర్తించకుండా ఆ ఇంటిముందు నిలబడ్డాడు.

అతనినిచూడగానే మీనాక్షికన్నులు గొప్పకాంతితో వెలిగినయ్. గబగబా ఎదురొచ్చి 'వచ్చావా సూరీ!' అన్నది

సూర్యనారాయణ ఆమెనిచూసి ఆశ్చర్యపోయినాడు. మీనాక్షి చిక్కిపోయింది. కన్నులు లోతుకుపోయినయ్ - బసవ్వుగా ఉన్నశరీరంగాఉంటే ఆమెనడుమ్ము చిక్కిపోయి, అంద

వికారంగా తయారయింది. మీనాక్షి తిండిలేనందువల్లా, దరిద్రంవల్లా ఇలా తయారయిందంటే సూర్యనారాయణ నమ్మలేదు. ఎలాటివ్యథనయినా నోరెత్తకుండా సహించటం ఆమెకు చేతనవును. మరెందుకిలా తయారయింది?

'మీనాక్షీ, నువ్వేనా!' అన్నాడు చివరకి. అంతవరకూ ఎలాగో బిగబట్టుకున్న దుఃఖం ఆ వాక్యంతో కట్టలు తెంచుకుంది మీనాక్షికి. సూర్యనారాయణ గుండెలమీద వాలిపోయి గావురుమంది.

సూర్యనారాయణ ఆమెతలమీద చెయ్యివేసి, 'ఎందుకమ్మా' అన్నాడు ఆక్షణంలో తను ఆమెకన్న పెద్దవాడయినట్లు అనిపించింది - సర్వస్వం ధారపోసిఅయినాసరే, ఆమెకష్టాలు నివారించాలి.

'సూరీ, నేనంటే నీ కింత అభిమానం దేనికి? నావల్ల నువ్వేం పొందగలిగావు?' అన్నది. మీనాక్షికి దుఃఖంవలన వెక్కిలు వస్తున్నాయి. జేబులోంచి జేబు రుమాలుతీసి, ఆమెకన్నీటిని తుడిచాడు సూర్యనారాయణ. ఇద్దరూ ఒకరినొకరు ఆనుకునే లోపలికి నడిచారు.

ఆ గది చితచితలాడుతున్నది - కాళ్ళు తుడుచుకోడానికివేసిన గోనెపట్టా బురదకొట్టుకుని జిగురుగా కాలికిఅంటుకుంటున్నది. అక్కడక్కడ ఇంటిపై కప్పులోంచికారిన నీళ్ళచే చిన్నగుంటలు ఏర్పడినయ్.

తెగి తాళ్ళు వేళ్ళాడుతున్న నులకమంచంమీద కూర్చుని కంచంలోఉన్న రొట్టెముక్కకోసం ముగ్గురుపిల్లలూ దెబ్బలాడుకుంటున్నారు.

గోనెపట్టాకట్టి తయారుచేసిన వంటింట్లోనుంచి వస్తున్న పొగ ఇంట్లో నిశ్వారాజిందనటానికి నిదర్శనం. ఆ ఇల్లు దరిద్రానికీ ఆకలికీ అశుభ్రతకిచిహ్నం- ఇల్లు హైన్యానికీ మురికికీ, నికృష్టతకీ నిదర్శనం-అయితే, శోచనీయమైనవిషయం యేమిటంటే - ఆ హైన్యంలోనూ దరిద్రంలోనూ బ్రతుకుతున్న వాళ్ళకి హైన్యం అంటే ఏమిటో తెలుసు. తెలిసికూడా అందులోనే బ్రతకవలసిరావటం అంత దౌర్భాగ్యం మరొకటిలేదు.

మురికి - ఆకలి - ఈగలు - దుఃఖం - నిండిన ఆ ఇంట్లో అడుగుపెట్టేసరికి సూర్యనారాయణకి భయంవేసింది. ఈ వాతావరణంలో మనుష్యులు ఎలా బ్రతుకుతారో అతనికి అర్థంకాలేదు. ఆక్షణంలో అతనికి అనిపించింది - అవినీతిలో బ్రతకవచ్చును - అంగవైకల్యముతో బ్రతుకవచ్చును- ఆప్తుల్ని పోగొట్టుకున్నతరువాతకూడా ఊపిరిపీల్చి జీవించవచ్చును. కాని, దరిద్రంలోనూ అశుభ్రంలోనూ బ్రతకటం చాలా కష్టం - అందులో శుభ్రతగురించీ, సౌఖ్యంగురించీ తెలిసినతరువాత.

ఏదో పాపంచేసుకుంటేగాని, ఈ వాతావరణంలో మనుషులు బ్రతకవలసిరాదు - అనుకున్నా డతను. ఆ క్షణంలో అతనికి అనిపించింది - అవినీతిలోనే బ్రతకటం తేలిక అని.

ఆ అవినీతి డబ్బునిస్తే ఫరవాలేదు - కాని, అవినీతీ దరిద్రమూ రెండూ ఒకదానికొకటి తోడయితే జీవితం

మరింత నికృష్టంగా తయారవుతుంది. ఇప్పు డిక్కడ అవినీతీ దరిద్రమూ రెండూ తోడయినయ్.

తనఇంట్లో అవినీతే గాని, దరిద్రం లేదు. ఆ అవినీతి అయినా తమసాంప్రదాయానికి నిషిద్ధంకాదు కనుక, అది నీతికిందికే వస్తుంది. ఇక్కడ అది లేదు. అంతా అవినీతి, కుళ్ళు, ఈగలు, మురికి, దరిద్రం. ఛీ ఛీ! అనుకున్నాడు సూర్యనారాయణ.

'మీనాక్షీ! మనం అలా వెళ్ళి మాట్లాడుకుందాం పదరాదూ?' అన్నాడు చివరికి. మీనాక్షి అంగీకారసూచకంగా తలఊపి, ఆ చిరుగులపమిటని ఒంటినిండా కప్పుకుంది. దానివలన ఆమెయవ్వనం మరింత స్పష్టమయింది. అదివరకు మడతలలో దాక్కున్న చిరుగులు ఇప్పుడు పరుచుకుని లోకం కన్నులకన్న అసహ్యంగా తయారయినయ్.

ఇద్దరూ నడచి డౌలీపార్కు చేరుకున్నారు. ఒక నిద్ర గన్నేరుచెట్టుకింద విరిగిపోయిన సిమెంటుబెంచి ఉంది - తన పమిటకొంగుతో దాన్ని శుభ్రంచేసి సూర్యనారాయణని కూర్చోమన్నది మీనాక్షి.

కొంచెంసేపు ఇద్దరూ మాట్లాడలేదు.

'ఎందు కంత త్వరగా రమ్మని వ్రాశావు?' అని సూర్యనారాయణ ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకి మీనాక్షి నవ్వి 'మా ఆయన ఎలా ఉన్నాడు?' అన్నది.

'ఏం మళ్ళీ అక్కడికి పోదామని బుద్ధిపుడుతోందా ఏమిటి?' అని చిరాగ్గా ప్రశ్నించాడు సూర్యనారాయణ.

'అవును, సూరీ! ఈలోకంలో ఆడదానికి మొగుడు మినహా మరో గత్యంతరం లేదేమో అనిపిస్తున్నది ఇప్పు డిప్పుడు'

నిజమేగాని, మొగాడయిన ప్రతివాడూ మొగుడు కావ టానికి అర్హుడుకాడు' అని నవ్వాడు సూర్యనారాయణ.

ఆమాటకొస్తే భార్యకాకుండా బ్రతకగల్గిన అర్హత స్త్రీకి అసలే లేదు'

'ఇంతకీ విషయం ఏమిటో చెపుదూ?'

'ఏమీలేదు, నటరాజన్‌కి భారంగాఉండటానికి మన సొప్పటంలేదు'

'అంటే?'

'అంటే ఏంలేదు. నాకు నాలుగు మెతుకులు పెట్టలేవూ?'

సూర్యనారాయణ తెల్లబోయినాడు. కొద్దిగా సంతో షించాడుకూడా.

'ఏం సూరీ, మాట్లాడవేం?'

'ఏంమాట్లాడను?'

'అన్నం పెడతావో పెట్టవో చెప్పు?'

'నువ్వామాట అనగానే సంతోషంచేత మాటరావ టంలేదు'

'ఎందుకు?'

'నీవు నాదగ్గరఉండటంకన్న నాకు ఆనందం ఏము న్నది?'

'ఇప్పుడలాగే అనిపించవచ్చును'

'కావచ్చును కాని, ఆ ఇప్పుడు అబద్ధంకాదుగా' అన్నాడు సూర్యనారాయణ.

'కాని, అలా నీవు పెట్టనినాడు సుఖంమరిగిన నాగతేమిటి... అలా అడగటానికి నాకు హక్కులేదనుకో' అని నవ్వింది మీనాక్షి.

'అలా పెటలేనప్పుడు నాగతిఏమిటో ఆలోచించ వెందుకని?'

'అంటే?'

'అంటే నిన్ను పోగొట్టుకొన్నరోజున నా మిగతా జీవితం సంగతేమిటని.'

మీనాక్షి ఆనందం పట్టలేకపోయింది. పార్కులో జనంఉన్నారన్నసంగతికూడా మర్చిపోయి సూర్యనారాయణ చెయ్యి తనచేతిలోకి తీసుకొని,

'సూరీ, నీ ఋణాన్ని నేను ఏవిధంగానూ తీర్చుకోలేను' అన్నది. ఆమెకంఠం గాద్గద్యమయింది.

'ఇంతకూ అసలువిషయం చెప్పావుగాదు....నేను అప్పుడే ఉండిపోయేవాడిని, అనవసరంగా నన్ను వెళ్ళగొట్టావుగాని' అన్నాడు సూర్యనారాయణ. మీనాక్షి కొంచెం సేపు మాట్లాడలేదు తరువాత-

'నీదగ్గర నాకు దాపరిక మేమిటి! ....నటరాజన్ అనవసరమైనబాధ్యతని నెత్తిమీదవేసుకున్నాడు - దానితో వచ్చేది చాలటంలేదు. ఆ పరిస్థితిలో నేనుకూడా వాడికి 'భారంగాఉండలేను' అని - కొంచెం ఆగి

'నా భారం మొయ్యగలభుజాలు ఈలోకంలో నీ ఒక్కడివే - ఏనాటికయినా అవే మొయ్యాలని నాకు తెలుసు. అందుకే నీకు ఉత్తరం వ్రాశాను' అన్నదిమీనాక్షి.

'ఆమె నిన్ను మాటలని అవమానించలేదుకద' అని తనని ఇందాకటినుంచీ పీడిస్తున్న సందేహాన్ని బయట పెట్టాడు సూర్యనారాయణ.

మీనాక్షి సమాధానంఇవ్వలేదు - దానినిబట్టి అలాటిదే ఏదో జరిగిఉంటుందని నిశ్చయించుకొని తరువాత ఇక తరచి అడగలేదు.

ఆకులసందునుంచి ఎండ పొడలు పొడలుగా ఆ ఇద్దరి మీదా పడుతున్నది. ఎవరో ఇద్దరు ఆ పచ్చికమీదపడి నిద్ర పోతున్నారు. సూర్యనారాయణ లేచి నిలబడి 'అలా ఒకసారి బజారుకేసి పోదాం పద' అని నడవటం ప్రారంభించాడు.

మీనాక్షి నవ్వి 'భరించటం ప్రారంభించకమునుపే భర్తగా అధికారంచేస్తున్నావేమిటి ?' అన్నది.

'స్నేహితుడుగా అర్థిస్తున్నాను....మీనాక్షీ'

'ఏమిటి సూరీ ?'

'నన్ను ఎంత అదృష్టవంతుడినిచేశావు ... ఏదీ ఆమాట మరోసారి అను' అన్నాడు సూర్యనారాయణ.

మీనాక్షి నిట్టూర్చి 'అశోపహతురాల్ని - అదృష్టహీనురాల్ని - నామీద ఎందుకయ్యా నీ కింత ప్రేమ?' అన్నది.

'ఇది లోకసమ్మతంకాని యుగాంతరాల కింకటి అనుబంధం'

దైవసమ్మతం అయితే ఫరవాలేదు - అది మాత్రం అవునా అని నా సందేహం?'

'అది కాలం నిర్ణయించాలి.'

'నానుంచి నీవు పొందగలిగేది చాలా తక్కువ'

'అసలు పొందాలనికూడా అనుకోటంలేదు'

మీనాక్షి ఉలిక్కిపడి ఆగింది.

'ఆగావేం'? అన్నాడు సూర్యనారాయణ.

'ప్రతిఫలవాంఛలేని ప్రేమగాని త్యాగంగాని ఆట్టే రోజులు నిలువవని నాభయం'

'మీనాక్షీ!'

'ఏమిటి?'

'నీవు అంగీకరించవేమోఅని భయంగాని, ప్రతిఫల వాంఛ లేక కాదు' అన్నాడు మెల్లిగా సూర్యనారాయణ.

'పొరపాటు సూరీ! నిన్ను అర్థంచేసుకున్నానని భ్రమించాను... నడు' అన్నది మీనాక్షి.

ఇద్దరూ పార్కుగేటు దాటి, రోడ్డుమీదకి చేరారు. అటుపోయే ఒక రిక్షాని కేకేశాడు సూర్యనారాయణ - మొదలకుండా ఎక్కి అతనిపక్కన కూర్చున్నది మీనాక్షి.

'ఊళ్ళో బట్టలకొట్లదగ్గరికి పోనీ' అన్నాడు సూర్యనారాయణ. రిక్షాలో ఇరుక్కుని కూర్చున్న ఆ ఇద్దరికీ మాట్లాడుకోవటానికి విషయం ఏమీ కనిపించటంలేదు- ఎవరి దారిన వారు ఆలోచిస్తున్నారు.

స్త్రీఅంటే తెలియకపోవటంవలన సూర్యనారాయణకీ మగవాడంటే ఉన్న వెగటువలన మీనాక్షికీ వాంఛ ప్రకో

పించలేదుగాని, ఆ ఇరుకు-వాంఛని హెచ్చవేసే ఇరుకు - ఆ ఇరుకు నరాలని సాగలాగే ఇరుకు.

'సూరీ, ఇప్పుడు బట్టలకొట్టుకి దేనికి?'

'పనుంది' - సూర్యనారాయణ ముక్తసరిగా ఇచ్చిన ఈ సమాధానానికి మీనాక్షి మళ్ళీ ప్రశ్నించలేదు.

పదినిముషాల్లో బట్టలకొట్టుదగ్గర ఆగింది రిక్షా. ఇద్దరూ లోపలికి నడిచారు.

అందమైన రెండు సిల్కుచీరలు ఎంచి తీశాడు సూర్యనారాయణ. మీనాక్షి నిర్లిప్తంగా 'ఎందు కిప్పుడివి?' అన్నది

'స్వార్థం'

'అదేమిటి?'

'ఈ చిరుగుల్లోంచి నీ శరీరం ఇతర్లకి కనిపించటం ఇష్టంలేక'

మీనాక్షి నవ్వి సేల్సుమన్ చూడకుండా సూర్యనారాయణ చేతిని నొక్కింది - ఇందాకటినుంచీ రిక్షాలో ఇరుక్కుని కూర్చున్నప్పుడు చలించని శరీరం - ఇప్పుడు ఈ చిన్నస్పర్శకే పులకించిపోయింది సూర్యనారాయణకి. ఇందాకటి మీనాక్షిస్పర్శకీ ఇప్పటిస్పర్శకీసహస్రాంతం తేడా కనిపించింది. ఇందాక బాలుడు-ఇప్పుడుపురుషుడు. బిల్లుచెల్లించిఇద్దరూ బయటికివచ్చి రిక్షా ఎక్కారు. ఈ తడవ సూర్యనారాయణకి కూర్చోటం కుదరలేదు - అటూఇటూ మసలటంచూసి మీనాక్షి నవ్వి 'ఇరుకైందా సూరీ, ఇది చిన్నరిక్షాలాగుంది' అన్నది.

'రిక్షా చిన్నదికాదు, ఇందాకటికన్న శరీరం పొంగింది' అన్నాడు.

'ఎందుకని ?'

'ఎవరో అప్సరస తనస్పర్శచేత నన్ను ధన్యుడినిచేసింది - అందుకని'

మీనాక్షి నవ్వి అతనిబుగ్గమీద చిటిక వేసింది. ఆ చెయ్యిని తియ్యనీయకుండా తనచెంపకి అదిమిపట్టుకున్నాడు సూర్యనారాయణ. కొన్నిక్షణాలయినతరువాత -

'రిక్షావాడూ రోడ్డుమీదవాళ్ళూ చూస్తారు, ఇక వదులు' అన్నది మీనాక్షి.

సూర్యనారాయణ నవ్వి ఆమెచెయ్యి వదిలేశాడు.

ఇద్దరూ ఇంటిముందు ఒకేరిక్షాలోంచి దిగటం చూశాడు నటరాజన్. చివరకి ఈ ఇల్లు విచిత్రంగా తయారయింది అని తనలోతనే నవ్వుకున్నాడు.

'నమస్కారమండీ, ఎప్పుడు వచ్చారు ?' అని సూర్యనారాయణని పలకరించాడు. తన అక్క ఇంట్లో పడుతున్న అవస్తగాని, తాయారుకీ ఆమెకీ పడనివిషయంగాని - నటరాజన్‌కి ఏమీ తెలియదు.

అతని కీమధ్య ఆరోగ్యంకూడా సరిగా ఉండటంలేదు - అయినా అతనిలో ఉరకలువేస్తున్న ఆలోచనలు వాక్యరూపంలో పెట్టటానికి - కావల్సినశక్తిని ఇంకా అతడు పోగొట్టుకోలేదు.

'నీతి - అవినీతులు' తరవాత అతను మరోనవల వ్రాస్తున్నాడు. ఆ నవల పేరు 'అపశ్రుతులు'. తనచుట్టుపక్కల

జరిగే విషయాలూ, తమసికృష్టజీవితపు కోణాలూ ఆ నవలలో అతిసామాన్యమైనభాషలో చిత్రిస్తున్నాడు నటరాజన్. ఆనవల ఒకరకమైన బ్రతుకిక్ ఎన్‌లార్జిమెంట్. అతను చెప్పదల్చుకున్నది మెలికలుతిప్పకుండా సూటిగా చెప్పటమే అతనిప్రత్యేకత కాని, అతని జీవితంమాత్రం వంకరదారులలో ఇరుక్కుని మార్గం తప్పిపోయింది.

తాయారుసాంగత్యంలో అతను ఏమాత్రం సుఖపడటంలేదు - అయినా, ఆవిషయం ఆమెతో చెప్పకుండాసహించటమే అతనిపని. ఆ కష్టంలో ఆత్మత్యాగం చేస్తున్నాననే తృప్తి అతనికి ఉండిఉండవచ్చును - ఆ విషయం అతను తెరిచి చూసుకోనూలేదు.

తాయారు అతిసహజమైన వాంఛలుగల ఆడది. ఆమె తల్లి- ఆమె స్త్రీ. ఆ రెండుఅనురాగాల్ని పరిపూర్ణంగా అనుభవించాలని చూస్తుంది ఆమె.

ఆకలివేసినప్పుడు అన్నం కావాలి. వాంఛ ప్రకోపించినప్పుడు శారీరికమైన తృప్తి కావాలి. అన్నగారింట్లో తను ఉండి, నటరాజన్ వచ్చిపోతున్నప్పుడు ఈ రెండు సుఖాలూ అతను ఇవ్వగలిగాడు. ఇప్పుడు పూర్తిగా అతనిమీదే ఆధారపడినప్పుడు ఈ రెండుసుఖాలూ అతను ఇవ్వలేకపోతున్నాడు. ఈ రెండూ కావాలనికోరటం ఆమె తప్పు కూడా కాదు.

ఏ స్త్రీఅయినా పురుషుడినుంచి కోరేవి ఆ రెండు సుఖాలే. అవే అతను ఇవ్వలేనిస్థితిలో ఉన్నప్పుడు ఆమె అసహ్యించుకుంటుంది. అయితే, ఇందులో ఇంకోచిత్రం -

అదేమిటంటే, నాగరికురాల్ని అనుకుంటున్న స్త్రీ ఆ విష యం బయటపెట్టదు.

తాయారు అంతనాగరికురాలుకాదు. అందుకే బయట పడింది. నటరాజన్ ఈ పద్ధతిలో ఆలోచించి తన అసమర్థతని అంగీకరించి, తాయారుపోకడల్ని సహించటం నేర్చు కున్నాడు.

మీనాక్షి స్త్రీ అవటంవలన ఆవిధంగా ఆలోచించ లేకపోవటం కారణంగా తాయారునీచతని అసహ్యించుకోటం ప్రారంభించింది. ఈమెకోసం తనతమ్ముడు ఎంతో త్యాగం చేశాడు - ఆమె ఆ త్యాగాన్ని అర్థంచేసుకోలేదు సరిగదా, ఇంకా హింసించాలని ప్రయత్నిస్తున్నది.

ఛీ - ఛీ! స్త్రీ! నీ కిక విముక్తిలేదు - అనుకున్నది మీనాక్షి. తను సూర్యనారాయణకి ఎంతో కృతజ్ఞురాలు. అతనిరుణం ఏనాటికీ తీర్చుకోలేదు. తనకోసం సూర్యనారా యణచేసిన త్యాగంకన్న నటరాజన్ తాయారుకోసం చేసిన త్యాగం అపూర్వమైనది. ఇక్కడ ఇంకో ఆశ్చర్యంఉన్నది. నటరాజన్ తాయారుని ప్రేమించటంలేదు - అతనిప్రేమ- అతని ఆరాధన అన్నీ నందితవి. నందిత తలపుతోనే పులకలు రేగుతయి - నందితవలపుతోనే ఆవేశం పెరుగుతుంది - మరి ఈ తాయారుకోసం ఇలా సౌఖ్యాన్నీ ఆరోగ్యాన్నీ నటరా జన్ ఎందుకు నాశనంచేసుకోవాలి?

మీనాక్షికి అది ఇష్టంలేదు. తనసోదరుడు నందితని ప్రేమిస్తూ ఆమెను దూరంచేసుకోటానికి కారణంకూడా ఆమెకు అర్థంకాలేదు. నీచురాలైన తాయారు తనతమ్ముడిని

దేహసౌఖ్యంకోసం పెట్టే బాధకూడా ఆ గదిలోనే గోనె పట్టాకి అవతల నిదురిస్తున్న మీనాక్షి కనిపెట్టేసింది.

అనారోగ్యంతోనూ, అతిచాకిరీతోనూ అలసిపోయిన అతనిశరీరంలో వాంఛ - శక్తి నశించినై. ఆ విషయం తాయారుకి అవసరంలేదు. విధిగా ఆహారం ఎలాతీసుకుం టారో - విధిగా వాంఛా పరితృప్తికూడా అలాగే కావాలను కొనే అతిబాత్యులు కొందరుంటారు. తాయారు అలాంటిది.

ఏదిఏమయినా మీనాక్షికి తాయారుఅంటే అసహ్యం. దానికి ఇంకోకారణంకూడా ఉన్నది - ఆ ఇంటికి తను యజమానురాలైనట్లూ - గతిలేక మీనాక్షి ఆ ఇంటికి కూటికి చేరినట్లూ తాయారు ప్రవర్తించేది.

మీనాక్షి చాలా అభిమానవతి- ఆప్రవర్తన సహించలేకపోయింది.

తాయారు అలా ప్రవర్తించటానికి మరోకారణం ఉంది - వరదరాజులికి మీనాక్షి అంటే మోజున్నట్లు తాయారు గ్రహించింది. మొగుడినివదిలి లేచివచ్చిన మీనాక్షి పాతివ్రత్యం వెలగబెట్టటం తాయారుకి నచ్చలేదు. వేడినీళ్ళకి చన్నీళ్ళు తోడుగా ఆడదికూడా ఎందుకు సంపాదించకూడదు? అనే తత్వం తాయారుది - అంతేకాదు. ఆడది సంపాదించాలంటే ఇంకోదారిమాత్రం ఏముంది!

వరదరాజులుకి మీనాక్షిఅంటే ఒకవిధమైన అభిమానం; మరోవిధమైన ఆకర్షణ ఉన్నాయి. అభిమానంలోగాని,ఆ ఆకర్షణలోగాని ఆమెని అవమానిద్దామనే ఊహ ఏకోశానా లేదు.

కనీసం తనమనసులో ఆమెఅంటే ఉన్న ఆరాధనని ఏనాడూ బయటపెట్టలేదు అతను. అయితేనేం? ఇలాటివిషయాల్లో అనుభవజ్ఞురాలైన తాయారు అది గ్రహించేసింది. అందులో వరదరాజులు ఆమెకి అతిపరిచయుడు.

మీనాక్షి అతనికి అభిముఖురాలెందుకు కాకూడదూ అని తాయారుకి కోపం. పోనీ అలాఅని మీనాక్షికి చెప్పే ధైర్యమూలేదు - కాగా చిరాకు ఎక్కువై, అశాంతిగా ప్రవర్తించటం ప్రారంభించింది తాయారు. ఇప్పుడు మీనాక్షి సూర్యనారాయణా ఒకరిక్షాలో దిగటం చూసి, తాయారు ముఖంచిట్లించుకుంది. అదిచూసిన మీనాక్షి మొగం చిన్నపుచ్చుకుంది. సూర్యనారాయణా నటరాజన్ ఆ విషయం అసలు గమనించనేలేదు.

'నేను మధ్యాహ్నమే వచ్చాను' అని నటరాజన్‌కి సమాధానంచెప్పి - భయపడుతూ భయపడుతూ ఆ నులకమంచంమీద కూర్చున్నాడు సూర్యనారాయణ.

నటరాజన్ అదిచూచి నవ్వి 'భయం వేస్తోందా?' అన్నాడు.

సూర్యనారాయణ సిగ్గుపడి 'అదేం లేదండీ' అని అర్థంలేని సమాధానంఇచ్చాడు. మీనాక్షి లోపలికి వెళ్ళింది. అంటే గోనెపట్టాఅవతలకి. కొన్నినిముషాలు ఇద్దరూ మాట్లాడలేదు. చివరకి సూర్యనారాయణే 'ఊవూళ్లో చదువుదామని ఉన్నది ఒక మంచిఇల్లు ఉంటే చూసిపెట్టండి' అన్నాడు. నటరాజన్ కొన్నిక్షణాలు ఊరుకొని

'మీ అమ్మగారుకూడా వస్తారా?' అని ప్రశ్నించాడు.

'బహుశా అమ్మ రాదు... మీనాక్షిని తీసుకువెడదా మనుకుంటున్నాను' అన్నాడు సూర్యనారాయణ ధైర్యంచేసి.

నటరాజన్ సమాధానంచెప్పలేదు.

'ఏం ? మీకు అభ్యంతరమా ?'

'ఆమెకు ఇష్టమయితే... మధ్య నాకేం అభ్యంతరం?' అన్నాడు నటరాజన్ కళ్ళు తెరవకుండానే... కాని లోలోపల అతను చాలా చిన్నపుచ్చుకున్నాడు. తాయారుకోసం తను వెడుతున్నప్పుడు- తెలిసినాకూడా ఆమె అన్న ఎందుకు చిరాకు పడ్డాడో ఇప్పు డతనికి అర్థమయినట్లనిపించింది - తల్లీ - కూతురూ - సోదరీ తప్పుచేస్తుంటే చూసి సహించే మనస్తత్వం మనదేశంలో ఇంకా లేదు. అథవా పరిస్థితులవల్ల తలవంచుకున్నా గాని, అంతర్గతంగా యమయాతన అనుభవిస్తాడు మగవాడు.

కళ్ళు మరింత గట్టిగామూసుకుని - 'మేము శాప గ్రస్తులం. మా కిక విముక్తిలేదు' అనుకున్నాడు. నటరాజన్ అవ్యక్తమైన వేదన ఏదో అతనిగుండెలలో సమ్మెటవేయటం ప్రారంభించింది. ఏది జరగాలని విధి నిర్దేశించిందో, అదే జరగనీ - అనుకుని ఒత్తిగిలిపడుకున్నాడు నటరాజన్.

# 11

ఎవరికోసమైనా ఏ కొన్నిక్షణాలయినా ఆగుతుందేమో ఈ కాలం అనిపిస్తుం దప్పుడప్పుడు. కాని అలాటిదేమీ కని పించదు - దానిదారిన అది నిరంతరం ప్రవహిస్తూ పోతునే ఉంటుంది- ఆ వేగంలో అల్పజీవిఅయిన మానవుడు కొట్టుకు

పోతూ - నిన్న పరమసత్యాలుగా కనిపించిన కొన్నివిష యాలు నేడు పచ్చిఅబద్ధాలుగా మారటం చూసి, విస్తుపోతూ ఉంటాడు.

ఆ షాక్ నించి అతను తేరుకోకమునుపే అసత్యంగా మారిన మొదటిసత్యం - తిరిగి కొద్ది మార్పులతో పూర్వ రూపాన్ని పొందుతుంది. ఇందులో ఏది సత్యం?- ఏది కాదు? ఇక ఆలోచించటానికి కూడా భయపడిపోతాడు మనిషి - స్తబ్దుడుగా తయారయి ఆ ప్రవాహం ఎటుప్రవహిస్తే అటు కొట్టుకుపోతూ శేషజీవితాన్ని గడిపివేస్తాడు.

ఇదీ నడుస్తున్న చరిత్ర.

సూర్యనారాయణ విజయవాడలో ఎందుకు చదువు కుంటానంటున్నాడో కనకాంగికి తెలిసినా, వివిధమైన అభ్యంతరమూ చెప్పలేదు. మొదలకుండా కావాల్సినడబ్బు పంపిస్తున్నది. గవర్నరుపేటలో పాతికరూపాయలకి చిన్న భాగం తీసుకుని కాపురంపెట్టారు మీనాక్షీ సూర్యనారా యణా. ఆ ఇంటికిఉన్న మరోవాటాలో తాలూకాఫీసు గుమాస్తా ఒకాయన భార్యాసహితంగా ఉంటున్నాడు. సూర్యనారాయణ కాలేజీకీ, గుమాస్తాగారు ఆఫీసుకీ వెళ్ళ గానే ఇద్దరాడవాళ్ళూ ఒకచోట చేరి, కబుర్లుచెప్పుకుంటూ ఉండేవారు.

మధ్యతరగతిస్త్రీకి చెప్పుకోటానికి ఉన్న పెద్దవిషయం భర్తకావటంవలన సామాన్యంగా ఆ విషయంమీదే జరిగేది వాళ్ళిద్దరిసంభాషణా. ఈవిధమైన జీవితం స్వర్గతుల్యంగాఉంది మీనాక్షికి.

ఇలా సంసార్లమధ్య ఉంటూ, వేళకి తిండితింటూ ఇష్టమయిన మగవాడికి వండిపెడుతూ బ్రతకటంకన్న స్త్రీకి మరేంకావాలి కనుక – ఈవిధమైన మాధురీమత్తతతో మరో ఆరునెలు గడిచిపోయినయ్.

సూర్యనారాయణ ఇదివరకు చూసినది చాలా చిన్న లోకం – ఆ లోకంకన్న విశాలమైన – నాగరికమైన మరో లోకంలోకి అత నిప్పుడు ప్రవేశించాడు. ఆ లోకం అతనికి పంచరంగుల జలయంత్రంకన్న సుందరంగా కనిపించటం ప్రారంభించింది.

బలంగా ఆరోగ్యంగా ఉత్సాహంగాఉండే ఈ యువకుడు కాలేజీవాతావరణంలో ప్రముఖపాత్రే సంపాదించుకున్నాడు, అందులో ముఖ్యంగా క్రిష్ణహారిదృష్టిలో.

ఆ కాలేజీలో క్రిష్ణహారి – రాక్షహారి అని అందగత్తెలైన అప్పచెల్లెళ్లు- కాలేజీయువలోకాన్ని ఉర్రూతలూగించే వయ్యారులు ఇద్దరు ఉన్నారు. సామాన్యంగా వారు చదవరు – ఎవరిదగ్గరో ఒకరిదగ్గర నోట్సుతీసుకుని కాలం గడిపేస్తూఉంటారు.

ఈ నోట్సువల్లనే క్రిష్ణహారి సూర్యనారాయణ సన్నిహితులైనారు. త్వరలోనే వారిస్నేహం అభివృద్ధిచెంది, నీవు అంటే నీవు అనుకునేదాకా వచ్చింది.

ఒకతడవ నోట్సుకోసం అనే వంకతో అనుకోకుండా సూర్యనారాయణఇంటికి వచ్చింది క్రిష్ణహారి.

సూర్యనారాయణ తెల్లబోయి 'మా ఇల్లు ఎవరు చెప్పారు ?' అని ప్రశ్నించాడు. ఆమె తనఇంటికి రావటమూ–

మీనాక్షిని చూడటమూ అతనికి సుతలామూ ఇష్టంలేదు. మీనాక్షి ఎవరని అడిగితే ఏంచెప్పాలి? ఇప్పుడు అనుకోకుండా క్రిష్ణహరి సరాసరి తనఇంటికే వచ్చేసింది. క్రిష్ణహరిమీదకన్న మీనాక్షిమీద చిరాకు ప్రారంభమయింది సూర్యనారాయణకి. కాలం పకపకనవ్వింది.

మీనాక్షి లేచి మూలనున్న చాప పరచింది. కాసేపు కూర్చుని నోట్సుతీసుకుని వెళ్ళిపోయింది క్రిష్ణహరి. కాని, ఆ మరునాటినుంచీ మాట్లాడటం మానివేసింది.

క్రిష్ణ తనతో మాట్లాడకపోవటంవలన ఎంతో వంటరితనం అనుభవిస్తున్నట్లుగా ఉంది సూర్యనారాయణకి. అంతరాంతరాల్లో ఏమూలో దీనికంతటికీ కారణం మీనాక్షిఅని కూడా అనిపించటం ప్రారంభమయింది.

ఒకరోజు సాయంత్రం రిక్షాలో ఎదురొచ్చిన క్రిష్ణహరిని ఆపి 'నీవు నామీద కోపగించుకోవల్సినంత తప్పు నేనేంచేశాను ?' అని సూటిగా అడిగేశాడు సూర్యనారాయణ, క్రిష్ణ ఉన్మత్త కాళికగా మారి.

'నీకు సిగ్గూ అభిమానమూ ఉంటే, నీ మొహం నాకు చూపించకు' అని అరచి జేబురుమాల అడ్డుపెట్టుకుని దుఃఖిస్తూ వెళ్ళిపోయింది. మరో ప్రశ్న వేయటానికి ఏ కొంచెం అవకాశం ఇవ్వలేదు.

సూర్యనారాయణకి మతిపోయింది - త నేంచేశాడు! తనుచేసిన తప్పేమిటి? క్రిష్ణకి ఇంత అసహ్యంకలిగించేపని త. నేంచేశాడు! కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వెళ్ళి మంచంమీద పడి నిద్రపోయినాడు అతను.

ఈరోజు ట్యుటోరియల్ కాలేజీలో చేరటానికి ఆరణి వచ్చేరోజు. అతనికోసం రైలుస్టేషన్‌కి వెళ్ళాలన్నసంగతికూడ మర్చిపోయి నిద్రపోయిన సూర్యనారాయణకిఆరణికంఠస్వరం వినగానే మెలకువవచ్చింది.

'ఏమోయ్ స్టేషనుకి వస్తావనుకున్నాను. ఇల్లు తెలుసుకునేసరికి అవస్థయింది' అన్నాడు ఆరణి సూర్యనారాయణ పక్కలో కూర్చుంటూ.

'వద్దామనే అనుకున్నాను. నిద్రపట్టేసింది' అని ఒళ్లు విరుచుకుంటూ సమాధానమిచ్చి దొడ్లోకి నడిచాడు సూర్యనారాయణ.

మీనాక్షిఇచ్చిన కాఫీ తీసుకుంటూ - వాతావరణం ఇలాఉందేమిటన్నట్లు ప్రశ్నార్థకంగా ఆమెవంక చూశాడు. ఆరణి.

మీనాక్షి నిర్లిప్తంగా నవ్వి 'అది అంతే' అన్నది.

'అంటే?'

'కొన్నాళ్ళకి కొత్తదనం కావాలనిపిస్తుంది'

'నాకు బోధపడలేదు'

'మెల్లిగా బోధపడుతుంది, తొందరేముంది'

అని కాఫీగ్లాసు తీసుకుని వెళ్ళిపోయింది మీనాక్షి, ఆమె వెళ్లిన వెంటనే రాధహరి ఆ గదిలో అడుగుపెట్టింది.

ఆరణికి ధిక్కుతోచలేదు. అక్కడ సూర్యనారాయణ గాని మీనాక్షిగాని ఎవరూ లేరు - ఈ అమ్మాయి యెవరో నిర్భయంగా వచ్చేసింది. ఒక్కఉదుటున లేచి నిలబడ్డాడు.

అది చూసిన రాధ ఖంగారుపడిపోయింది. ఈ కొత్త అబ్బాయి చేస్తున్న భరతనాట్యం దేనికో ఆమె అర్థంచేసుకోలేకపోయింది. ఇంతలోకే టవల్‌తో ముఖంతుడుచుకుంటూ ఆ గదిలో ప్రవేశించిన సూర్యనారాయణ రాధహారినిచూసి తెల్లబోయినాడు. రాధకి చిరాకేసి,

'ఏమిటండీ మీ ఇంటికొస్తే అందరూ ఇలా ఖంగారుపడతారు! ఆయనెవరో అభినయంపట్టేస్తున్నారు ఇందాకటినుంచీ - మీరేమో తెల్లబోయి కూర్చోమనయినా అనరు' అన్నది.

ఆరణి సిగ్గుపడి అక్కడినుంచి వంటింట్లోకివెళ్ళిపోయినాడు. సూర్యనారాయణ ముభావంగా రాధని కూర్చోమన్నాడు - రాధ కూర్చుని,

'మీరూ క్రిష్ణా ఏమయినాపోట్లాడుకున్నారా?' అన్నది.

సూర్యనారాయణ ఆశ్చర్యపోతూ - 'మీ కెలా తెలిసింది?' అన్నాడు.

'నిన్నటినుంచీ రాధ ఒకటే ఏడుపు. ఎందుకని అడిగితే సమాధానం చెప్పదు. బహుశా మీరిద్దరూ పోట్లాడుకుని ఉంటారని నేనే ఊహించాను'

'పెద్ద పోట్లాటఏమీలేదు - మొన్న మా ఇంటికి వచ్చినప్పటినుంచీ అలాగేఉంది' అని సమాధానం ఇచ్చాడు అతను. కొన్నిక్షణాలు ఇద్దరూ మాట్లాడలేదు.

'ఏదో ఉంది సూర్యంగారూ - మరి నేను వస్తాను' అని రాధహారి వెళ్ళిపోయింది. ఆమెవెళ్ళగానే పిల్లిలా అడుగులువేసుకుంటూ ఆరణి లోపలికి వచ్చాడు.

సూర్యనారాయణ పకపకా నవ్వి 'ఎందుకోయ్ అంత భయం?' అన్నాడు.

'ఈ ఇంటికి ఆడపిల్లలూ వాళ్లూ వస్తూఉంటారేమిటి?' అని బిక్కమొగంతో అడిగాడు ఆరణి'

'ఇదివరకు లేదు - ఇప్పుడే ప్రవేశిస్తున్నారు' అని నిట్టూర్చాడు సూర్యనారాయణ. తనేదో తప్పుచేస్తున్నట్లు అని పించింది అతనికి. ఆ తప్పుతాలూకు సమగ్రస్వరూపం అతనికి అర్థంకాలేదు. ఒకప్పుడంతే, మనంపాడుతున్నగీతంలో అప శ్రుతి ధ్వనిస్తుంది కాని - ఆ శిథిల శకలాన్ని పట్టుకోలేక పోతాం. అనుకున్నాడు తను.

ఆ మరునాడు రాధహారి కనిపించింది - సూర్యనారా యణని చూసి నవ్వి 'క్లిష్టబాధ ఏమిటో తెలుసా సూర్యం గారూ, మీరు పెళ్ళిచేసుకున్నట్లు ఆమెతో చెప్పలేదుట - అదీ దానికోపం' అన్నది.

సూర్యనారాయణ ఎంతో బరువుదిగిపోయినట్లు ఫీల వుతూ 'ఆమె నా భార్య కాదు' అన్నాడు. అన్నవెంటనే తనెంత పొరపాటుచేశాడో గ్రహించి, అంతరాంతరాల్లో వణికిపోవటం ఆరంభించాడు.

'కాదూ!' అని ఆశ్చర్యంతో రాధహారి అన్న మాటల్ని అతను వినిపించుకోకుండానే అక్కడినుంచి పారి పోయివచ్చి, మంచంమీద బోర్లాపడిపోయి దిండులో మొగం దాచుకుని ఏడ్వనారంభించాడు. కొన్నాళ్ళనించీ సూర్యనారా యణ పడుతున్న ఈ వ్యథని మీనాక్షి చూస్తూనేఉంది. తను అతనిసుఖాలకి అడ్డువస్తున్నానేమో అనే ఊహ అడుగున

వున్నాగాని - కొన్నాళ్ళయినా సుఖద్దామనే స్వార్థం ఆమెను విడిచిపెట్టటంలేదు. అందుకే గమనించనట్లు నటించింది. కాని ఇలాచేయడానికి ఇక వీలులేదు.

మెల్లిగా వెళ్ళి సూర్యనారాయణతల నిమురుతూ 'సూరీ...ఎందు కేడుస్తున్నావు?' అని అడిగింది.

ఏమని సమాధానం ఇవ్వాలి ఆ ప్రశ్నకి - నీ మూలంగానే అని చెప్పాలా? మీనాక్షికి తను చేస్తున్న ద్రోహం ఇప్పటికే చాలు.

'ఏంలేదు మీనాక్షీ...తలనెప్పిగా ఉంది' అన్నాడు చివరకి.

మీనాక్షి నవ్వి 'తలనొప్పికి మగవాళ్ళేడుస్తారా ఎక్కడయినా?' అన్నది.

సూర్యనారాయణ తలపైకెత్తి 'మరి మగవాళ్ళు దేనికి ఏడుస్తారేమిటి?' అన్నాడు.

'సంఘర్షణ ప్రారంభమయినప్పుడు'

'అంటే?'

'ఇటో అటో తేల్చుకోలేనప్పుడు'

'నాకేం అర్థంకావటంలేదు'

'సూరీ, నాదగ్గర దేనికి దాస్తావు? ఏంజరిగిందో చెప్పు' అని లాలనగా అడిగింది మీనాక్షి.

సూర్యనారాయణ మాట్లాడలేదు - ఏం చెప్పాలి? ఏమని చెప్పాలి?

మీనాక్షి కొంచెంసేపు అతని సమాధానానికి ఎదురుచూసి, చివరకి నిట్టూరుస్తూ వెళ్ళి పనిచూచుకోవటం ప్రారం

భించింది. సూర్యనారాయణమనసులో ఆలోచనలు సుడితిర గటం ప్రారంభించాయి.

మనసులూ మమతలూ ఇంత అస్థిరమని అతను ఇది వరకు అనుకోలేదు. నిన్న మనం సత్యంఅని నమ్మినవిషయం ఈనాడు అసత్యంగా మారటం చూసి, అతని పసిమనసు భరించిలేకపోయింది. ఎంత చిత్రమూ అద్భుతమూ అయింది మనిషిమనసు! - అనుకున్నా డతను.

వెల్లకిలపడుకుని దూలంవంకచూశాడు- రెండుబల్లులు ఒకదాన్ని ఒకటి తరుముకుంటూ పరిగెత్తినాయి. అవి ఎంత ఆధారరహితంగా ఆదూలాన్నిపట్టుకు పరుగెత్తుతున్న య్యో- అలాగే అర్థరహితంగా మనిషి కాలాన్నిపట్టుకుని పరుగెత్తు తున్నాడు. ఈపరుగుకు అంతంగాని గమ్యస్థానంగానిఉన్నదా? అసలీ జీవితానికి అర్థంఏమిటి? ఈ రాగానికీ ఈ అను రాగానికీ మూలం ఎక్కడ? ఈ ఆకర్షణవలన ఏ ప్రయోజనం ఆశించి సృష్టికర్త దీన్ని సృష్టించాడు? ఈ వ్యథలో ఇంత మాధుర్యాన్ని దేనికి ఇమిడేటట్లుచేశాడు? అతనిలో అన్నీ ప్రశ్నలే- కొన్నిక్షణాల్లో నిద్రపోయినా డతను.

## 12

'మై డియర్ నందితా!

మీ ఉత్తరం అందింది - నామీద మీకున్న అభి మానానికి చాలా సంతోషం. కాని, ఒక్కమాట; అధ ర్మంలో అశాంతి ఇమిడేటట్లుచేసింది మనసంఘం. ఆ అశాం తికి భయపడే అధర్మంచేయడానికి జంకుతాడు మనిషి.

అయినా వీటన్నిటినీమించిన స్వయంసహాయం కొందరికి ఉంటుంది - ముందు వాళ్ళు సాహసిస్తారు - ఆ సాహసం వలన ఏ ఫలితం లభించినా వారి కొక్కటే - ఫలితం మీద వారిదృష్టి ఉండదు - మీరు అలాటివారు నందితగారూ. కాని నేను పిరికివాడిని. అందుకే మీరు దయతో ఇస్తానన్న ఆశ్రయాన్ని స్వీకరించేందుకు నా చేతులు వణుకుతున్నయ్.

అయితే, నా జీవితాంతమూ నన్ను అనుక్షణమూ పులకింపచేసే విషయం ఒకటి ఉన్నది - అది మీ తలపు.

ఆ తలపే చాలు... వలపు కావాలని నేను అనుకోటం లేదు. ఎందుకంటే, ఆ వలపుబరువుని భరించే శక్తి నా మనసుకీ శరీరానికీకూడా లేదు - ఆ మహావరాన్ని నేను అరిగించుకోలేను.

అప్పుడప్పుడు ఇలాంటివి కథల్లో చదువుతూఉంటాం- ఒక దేవకన్యగాని ఒక కిన్నెరరాణిగాని మనిషినో గాడిదనో ప్రేమించిందని... లేకపోతే నా కింత అదృష్టమేమిటి?... మీ రెక్కడ... నే నెక్కడ?

ప్రేమకీ అనురాగానికీ అర్థంలేదు - నావలన మీరు ఏమీ పొందలేరని తెలిసికూడా మీరు నన్ను దేనికి అభిమానిస్తున్నారో అర్థంకావటంలేదు...నా దగ్గర అలాగేఉంది ఈ ప్రపంచంనుంచి సెలవుతీసుకోటమే తప్పనిసరయితే - ఆ పని మీ సమక్షంలోనే చేస్తాను.

కాని ఆ అవసరం రాదనుకుంటాను - మీరు డాక్టరయినతరువాత నాకు చికిత్సచేయవచ్చును - అందాకా ఫరవాలేదు... ... ...నటరాజన్"

తను వ్రాసిన ఈ ఉత్తరం మరోసారి చదువుకుని నిట్టూర్చాడు నటరాజన్.

అతడికి ఇటీవల సునిశితమైన ప్రేమదాహం పట్టుకుంది. దానిలో కొంత ఆవేదనా వియోగమూ లేకపోతే అందంలే దనే భ్రమకూడా ఏర్పడింది.

జలరాశిలో కలిసిపోతానేమో అని అనుమానిస్తూ దోమలతో - మురికితో - ఆవేదనతో నిండిన ఈ జీవితం కూడా ఎంతో గంభీరమైనదీ క్లిష్టమయినదీ అని తననుతానే నమ్మించుకుంటూ జీవిస్తూరావటం అలవాటయిం దతనికి.

జీవితాన్ని గౌరవించలేకపోతే దానినుంచి పొందగలి గిందేమీలేదని అతను నిర్ణయించుకున్నాడు. అసహ్యకర మైనదయినా రోగిష్టిదయినా - పతితమయినా జీవితం దేవత లాటిది... దానిని ఆరాధించాలి - అసహ్యించుకోకూడదు-ఇదీ అతనిసిద్ధాంతం. నందితవ్రాసినఉత్తరం ఎప్పుడూ అతని జేబు లోనే ఉంటుంది - ఆ ఉత్తరంలోఉన్న ప్రతి అక్షరమూ ప్రతివాక్యమూ అతనికి అపరిమితమైన సంతృప్తిని ఇస్తు న్నాయ్. ఉత్తరంవ్రాసి అలసిపోయిన నటరాజన్ నులక కుక్కిలో జారబడ్డాడు.

ఇటీవల అతనిఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఏపనీ చేయలేనిస్థితికి క్రమంగా అతను దిగజారాడు. టిజుయా నాలో నైట్‌డ్యూటీలు చెయ్యటంలే దిప్పుడు. పగలే పనిచేస్తు న్నాడు. ఇప్పుడిప్పుడు అదీ కష్టమే అయిపోతోంది.

రాత్రిళ్ళు దగ్గు ఊపిరాడనియ్యటంలేదు - నులక మంచంలో పడుకున్న నటరాజన్‌కి వెంటనే దగ్గుతెరవచ్చింది- దగ్గిదగ్గి,

'తాయూరూ' అని నీరసంగా పిలిచాడు. తాయూరు ఇవతలకి వచ్చింది. ఆమెకళ్ళు ఎర్రగా ఉన్నాయ్. ఆమె తనకోసం దుఃఖిస్తోందన్నమాట - నటరాజన్ తనలోతనే నవ్వుకుని,

'కాసిని మంచినీళ్ళియ్యి' అన్నాడు. తాయూరు ఇచ్చిన మంచినీళ్లు త్రాగి,

'వరదరాజులు వస్తానన్నాడు. కాసిని, టీనీళ్ళు పడెయ్యి' అని ఒత్తిగిలి పడుకున్నాడు నటరాజన్.

ఇంతసేపూ తాయూరు ఒక్కమాట మాట్లాడలేదు. ఇందాకటినుంచీ అతనుపడుతున్న అవస్త చూస్తూనేఉంది తను. తనమొగాన అదృష్టంలేదు - తనకి ఆధారంగా ఉండే మగవాడు ఇన్నిఅవస్తలుపడతాడేమిటి? ఆమె కళ్ళుతుడుచుకుని టీనీళ్లు పొయ్యిమీద పడేసి విసురుతూ కూర్చుంది.

వరదరాజులు ఆ టీనీళ్లు సగం మరిగిపోయిన తరువాత గానిరాలేదు. అతని అడుగులచప్పుడుకి కళ్ళుతెరిచిన నటరాజన్ ఓపిక తెచ్చుకుని లేచికూర్చుని, ఆ నులకమంచంలో మరోవైపు వరదరాజుల్ని కూర్చోపెట్టాడు.

బంగారపు కేసులోంచి ఖరీదయిన సిగరెట్టు వెలిగించిన వరదరాజులు- తాయూరుచేతి నీళ్ళటీకూడా సేవించాడు. గ్లాసు తీసుకువెడుతున్నతాయూరుని నిదానించి చూసి,

'తయారు చిక్కిపోయింది పంతులూ' అన్నాడు. నటరాజన్ నవ్వి 'సరిగ్గా తిండికూడా పెట్టలేకపోతున్నాను నేను. చూస్తున్నారుగా పరిస్థితి' అని సమాధానం చెప్పాడు.

'నేను వెళ్లి ఆ పబ్లిషర్‌తో మాట్లాడాను. నీ కథలూ నవలలకీ కలిపి నాలుగువందలిస్తానన్నాడు'

'అన్యాయం'

'కావచ్చును... కాని, ఆమాత్రం ఇచ్చేవాళ్ళుకూడా మరెవరూ లేరుగా'

'ఏంచేయమంటారు మరి?'

'ఇవ్వు... ఇచ్చి ఆ డబ్బుపెట్టి మందుపుచ్చుకో, అన్యాయంగా చచ్చిపోతావు' అని సిగరెట్‌నుసి మంచం కింద రాల్చాడు వరదరాజులు.

నటరాజన్ మాట్లాడలేదు ... గోనెపట్టా అవతల నుంచి వెక్కుతున్నధ్వని వినిపించింది - అది ఏడుపు అణచుకోటానికి చేస్తున్న వ్యర్థప్రయత్నం - యుగయుగాలుగా జంటని పోగొట్టుకుంటున్నప్పుడు ఆడప్రాణి చేస్తున్న ఆర్తనాదం.

'అదేమిటి?' అన్నాడు ఉలిక్కిపడి వరదరాజులు.

'ఏమీలేదు, తాయారు ఏడుస్తున్నట్లుంది'

'ఎందుకు?'

'స్త్రీ ఎప్పుడెప్పుడు - ఎందుకెందుకు - యెలాయెలా ఏడుస్తుందో ఎవరు చెప్పగలరు?' అని నవ్వాడు నటరాజన్.

'చస్తుంటేకూడా కవిత్వమే మాట్లాడతారయ్యా మీ కవులు' అని నటరాజన్‌పై విసుక్కుని... 'తాయారూ' అని పిలిచాడు వరదరాజులు.

తాయారు ఇవతలికి వచ్చింది. వరదరాజులు ఆమెని పరీక్షగా చూశాడు. ఆమె మనసుతోనూ శరీరంతోనూ కూడా అతనికి పరిచయముఉన్నది. ఈ తాయారు మగప్రాణిని రెచ్చగొట్టి కవ్వించి అలసట తెప్పించి - చివరకి వాడి చేతిలో చావుదెబ్బలు తినందే లొంగనిస్త్రీ.

మానవుడిలో అంతర్గతంగాఉన్న జంతువుకి ఆ స్త్రీ అమితమైన తృప్తినిస్తుంది - అతను ఎంత జంతువైతే... ఆమెనుంచి అంత సుఖం పొందుతాడు. అంత ఆనందాన్ని అనుభవిస్తాడు.

మనసులూ మమతలూ ఆమెకి తెలియవు - ఆమెకి తెలిసిందీ అర్థమయ్యేదీ ఒక్కటే - అది ప్రగాఢమైన శరీర వాంఛ- జీవితంఅంటే తినటం నిద్రపోవటం అనుభవించటం- అంతే... అంతకుమించి మరేమీ లేదు-ఉందనుకోటం భ్రమ - వాటిని పొందటానికే ఆమె ప్రయత్నిస్తుంది.

మొదట్లో భ్రమించినా - ఊహాలోకంలో విహరిస్తూ దేహవాంఛకి ప్రాధాన్యం ఇవ్వని నటరాజన్‌కన్న - తోడేలులా తనని ఆక్రమించుకునే వరదరాజులే ఆమెదృష్టిలో మనిషి.

కాని ఆమెఅంతరాంతరాల్లో ఉండే ఏదో విచిత్రమైన పిపాస నటరాజన్ వైపు మొగ్గేట్లుచేసింది. ఇదమిత్థమని ఆమెకీ

తెలియదు – కాని బలమైన దేహవాంఛలముందు ఆ పిపాస చప్పగా చల్లారిపోయింది. ఇప్పుడు ఆమెకి కావల్సింది తనను భరించగలిగినమగవాడు మాత్రమే.

వరదరాజులు పిలుపుకి ఇవతలకి వచ్చి నిలుచున్న తాయారులో ఆ క్షణం తళుక్కుమన్న ఊహ అదే.

'తాయారూ, ఎందుకు ఏడుస్తున్నావు?' అన్నాడు వరదరాజులు.

'ఊరికే నే'

'ఊరికినే ఏడుస్తారా?' తాయారు సమాధానంచెప్ప కుండా లోపలికి వెళ్ళిపోయింది.

నటరాజన్ నిట్టూర్చి 'వరదరాజులుగారూ, తాయా రుని మీరు తీసుకువెళ్ళండి' అన్నాడు.

'నేనూ అదే చెపుదామనుకుంటున్నాను – నీవు హాస్పి టల్లో చేరితే ఆమెను ఎలాగూచూడవల్సివస్తుంది... కాని'

'కాని?'

'ఏమీలేదు... తాయారుని మరోఇంట్లో ఉంచి నెల నెలా పోషిస్తాను... కాని'

'ఏమిటో చెప్పండి, సందేహందేనికి?'

'మనిద్దరం వస్తూపోతూఉండటం బాగుండదేమోనని'

నటరాజన్‌కి అతనిఅవస్థ అర్థమయింది. నవ్వి 'నేను రానులెండి. అయిందేదో అయిపోయింది. ఆమె నిక పోషించే స్థితిలో లేను నేను. అలాంటప్పుడు ఆశపడటంలో అర్థమూ లేదు, ఓపికాలేదు' అన్నాడు.

'నీవు గొప్పవాడివయ్యా పంతులూ!'

'దేనికి?'

'అన్నిటికీ... అది సరేగాని మీఅక్కయ్యని చూశాను కాఫీకూడా త్రాగాను'

'ఎలాఉంది?'

'పైకి నిక్షేపంగాఉంది'

'అంటే లోపల బాధపడుతోందా?'

'ఏమో! అలా అనిపించింది'

'ఎవరిగీత వాళ్ళది. వరదరాజులుగారూ, ఒకళ్లకోసం ఒకళ్ళం విచారించేస్థితిలో లేం- పోనివ్వండి'

'సరే,అయితే, నేను ఆ డబ్బు తెచ్చిఇస్తాగాని, వెంటనే ఆసుపత్రిలో చేరు... ఇల్లుచూసి తాయారును తీసుకెడతాను'

'వస్తుందో రాదో ఆమె నడగండి'

'రాకేంచేస్తుంది?' అని ధీమాగా అని వెళ్లిపోయినాడు వరదరాజులు... అతను అటువెళ్ళగానే తాయారు వచ్చి గావురుమని ఏడుస్తూ నటరాజన్ గుండెలమీద వాలిపోయింది. నటరాజన్ ఆమెతల నిమురుతూ 'నీకేం ఫరవాలేదు...పిల్లల కోసమైనా, నువ్వు వెళ్లకతప్పదు... ఏమంటావు?' అన్నాడు.

సరేనన్నట్లు తలవూపింది తాయారు - ఎందుకో తెలియదు, ఆమె అలా ఒప్పుకోగానే - నటరాజన్‌కి ఈ లోకంఅంతా శూన్యం అనిపించింది. తన కెవరూ లేరు - అసలీ లోకంలోనే ఎవరి కెవరూ లేరు.

నిట్టూర్చి ఒత్తిగిలి పడుకున్నాడు అతను... మూసి ఉన్న అతనికళ్ళలోంచి ధారావాహినిగా నీరు ప్రవహించి మొతకవాసనవేస్తున్న మురికితలగడాని తడిపివేస్తున్నది.

# 13

ఆమె నీ భార్య అనుకున్నప్పుడు - నాకు కాకుండా పోయినందుకు బాధపడ్డానుగాని, ఇంకేమీలేదు. ఆమె నీ భార్యకాదని తెలిసినప్పుడు నీ నీడ చూడటానికికూడా అసహ్యంవేస్తున్నది - అవినీతిలో పుట్టి, అవినీతిలో పెరిగిన నీవు అవినీతిపనులు కాకపోతే మరేంచేస్తావు?... ఇక దారి వదులు' అని విసుక్కుంది క్రిష్ణహరి.

'నేను పొరపాటే చేశాను... నన్ను క్షమించలేవా?' అని దీనంగా అన్నాడు సూర్యనారాయణ.

'ఎన్నటికీ క్షమించను... ఒకవేళ క్షమించినా నిన్ను పొందలేను... మీ కులంఅంటే నా కసహ్యం. మానాన్నగారు యాంటీనాచ్'

'దానికికూడా నా తప్పేనా?'

'అన్నిటికీ తప్పు నీదే - నీ మొహంచూడటమే?మహాపాపం!'

'క్రిష్ణా!'

'ఎందుకు అలా అరుస్తావు? కొడతావా ఏమిటి?తండ్రి ఎవరో తెలియకుండా పుట్టినవాడికి రోషంకూడానా?'

మాట పూర్తిగాకుండానే కెవ్వున కేకవేసింది క్రిష్ణహరి - తనుచేసినదేమిటో తనకే అర్థంకాలేదు సూర్యనారాయణకి. తెల్లబోయి అరచెయ్యి చూసుకున్నాడు- కొట్టాడు- తను క్రిష్ణహరిని కొట్టాడు.

చెంపని చేతితో అదిమిపట్టుకుని 'కొట్టావుకదూ, నన్ను కొట్టే అధికారం నేనే నీ కిచ్చాను. అందు కిప్పుడు విచారిస్తు న్నాను. ఇం కెప్పుడూ నా మొఖం నీకు చూపించను' అన్నది క్రిష్ణహరి...సూర్యనారాయణ ఆమె రెండుచేతులూ పట్టుకో బోయినాడు. ఆమె ఆడసింహంలా గర్జించింది.

'ఛీ ... దూరంగా ఉండు'

సూర్యనారాయణ ఆమెకి నమస్కరించి మెదలకుండా తవదారిన తను వెళ్ళిపోయినాడు.

క్రిష్ణహరి ఆ దుమ్ములోనే చాలాసేపు కూర్చుండి పోయింది - ఆమె మనసులో ఏమనుకుందో కేవలం ఆ సర్వాంతర్యామికే తెలియాలి... ...

ఎక్కడినుంచో ఒకపాట వినిపిస్తున్నది - నాధ హరే జగన్నాధ హరే - నిందతి రాధా వాసగృహే... నాధ హరే జగన్నాధ హరే.

అంతేనా!...ఇంకేమీ లేదా?

జయజయ దేవ హరే - హరే... అనుకుంది క్రిష్ణ హరి... ఆమెకి అంతకన్న మరేమీ మిగలలేదు. మిగలాలని కూడా ఆ అభాగ్యురాలు అనుకోలేదు. తన జీవనభాండాన్ని తనచేతులతో తనే పగలకొట్టేసుకుంది... ఇక్కడే కొన్ని నిముషాలకిందటే...

మరి మిగిలిందేమిటి?

నిందతి రాధా వాసగృహే... నాధహరే... జగన్నాధ హరే....పాట ఇంకా వినిపిస్తూనేఉంది.

# 14

'పూజారి భూషయ్య చనిపోయినాడని ఉత్తరం వచ్చింది... నేను వెళుతున్నాను... మీనాక్షి'

ఈ చిన్నచీటీని చూసి అయోమయంలో పడిపోయి నాడు సూర్యనారాయణ. మీనాక్షి తిరిగీ తన భర్తదగ్గరికి... అతని అంత్యసమయంలోనయినా వెళ్ళకుండా చనిపోయినాక వెళ్ళింది... ఎందుకు అలా వెళ్ళటం - ఈ సంస్కారానికి పునాదులు ఎక్కడ? వెళ్ళి తనేం పొందగలుగుతుంది?

చీటీ చేతులోపుచ్చుకుని తెల్లబోయి కూర్చున్న సూర్యనారాయణదగ్గరికి ఆరణి వచ్చాడు.

'ఏమి టలా కూర్చున్నావు?'

అతనిప్రశ్నకు సమాధానంగా ఆ చీటీని అతని కిచ్చాడు...

ఆరణి నిట్టూర్చి 'పాపం!' అన్నాడు.

'ఇప్పుడు మనం ఏమిచెయ్యాలి?' అన్నాడు సూర్యనా రాయణ... అతనిమనసు చాలా వికలమైపోయింది. మీనా క్షికి తనుచేసిన ద్రోహానికి క్షమాపణకోరుకోవాలని వచ్చాడు ఇంటికి.

ఈ జీవితంలో స్త్రీఅనేప్రాణికి మరెప్పుడూ ద్రోహం చెయ్యనని తనలో తనే ప్రమాణంచేసుకున్నాడు.

క్రిష్ణహరి తనచేతిలో దెబ్బతినికూడా - తనని చావు దెబ్బకొట్టింది. ఆ నొప్పిమాత్రం జీవితాంతమూ పోదు- తిరిగి తిరిగీ సెలవేస్తూనేఉంటుంది - దానికి చికిత్సకూడా లేదు.

సరే, ఇప్పుడు ఇహ తనకర్తవ్యం ఏమిటి? తను మీనాక్షిని వెతుక్కుంటూ పోవాలా - అక్కర్లేదా? ఎటూ తేల్చుకోలేకపోయినాడు సూర్యనారాయణ.

అసలు తనకేం జరిగింది? తనెందు కిలా అయిపోయినాడు! ఎవరినో ఇష్టపడి వారికోసమే బ్రతికి - వారినిగురించే ఆలోచించటంలో అర్థంలేదేమో! నాకోసం నేను ఎందుకు బ్రతకలేకపోతున్నాను? అని తననితానే ప్రశ్నించుకున్నాడతను.

ఉండిఉండి బ్రతుకుప్రాకారానికి తలుపులు విడివడితే - ఆ వెనుక ఎంత ఆశ్చర్యం - మరెంత ఆడంబరం! వీటిని అర్థం చేసుకోటం ఎలా?-అరిగించుకోటం మాత్రం ఎలా?

ఒక్కరోజునే తనఆత్మీయులిద్దరూ తనని వదిలివేశారు. ఒకస్త్రీకి ద్రోహంచేస్తే, మరోస్త్రీకూడా దక్కదేమో అనుకున్నాడతను. ఏ స్త్రీకి ద్రోహంచేసినా ప్రపచంలోని స్త్రీలందరికీ వర్తిస్తుందా అది?

మరి ఎవరో ఒకరు స్త్రీని దేవతగా ఆరాధించినంత మాత్రంచేత స్త్రీలందరికీ దివ్యత్వం లభిస్తుందా? లేక ఇదంతా భ్రమేనా?

ఏదిఏమయినా తనకర్తవ్యం ఏమిటి?

'సూరీ, మనంకూడా వెడదాం పద' అన్నాడు ఆరణి.

సూర్యనారాయణకి ఆలోచించేశక్తి లేదు. యాంత్రికంగా తలఊపాడు.

రైలు నీరసంగా కూసి, కదిలింది. కిటికీల్లోంచి జల్లు కొట్టి రైలుపెట్టె చితచితలాడుతున్నది. ఆ మూడవ తరగతి

పెట్టెలో ఒకమూల ముడుచుకు కూర్చున్నాడు సూర్యనారాయణ.

ఆరణి ఏదో పుస్తకం చదువుతూ కునికిపాట్లు పడుతున్నాడు. శ్రావణమాసపుగాలిలోని చల్లదనం గుండెల్ని జివ్వుమనిపిస్తున్నది. ముందుకు సాగుతున్నది రైలు- పట్నం వెనుకబడిపోయింది. అక్కడక్కడ చెదుగారుఉన్న కొన్ని ఇళ్ళు కనిపిస్తున్నాయి. అవికూడా దాటితే ఇక శూన్యమైన అంధకారం తప్ప మరేం కనిపించదు. ఆ శూన్యంలోనే అన్నీ ఇమిడిఉంటాయి. కృష్ణపక్షం అవటంవలన అంధకారం మరీ ఎక్కువగాఉంది – చంద్రుడు ఒకవేళ అమబ్బుల మాటున బలహీనంగా ఉదయించాడేమో !

సూర్యనారాయణకి నిద్రరావటంలేదు. తలనొప్పిగా ఉన్నట్లుంది. నిద్రఅనేది ఇంత దూరంగా పారిపోయిన సమయాల్లో అంత నిషాకలిగించే వస్తువు మరొకటి అయినా దగ్గరఉండాలి మానవుడికి – అనుకున్నాడు అతను.

అతన్ని వేధిస్తున్న ఆ ఒంటరితనాన్ని ఎవరయినా లాగేసుకుంటే బాగుండును – తనలోని నిరంతరవ్యధని జోల పాడి చిచ్చికొట్టి ఎవరయినా నిద్రపుచ్చితే బాగుండును – తనని ఇంతగా ఆశపెట్టి – వేధించి – సతమతంచేస్తున్నది ఏమి టది?

దానికి తుదీ మొదలు ఎక్కడ?

నొప్పిచేత అతనికణతలు పగిలిపోతున్నయ్. మనిషి మనసులోనో – జీవితంలోనో ఏదో లోటుఉన్నది. అది

పూరించటానికి వీలులేని లోటు- ఏమి టది? దాన్ని తెలుసు కోవటం ఎలా?

భగవంతుడు ప్రసాదించిన ఈ జీవితాన్ని దానిదారిన అది సాగిపోకుండా అడ్డుపుచ్చుకుని చిలక్కొయ్యకి తగిలించటం అనేది మనిషి ఎందుకు చేస్తున్నాడు?

భిన్నంగాఉన్న జీవితపుదారుల్ని - ఎవరిదారిన వారు సాగిపోవలసిన జీవితపుదారుల్ని - ఎందుకు ముడివేసుకుంటారు వీళ్లు. ఆ పీటముడి తెగకపోతే కోసివేసుకోవాల్సిన దుస్థితిలోకి ఎందుకు దిగజారతారు వీళ్ళు?

అతనికి ఏడుపువచ్చింది.

శబ్దాడంబరం కాకుండా అస్సలైన కవిత్వం దొరికే - ఆ వయసులో ఆవేశం అధికంగా ఉంటుంది-స్వయంనిర్ణయ బుద్ధి లోపించిపోతుంది- ఆవేశం అంతర్యంచేసే ప్రతిఘటనకి లొంగిపోతుంది. అయితే, దాన్ని నిగ్రహం అనటానికి వీలులేదు - దానివల్ల శాంతీ దొరకదు.

సూర్యనారాయణకి ఎప్పుడో నిద్రపట్టింది. అతనికి మెలకువవచ్చేసరికి ఆరణి బెడ్డింగు చుడుతున్నాడు.

# 15

'వీళ్ళందరూ సెక్సుయల్ పెర్వర్ట్సు Sexual perverts) ప్రేమించే స్త్రీ మగవాడికి రెక్కలు తగిలిస్తుంది. వెంటనే క్షణమైనా ఆలస్యం చెయ్యకుండా వాళ్ళు ఎగిరిచక్కాపోతారు.' అని పకపకా నవ్వింది నందిత.

'అంటే నీ ఉద్దేశం మనస్సు వాంఛల్ని ఎక్కడపడితే అక్కడ ఎలాపడితే అలా తీర్చుకోవచ్చుననా!' అన్నది తోటి విద్యార్థిని.

ఆ కాబోయే డాక్టర్లిద్దరూ హాస్పిటల్‌లో ఒకచోట నిలబడి సరదాగా మాట్లాడుకుంటున్నారు.

'చిక్కు ఎక్కడంటే, స్త్రీలో బిడ్డ కావాలనే కోర్కెని బలవత్తరంగా పెట్టి - బిడ్డనికనడానికి పురుషుడిని అవసరం చేసింది ప్రకృతి - స్త్రీకి పెద్ద దెబ్బ అదే'

'నువ్వు ఎన్నిఅన్నాగాని, మనలోని ఔన్నత్యాలు జీవనపథంలో గుదిబండలుగా తయారయి కుంగదీస్తాయి. అందుకే రచయితలూ కళాకారులూ ఈ ప్రపంచం మమ్మల్ని అర్థంచేసుకోటంలేదో అని మొత్తుకుంటారు' అన్నది ఆ మరో విద్యార్థిని - మనోమోహిని.

'నీ కళ్ళూ నుదురూ చాలంటే - అన్నిభారాలూ అతనిమీద మోపటం - నీతో ఒకక్షణం చాలంటే ఒక యుగందాకా అతన్ని పెనవేసుకుపోవటం ఆడది మానెయ్యాలి' అన్నది నందిత.

మనోమోహిని నవ్వి అంటే ఏ ఒకడినీ 'అంటిపెట్టుకోటం నీకు నచ్చదన్నమాట, అంతేనా?' అన్నది.

'అలా అనటంలేదు నేను - ఈమె నాకు కావాలని మగవాడు తెగించేసి ఆపదలోకి దూకడం ఆ స్త్రీకి చాలా ఘనతఇస్తుంది. తనకోసం మగవాళ్ళు తన్నుకుచావడం కన్న తృప్తి స్త్రీకి జీవితంలో వేరేలేదు. అనాదిగా తరతరాలుగా మృగజాతినుంచి వారసత్వంగా వచ్చిన లక్షణం అది. ఈనాడు

అది ఈ సంఘంలో తటస్థపడక నిర్జీవమైపోయింది - కాని అప్పుడప్పుడు ఆ సహజగుణం ప్రకోపిస్తూనే ఉంటుంది ఆడ దానికి'

మోహిని నవ్వింది.

'ఇంకోసంగతి ఏమిటంటే, ఆధునిక రచయితలందరూ సంసారం స్త్రీకి సంకెళ్ళు అంటారుగాని, శృంగారం ప్రేమా పురుషుడికైనంతగాదు. ఒకటిమాత్రం నిజం- స్త్రీ అంతర్యంలో విలువని పొందాలంటే - మగవాడు తన మిగతా అధిక్యతల్ని ఆమె మనసులో ముద్రించాలి. ఆ అధి క్యతల్ని కాదనుకున్నప్పుడు పురుషుడికి ఆమె మనసులో స్థానమేలేదు - చివరకి శ్రీకృష్ణపరమాత్మ అయినాసరే, అంతటిగాయకుడూ అంతటిరాజకీయవేత్తా కాకుండాఉంటే - ఉత్త మగవాడేఅయితే - పదహారువేలమందిలో ఒకతె కూడా అతన్ని దగ్గరికి రానిచ్చేదికాదు' అని నవ్వింది నందిత.

'ఇంతకీ తీర్పు చెప్పలేదు నువ్వు'

'ఏముందీ - తను ఇవ్వగలిగినంత ఉత్సాహమూ అతని కిచ్చి ఆ మగవాడిని దైవత్వానికెత్తి ప్రపంచం అతని కిస్తున్న విలువల వెలుగులో తనకళ్ళు జిగేల్‌మనేటట్లు తన లోకి అతన్ని లాక్కునే స్త్రీ చాలా గొప్పది'

'హోటల్‌సర్వర్‌ని రైటర్ని చేసినట్లు' అని మోహిని నవ్వింది.

ఆమాట వినగానే నందితముఖంమీద క్షణంసేపు ఒక విషాదరేఖ తారాడింది. అదిచూసి మోహిని నొచ్చుకుని

'నీ మనసు కష్టపెట్టానుకదూ నందీ?' అన్నది. నందిత మాట్లాడలేదు.

'నన్ను క్షమించు నందీ' అని ఆమెచేతిని తనచేతి లోకి తీసుకుంది మోహిని.

'అందుకుకాదు మోహినీ, ఈరోజే అతనిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఆ విషాదాన్ని దాచుకోటానికే ఇంత ఉల్లాసాన్ని నటిస్తున్నాను' అంటూ బాగ్‌లోంచి ఉత్తరం తీసి, మనోమోహిని కిచ్చింది నందిత.

ఆ ఉత్తరం చదివిన మోహిని నిట్టూర్పువిడిచి,

'ఎంత పాథటిక్‌గాఉంది ఉత్తరం' అన్నది. నందిత విషాదంగా నవ్వి,

'అతను రచయిత. ఆసంగతి మర్చిపోకు మరి' అని ఒక గట్టిరెబ్బని పక్కనున్న చెట్టునుంచిబలవంతంగావిరిచింది.

'నీకు ప్రేమంటే నమ్మకంలేదు...అయినా, అలాటి దేదో ఉందనే నాకనిపిస్తున్నది. ఆత్మవంచనచేసుకోకుండా నిజం చెప్పు. నువ్వతన్ని ప్రేమిస్తున్నావుకదూ ?' అన్నది మనోమోహిని.

'కృతజ్ఞతో, ప్రేమో, అభిమానమో చెప్పలేను - అతనంటే నాకు చాలా ఇష్టం. మాల్వంకర్ ఏదో ఒరగదో స్తాడని అతనితో వెళ్ళినప్పుడు నటరాజన్ లేకపోతే ఏమ య్యేదో!'

'అంటే మాల్వంకర్ ఎడ్వెంచర్‌కి నీవు పశ్చాత్తాప పడుతున్నావన్నమాట'

'ఛీ ఛీ! నోర్మూయ్. దేనికి పశ్చాత్తాపపడటం? ఇం దాక చెప్పానుగా క్షణం చాలంటే, యుగం పెనవేసుకు న్నాను. అందుకే అతడు భయపడి పారిపోయాడు'

'అతనికి దగ్గు దేనికి వస్తున్నది?'

'దరిద్రంవలనా – విశ్రాంతి లేకపోవటంవల్లనా అయి ఉంటుంది... అన్నిటికన్న గొప్పవిషయం అతనిలో ఉన్న నిగ్రహం'

'సెక్సుయల్ పెర్వర్టేమో!'

'ఏడిశావు... అదేం కాదు. తనకి చాలా మంది ఉన్నారు. ఇంట్లోనే ఒకామె ఉంది'

'పోనీ, నీ వెళ్ళి ఒకసారి చూచిరారాదూ?'

ప్రయోజనం లేనప్పుడు దేనికి? అతను చెప్పినట్లు దూరంగాఉంటేనే మంచిది'

'నీ సమక్షంలోనే ప్రాణం విడుస్తాడట'

'ధన్యురాల్ని' అన్నది నందిత. ఆమెకన్నులు నీటిని నింపుకున్నయ్.

విశాఖపట్నంలో నందిత తనని కలుసుకుంటున్నసమ యంలో విజయవాడలో ఒక నులకకుక్కిమీద ఒంటరిగా పడుకుని దగ్గువల్ల ఊపిరాడక బాధపడుతున్నాడు నటరాజన్.

అతనికి సరిఅయిన వైద్యంలేదు. పబ్లిషర్ ఇస్తానన్న డబ్బు ఇంకా ఇవ్వలేదు. ఉన్న పదిరూపాయలూ ఎప్పుడో అయిపోయినయ్. పోనీ కాసిని టీనీళ్ళయినా తాగుదామంటే చేతిలో అణాకూడా లేదు. అస్వస్థతవలన హోటల్ పనికీ పత్రిక పనికీ కూడా వెళ్ళటంలేదు.

వర్షంవలన ఆ గుడిసెఅంతా కురుస్తున్నది - అతని మంచంఉన్న మేరా కాస్త పొడిగాఉంది అంతే.

చిన్నమ్మ లోపలికి వచ్చి 'ఏమన్నా, ఎలాఉంది?' అని ఆత్మీయంగా పలకరించింది.

అడివిలో అంధకారంలో అలమటిస్తున్న పాంథునికి దీపంతోవున్న ఇల్లులా తోచింది ఆ కుశలప్రశ్న.

'చూడు చెల్లమ్మా, ఓ అణా టీ తెచ్చిపెడతావూ!' అని సగంచచ్చి అడిగాడు నటరాజన్... చిన్నమ్మ వెళ్ళింది.

అనాగరికులుగా - పశువులుగా ఉంటున్న వీళ్ళల్లో ఎంత ఆత్మీయత! ఎంత మానవత్వం!

నందిత తనదగ్గర ఉంటే... ఇలా ఉండేదా తనగతి? పాపం, భూషయ్య పోయినాడట... అక్క దేనికి వెళ్ళింది? బహుశా... అంతే అయిఉంటుంది అనుకున్నాడతను. మళ్ళీ దగ్గుతెరవచ్చి ఉక్కిరిబిక్కిరి చేసింది అతన్ని. ఆ ఆయాసం తోపాటు ఆవేదనకూడా అధికంగా ఉన్నది.

తన తల్లి, తండ్రి, వరదరాజులు, అక్క, సూర్యనారాయణ, తాయారు - ఇంకా తనకి పరిచితమైన చాలామంది తనస్మృతిగ్యాలరీమీద వచ్చి నించున్నారు.

వీళ్ళందరిజీవితాలూ కథలూ అతనికి కొత్తగాదు కాని, కళాత్మకమైనది ఏమయినా వాటిల్లో ఉందా? అంటే, లేదనే చెప్పాలి.

తనబ్రతుకు కళాత్మకమైనది కాదు - చావునైనా కళాత్మకంగా చేసుకోవాలి.

చిన్నమ్మ టీ తెచ్చింది - ఆ వేడి వేడి టీ కొంచెం త్రాగాక అతనికి కాస్త హాయికలిగింది - ఆ హాయిలోంచి ఆలోచనలు అనలుసాగాయి.

'అనో్నవ్ - ఈ అణాతో నువ్వు నాకు పావలా ఇవ్వాలి' అని హెచ్చరించి వెళ్ళిపోయింది చిన్నమ్మ.

చిన్నమ్మది నిర్విరామమైన జీవనసంగ్రామం. పొద్దున్నే లేచి తనుకూడా పాచిపన్లు చేయడానికి పోవటం ప్రారంభించింది ఇప్పుడు. ఇదివరకులాగా రోజూ సినిమాకి వెళ్ళటం లేదు. ఇమాంవిషయంలో రాములూ తనూ పోట్లాడుకోటం లేదు. దీనికంతటికీ కారణం చిన్నమ్మ అమ్మ కాబోతున్నది.

ఎలాటి నికృష్టస్థితిలోఉన్నాగాని, స్త్రీ తల్లికావాలనే లోభాన్ని చంపుకోలేదు. ఇన్నాళ్ళకి తనకీ అదృష్టంపట్టినందుకు అది పొంగిపోతున్నది. రాములంటే దానికి అపరిమితమైన ప్రేమాభిమానాలు పెంపొందుతున్నయ్.

ఇంకోసంగతి ఏమిటంటే - ఇప్పట్లో అది వాడికి పాతివ్రత్యంకూడా చేస్తున్నది.

బ్రాహ్మడూ రోగిష్టివాడూ అయిన నటరాజన్ - అంటే చిన్నమ్మకి భక్తీ జాలీను. టీ తెచ్చి ఇస్తుంది. ఆ గుడిసె ఊడ్చి పోతుంది - అతని రెండుగుడ్డలూ ఉతికిపెడుతుంది - ఇదంతా చేశాక అది ఆశిస్తున్నది వింటే, అమితమైన ఆశ్చర్యం కలుగుతుంది.

అది బ్రాహ్మడినోటినుంచి వచ్చే దీవన... దానికోసమే చిన్నమ్మ ఇంత చాకిరీచేస్తున్నదని గ్రహించిన రోజున నటరాజన్ ఆశ్చర్యపోయినాడు.

ఇది ఈ గడ్డమీద పుట్టినవాడికి రక్తంనుంచే సంక్రమి స్తుంది కాబోలు !

తనకడుపులో జలగలా కదులుతున్న చిన్నప్రాణికి నట రాజన్ ఆశీర్వచనం! శ్రీరామరక్ష - బ్రాహ్మడిదీవెన బ్రహ్మదీవెన.

దేవబ్రాహ్మలు ఇప్పుడు ఎక్కడున్నారు ?... నేను బ్రాహ్మడిని... నా తండ్రి పిల్లల్ని అమ్ముకునే కసాయి వాడు - నా అక్క అవినీతిగా. చరిస్తున్నది నేను, అంత కంటె అవినీతిగా నీచంగా జీవిస్తున్నాను. ఇంకా నా రక్తంలో పవిత్రత ఉన్నదా ? ఇంకా నా ఆశీర్వచ నంలో బలం మిగిలిఉందా ? నటరాజన్ తనలోతనే నవ్వుకు న్నాడు. ఆ నవ్వు ఒరిగిపోతున్న మహానిర్మాణానికి ఎదురుగా నిలబడిన శిల్పినవ్వు ... భస్మమైపోతున్న తండ్రిదేహాన్ని చూసి మహావేదాంతి అయిన కుమారునినవ్వు.

జీవితపు శిథిలాల్లోంచి మరో క్రొత్తనిర్మాణాన్ని ప్రారంభించటానికి తనకి శక్తిలేదు. ఆసక్తికూడాలేదు. ఈ శీర్ణ శిథిలాలముందు నిలబడి, నిశ్శబ్దంగా వాటిపతనాన్ని చూడటంతప్ప తను చేయగలిగిందేమీలేదు.

పబ్లిషర్ ఇచ్చే డబ్బుతో తను బ్రతకాలనుకోటం చాలా తెలివితక్కువ - తనడబ్బు నయమయేడబ్బు కాదని తనకి తెలియనేతెలుసు - కాకపోతే ఆసన్నమవుతున్న మృ త్యువు అడుగులచప్పుడు లెక్కపెట్టుకుంటూ జీవించవచ్చును. అయిదునెలలనుంచీ తను అద్దె ఇవ్వటంలేదు. ఇంటియజ మానురాలు నాలుగురోజుల్లో ఖాళీచెయ్యకపోతే వీల్లేదనీ నిన్న ఖచ్చితంగా చెప్పిపోయింది.

తప్పకుండా తను ఖాళీచేస్తాడు...తనూ ఆ శుభ సమయంకోసమే ఎదురుచూస్తున్నాడు - అయితే, కొంచెం తొందరపడి ముందుగానే ఖాళీచేస్తున్నాడు. ఎప్పుడోప్పుడు ఖాళీచేయక...తప్పని ఈ ప్రదేశానికి తను వెళ్ళినవెంటనే మళ్ళీ ఎవరో వస్తారు - మళ్ళీ వాళ్ళు వెళ్ళాక - ఇంకోళ్ళు వస్తారు - ఎప్పుడూ ఖాళీఉండదు.

ఇక్కడ గేహం ఒకటే, ఉండేవాళ్ళు మారతారు. దేహంవిషయంలో అలాకాదు - దేహం మారుతుంది,ఆత్మ ఒకటే - చిత్రంగావుంది!... ఎందుకో!... ఇంత మంచి విషయానికి విచారిస్తారు ఈ మనుషులు? - అనుకుని నవ్వుకున్నాడు అతను. ఇంతలో పక్కఇంట్లోనుంచి రాములుగొంతుక అరవటం ప్రారంభించింది.

'నాకు తెలియదా? నువ్వు వాడికి రోజూ టీ తేవటం?'

చిన్నమ్మ గొంతు నొక్కుకుని 'ఛీ! వాగబోకు, అన్నలాంటివాడు' అన్నది. ఆ తరువాత మాటలు వినిపించలేదు.

నటరాజన్ గతుక్కుమన్నాడు....'ఇప్పటికి నేనుచేసిన కర్మ చాలు - చిన్నమ్మసుఖానికి కూడా నీళ్ళుతోడటం దేనికి?' అనుకున్నాడు.

తన తుండుగుడ్డ పైనవేసుకుని - ఆ వానలోనే నడిచి పోయినాడు - నటరాజన్.

ఆక్షణంలో అతనిచేతిలో ఒక అణాగాని, అతనిశరీరంలో శక్తిగాని - ఎంతమాత్రం లేవు....కాని అతనిలో ధైర్యంఉన్నది....బహుశా తనయాత్రలో గమ్యస్థానం చేరగలడు...అతను.

# 16

సూర్యనారాయణ వెళ్ళేసరికి మీనాక్షి ఆ మట్టినేల మీద బోర్లాపడి నిద్రపోతున్నది... అతని అడుగులచప్పుడు ఆమెకి వినిపించలేదు.

'మీనాక్షీ!'

మీనాక్షి తలఎత్తి చూసి 'సూరీ, నువ్వా! ఎందుకొచ్చావు?' అంది. ఈ ఇంటికి తను ఎప్పుడూ వస్తూనే ఉన్నాడు. ఇవ్వాళ కొత్తేమీ లేదు-కాని మీనాక్షి ఎప్పుడూ తన నిలా ప్రశ్నించలేదు.

'వెళ్ళిపోదాం పద మీనాక్షీ.., అస లెందుకొచ్చావు' అని ఆమెని లేవదియ్యబోయినాడు అతను.

దూరంగా జరిగి 'తాకబోకు. నాకు మైల' అన్నది మీనాక్షి.

ఆతరువాత ఏం మాట్లాడాలో తెలియలేదు సూర్యనారాయణకి. కొన్ని నిముషాలు నిశ్శబ్దంగాగడిచిపోయినయ్.

'మైలా! నా మొహం. విజయవాడ వెళ్ళిపోదాం పద' అన్నాడు చివరకి.

'నువ్వనేది ఏమిటి సూరీ? నా భర్తకి నేను మైలపట్ట వద్దంటావా?' అన్నది మీనాక్షి కళ్ళు పెద్దవిచేసి.

ఏమిటి ఈ ప్రశ్న అనిపించింది అతనికి. ఇదెక్కడిసంస్కారం. తను నీతిమంతురాలైనపనులన్నీ చేసినాగాని మడి మైలలమీద ఈ మమకారం ఏమిటి? - చివరకి ఏమీ తోచక 'మరి ఎప్పుడెడదాం?' అన్నాడు.

'నే నిక నీతో రాను సూరీ' అన్నది – ఆ మాట అన టానికి సర్వేంద్రియశక్తులూ వాగింద్రియంలోకి కేంద్రీకరించుకుని.

సూర్యనారాయణ గతుక్కుమన్నాడు.

'ఎందుకని ?'

'బ్రాహ్మణవితంతువుకి ఎవరూ దిక్కులేకపోతే కాశీ వెళ్ళి ఉంటుంది'

'మీనాక్షీ !'

'అవును సూరీ – కాశీలో నాలాటివాళ్ళకి మఠాలు వున్నాయిట. ఈ అంత్యజీవితం హాయిగానే గడిపేయగలననుకుంటున్నాను. నువ్వేమీ అడ్డుచెప్పకు'

'మీనాక్షీ, నన్ను పరీక్షచేస్తున్నావా ?'

'అలా ఎందుకనుకుంటావు నువ్వు సూరీ? నేను నీమీద ఆధారపడే వెడుతున్నాను – నాకు కొంచెం డబ్బియ్యి'

'ఎంత ?'

'ఒక వందరూపాయలు'

'దేనికి ?'

'దారిలో అవసరంరావచ్చును'

'నీ కాళ్ళుపట్టుకుంటాను. నన్ను అన్యాయంచెయ్యకు' అని గావురుమన్నాడు సూర్యనారాయణ.

మీనాక్షి ఈ సన్నివేశానికి సిద్ధంగాలేకపోవటంవలన బిత్తరపోయింది. సూరి నిజంగా తనని ఇంతగా అభిమానిస్తున్నాడా ?....ఆ అభిమానంచేతనే జీవితాంతమూ తనని భరించటానికి సిద్ధపడుతున్నాడా ?

మరి ఇప్పుడు తనకు గత్యంతరంఏమిటి? సూరికి భార్యగా ఉండి కులంచెడగొట్టుకోవడంలో సుఖంఉంది - పరంలో ఉండి క్రిష్ణా రామా అనుకుంటే పరం ఉంది.

ఇన్నాళ్ళూ తను అతనితో ఉన్నాగాని - అతనుముట్టుకున్న నీళ్ళు ఏనాడూ తను తాగలేదు- అతిజాగ్రతగా తన కులాన్ని కాపాడుకుంటూ వచ్చింది.... ఇదివరకంటే తన కొక భర్త ఉండేవాడు - తను సూరిఇంట్లో ఉన్నాగాని, ఏదో ఆపద్ధర్మం.

ఇప్పుడలాకాదు. ఉంటే, అతనిభార్యగానే ఉండాలి. మరోవిధంగా అతనిఇంట్లో ఉండే అవకాశం లేదు. అలా ఉన్నందువల్ల తనకీ అతనికీకూడా సుఖంఉండవచ్చును. ఆ సుఖంకూడా తాత్కాలికమైనదేగాని, శాశ్వతమైనది కాదు. మరి అలాటప్పుడు ఈ క్షణికసుఖానికి లొంగిపోయి పరం పాడుచేసుకోవటం దేనికి ?

మీనాక్షి తలఎత్తి అతనివంక చూసింది - 'చెప్పు మీనాక్షీ ! నాతో వస్తానను' అన్నాడు సూర్యనారాయణ.

ఇతను ఏదో గట్టి దెబ్బతిని, తనను చికిత్సగా చేసుకోవాలనుకుంటున్నాడు - పదిరోజులక్రిందట తనఉనికి అతనికి ప్రతిబంధకంగా ఉండటం తను గ్రహించకపోలేదు. మరిప్పుడు తనే కావాలనటంలో అర్థం ఏమిటి ? అసలేం జరిగింది ?

'అసలేం జరిగింది సూరీ ?'

ఆ ప్రశ్న హటాత్తుగా ఎదురయ్యేసరికి సూర్యనారాయణ బిత్తరపోయినాడు. ఈ జీవితంలో జవాబుచెప్పలేని ప్రశ్న అది.

'నాతో చెప్పు - నేను పరాయిదాన్ని కాదుగా'

'వేధించబోకు మీనాక్షీ.- ఏమీ జరగలేదు... రేపు వెళ్ళిపోదాం పద' అన్నాడు ధైర్యం కూడదీసుకొని.

'నేను రాను'

'ఎందుకని రావు ?'

మీనాక్షి మాట్లాడలేదు.

'బ్రతుకుతో ఆటలాడటం మానెయ్యాలి. మీ ఆడ వాళ్ళు - ఒకప్పుడు వస్తాననటానికీ ఇప్పుడు రాననటానికీ హక్కు మీ ఒక్కళ్ళకే లేదు - మాకు ఉంది' అన్నాడు కోపంగా సూర్యనారాయణ.

పైకి ఎంతో బింకంచూపిస్తున్నా లోపలమాత్రం నూరి పిరికివాడన్న సంగతి మీనాక్షి గ్రహించింది. తన సమక్షంలోఉన్నకాసేపూ అతని యీ బింకం సడలదు. పసి వాడు మంకుచేసినట్లు - మాటిమాటికీ మారాంచేస్తాడు. అతన్ని చూస్తుంటే ఆమెకు సానుభూతి కలుగుతున్నది. ఇన్నాళ్ళూ తన కొక భర్త ఉన్నాడు. తను అతనిహక్కు. అయితే తన దురదృష్టంవలన అతనితో కలిసి తను పండించ వలసిన ధర్మక్షేత్రాన్ని బీడుపెట్టిఉంచింది. ఈస్థితిలో ఇతడు బలాన్నిపుంజుకుని - ఆమెను తనదాన్నిగా భావించి ఇక్కడ అడుగువేశాడు - కాని, ఆమె తనదేనా ? కాదా? అన్న అనుమానం అతన్ని వేధిస్తూనేఉంది.

మీనాక్షి మనసుకి చాలా బాధకలిగింది.

ఈనాడు తను ఒంటరిగా మిగిలిపోయింది. ఆమాట కొస్తే ఎప్పుడూ తను ఒంటరిగానే జీవించింది. తన స్వప్నాలే తనకి తోడు.

ఇక ఆమెఆలోచనలు సాగలేదు. తన కిప్పుడు ఉన్న దేమీ కనిపించటంలేదు. తన ప్రయాణానికి అడ్డులేదు. అడ్డులేక పోవటమే సత్యమైనదనిపించుకుంటుంది.

మీనాక్షి శూన్యంలోకి చూస్తూఉన్నది. లేమి ఉంటే గాని కలిమికి పరిపూర్ణతరాదు. జీవించాలంటే మృత్యు మోహం అవసరం.

అతనితో కలిసి తను వ్రాసిన జీవనప్రకరణం - తన చరిత్రలో ఒకభాగం అని మీనాక్షికి అనిపించటంలేదు. ఇదేదో ఒక తమాషా - ఆకస్మికంగా జరిగింది - ఆ వ్యవ హారానికీ తనజీవితానికీ సంబంధంఉన్నట్లు ఆమె భావిం చటంలేదు.

తను మామూలు తమిళ బ్రాహ్మణకుటుంబంలో పుట్టి తెలుగుదేశానికి కోడలుగావచ్చిన పేదబ్రాహ్మణ ఇల్లాలు - ఇప్పుడు వితంతువు. తన యీ చరమ జీవితాన్ని నిగ్రహించు కుని పరానికి సోపానాలు నిర్మించుకోవటమే తన ధ్యేయం.

'సూరీ, తరువాత ఏసంగతీ చెబుతాను, ముందు ఇక్కడనుంచి వెళ్ళు' అన్నది ఆమె.

ఆమె కంఠస్వరంలో వైరాగ్యం అతన్నిస్పృశించింది.

'నువ్వేనా మాట్లాడేది మీనాక్షీ! నాకు ఉండే గొడ వలు నాకు ఉంటాయి - అసలు దోషం అనేది నా స్వభా వంలోనే ఉన్నది. నిర్దోషినని నేను చెప్పుకోటంలేను. మనం

భిన్నవర్ణాలకూ - భిన్న సంస్కారాలకూ చెందినవాళ్లమైనా ఒకవిధమైన ఆత్మీయత మననిముడిపెట్టింది ... అందు కేనిన్ను రావాలని ప్రార్థిస్తున్నాను' అన్నాడు.

'ప్రస్తుతం ఉపన్యాసం అవసరంలేదు సూరీ. మరో కప్పుడు ఇద్దువుగాని ... ఇక వెళ్లు'

'కోపంవలన ప్రయోజనంలేదు మీనాక్షీ. అదిదుఃఖాన్ని స్తుంది _ నీ అంతటికి నువ్వు ఇక్కడనుంచి వెళ్ళటానికి ప్రయత్నించకు సుమా' అన్నాడు సూరి.

'సరే... వెళ్ళిపో నువ్వు ఒంటరిగా ఉండనీ నన్ను'

మీనాక్షీ, అందరిదీ ఒకటేమార్గం కాదనీ, కేవలం ఆ కారణంగా ఒకరిని ఒకరు చిన్నబుచ్చుకోవటం భావ్యం కాదనీ నీవు తెలుసుకోవాలి'

'సూరీ, ప్రతి చిన్నవిషయాన్ని వాదనలోకి లాగకు. ఈ అలవాటు ఎక్కువయింది నీ కీ మధ్య'

'నీవు నాకు ఉపదేశకురాలివన్నసంగతి మర్చిపోకు మరి'.

'దయచేసి ఇక వెళ్ళు'

'సరే, నువ్వుమాత్రం రావాలి'

'నమస్కారంచేస్తాను, ఇక వెళ్ళు'

'మీనాక్షీ!'

'సూరీ, వెళ్ళిపో'

సూర్యనారాయణ మెదలకుండా బయటికి వచ్చేశాడు. పైకిరాకుండా అణచుకొని కుమిలికుమిలి దుఃఖిస్తున్నశబ్దం అతనివెంట చాలాదూరం వచ్చింది.

మరునాడూ – ఆ మరునాడూ కూడా సూర్యనారాయణ అటు వెళ్ళలేదు. ఆరణిమాత్రం వెళ్ళాడు కనకాంగి కూడా కనుచీకటివేళ వెళ్ళి చూసివచ్చింది... మరునాడు సూర్యనారాయణ బయలుదేరబోతుండగా ఆరణి ఎదురుగా వచ్చి అతన్ని ఆపేశాడు.

'ఎందుకు?' అన్నాడు ఆశ్చర్యంగా సూర్యనారాయణ.

'వద్దు. నామాట విను'

'ఏమిటో చెప్పు'

'ఆమెను ఈ పరిస్థితిలో నీవు చూడలేవు?'

'అంటే?'

'అదంతే సూరీ... మీనాక్షి ఇక నీతో రాదు... రేపు రాత్రికి ఆమె కాశీప్రయాణానికి ఏర్పాట్లుచేసుకుంది'

'మీనాక్షి కాశీవెళ్ళటానికి వీల్లేదు' అని అరిచాడు సూర్యనారాయణ.

'సూరీ, తొందరపడకు... ఆమె అఘాయిత్యంచేసింది. ఇప్పుడు నువ్వామెను చూడలేవు'

'సరిగా చెప్పు. నా కేం అర్థంకావటంలేదు'

'నేను చెప్తాను బాబూ' లోపలినించి కనకాంగి వచ్చింది.

'వాళ్ళ కులాచారంప్రకారం భర్తపోయినవాళ్లు జుట్టు ఉంచుకోరు. మీనాక్షమ్మ అదే చేసింది'

సూర్యనారాయణకి తల దిమ్మెగాఉంది. ఏమీ కనిపించటంలేదు... 'నే... నే... ను... మీనాక్షిని చూడాలి' అన్నాడు తడబడుతూ.

ఆపాదమస్తకం తెల్లనిబట్టలో దాక్కున్న మీనాక్షి శరీరం అతనికి కనిపించలేదు... ఆమెఉనికికి అక్కడ అస్తిత్వమూ లేదు... మెదలకుండా వెనుతిరిగాడు సూర్యనారాయణ నాలుగడుగులతరువాత తూలిన సూర్యనారాయణని ఆరణి పడకుండా పట్టుకున్నాడు...

ఆ మరునాటిరాత్రి విగత కేశినీ నిరీహురాలూ అయిన ఒక వితంతు బ్రాహ్మణయువతి - చేతిలో చిన్న సంచీతో - ఆ సంచిలో కేవలం అయిదురూపాయలతో కాశీవరకు కొన్న టిక్కెట్టుతో, రైలుఎక్కింది. ఆమె కన్నులు శూన్యంలోకి చూస్తున్నయ్.

# 17

'తాయారూ, చూడు ఒక్కచుక్క ఏమన్నా మిగిలి ఉందేమో' అన్నాడు నటరాజన్.

ఈ వానలో వచ్చి ఆ ప్రశ్నఅడిగిన నటరాజన్‌ని చూసి తాయారు ఆశ్చర్యపోయింది. నటరాజన్ ఎప్పుడోగాని త్రాగడు. ఆమెకి తెలిసినదగ్గరనుంచి ఇది ఆరోసారో ఏడో సారో అయివుంటుంది.

నిర్మోహుడూ - మేధావంతుడూ- సంయమీ అయిన ఈ రచయిత - సంవత్సరానికి ఏ రెండుసార్లో త్రాగితే ఏం మునిగిపోయింది?

అతనిలో నిరంతరం జ్వలిస్తూఉండే ఆ అగ్ని ఏమిటో, ఆమెకు అంతుబట్టదు. ఆ సంస్కారమూ ఆమెకు లేదు. వరద

రాజులుతో తను రానని చెప్పాడు – అయినా ఈ వానలో వచ్చి...

'తయారూ, ఉంటే యివ్వు; తాగి వెడతాను'

'ఎక్కడికి?'

'తెలియదు. అది ఆలోచించటానికే త్రాగటం'

అతని శరీరమంతా పరీక్షగా చూసింది ఆమె. ఒకప్పుడు తనతృష్ణకీ దాహానికీ ఉపయోగపడిన ఆ శరీరం నేడు శిథిలమయిపోయింది. బొమికలకీ చర్మానికీ మధ్య నెత్తురూ మాంసమూ హరించుకుపోవటంవలన చర్మం ముడతలుపడి వేలాడుతున్నది.

అతనికళ్ళు జ్వరతీవ్రతచేత ఎర్రగా మండిపోతున్నయ్ వానలో తడవటంవలన ఒణుకుతున్నాడు.

తాయారు తేరుకుని అతనికి పొడిబట్టలు ఇచ్చింది. నటరాజన్ నవ్వి ఆ బట్టలుతీసుకొని 'కొన్నిగంటలు సుఖపడితే సుఖం అలవాటుకాదులే, ఫరవాలేదు. తినటానికీ త్రాగటానికీ కూడా ఏదయినా ఇవ్వు మరి' అన్నాడు.

వరదరాజులు ఇంట్లోలేడు. ఉన్నాగాని, ఈ పరిస్థితిలో అతనేమీ అనుకోడని తాయారుకి తెలుసు.

పడకకుర్చీలో పడుకుని విశ్రాంతితీసుకుంటున్న, నటరాజన్‌పాదాలదగ్గిర కూర్చుంది.

అతను నవ్వి ఆమెచెయ్యి తనచేతిలోకి తీసుకున్నాడు. తాయారు కన్నులనించి నీళ్ళు తెగిపడిన పూసలదండలా రాలాయి.

'ఏడుస్తున్నావా? ఇటు చూడు'

గాపురుమంది తాయారు.

'తాయారూ, వీథితలుపు వేసివచ్చావుగదూ? ఇలా రా దగ్గరగా' అని ఆమెని ఒడిలోకి లాక్కున్నాడు అతను- ఈక్షణంలో అతనికి స్త్రీవాంఛకూడా కలుగుతున్నది. అసలీ వాంఛాస్వరూపమే విలక్షణమయింది- మిన్నాగు ఆకుల సందునించి కాటేసినట్లు - అనారోగ్యంమధ్యనుంచి తలఎత్తుతుంది. దుఃఖంమధ్యనుంచి పడగవిప్పుతుంది.

'తాయారూ, ... నాకు వాంఛఉండి శక్తిలేదు. కొంచెం త్రాగటానికి ఇద్దూ' అన్నాడు అతను. తాయారు కళ్ళు తుడుచుకుని లోపలికి వెళ్ళింది.

నటరాజన్ తనని కోరికతో స్పృశించేసరికి ఆమెలోని స్త్రీత్వంప్రవహించటం ప్రారంభించింది అతనుఏస్థితిలోఉన్నాడో త్రాగటంవల్లనా వాంఛవల్లనా తన ఆయుర్దాయాన్ని ఎంత పోగొట్టుకుంటాడో ఆమె అర్థంచేసుకోలేదు.

వరదరాజులు బ్లాకులో సంపాదించి దాచిన బ్రాందీ సీసా తెచ్చి అక్కడపెట్టి సోడాఅదీ కలిపి గ్లాసులోకి వంచింది తాయారు. అందులోకి కైమాఉండలుతప్ప మరేమీ లేవు. నటరాజన్ మాంసం తినడని ఆమెకు తెలుసు. ఇంట్లోఉన్న సెనగపప్పుకే కాస్త ఉప్పూ కారం పట్టించి ఇచ్చింది. నటరాజన్ తృప్తిగా ఆనందంగా గంటసేపు త్రాగాడు ... కొద్దిగా కైపు ప్రారంభమయింది

ఆ నిషాలో ... ఆ గులాబీవెలుగు మిణుగురులలో ఇంకి పోయిన నెత్తురుఊటలు ప్రవహించటం ప్రారంభించిన ఆ సమయంలో తాయారుని దగ్గిరికి తీసుకున్నాడు నటరాజన్.

కొన్ని క్షణాలు కాలం ఆగిపోయింది.

అతనికి అలసటగా ఉంది. ఆయాసంకూడా ఎక్కువగా అనిపించింది. ఇంకా నిషాలోనే ఉండటంవలన అది అతను గమనించలేదు. కళ్ళు తిరుగుతన్నయ్. కడుపులో ఏదో వికారంగా ఉంది. భళ్ళున వాంతిచేసుకున్నాడు నటరాజన్.

తాయారు ఖంగారుపడింది. ఆ వాంతి నెత్తురు కాంతి. నటరాజన్ అది చూసి నీరసంగా నవ్వి 'ఇంకా నాశరీరంలో ఇంత నెత్తురు ఉన్నదన్నమాట' అన్నాడు.

ఇంట్లో అప్పుడే అడుగుపెట్టిన వరదరాజులు ఆ దృశ్యం చూసి వెంటనే డాక్టరుకోసం పరుగెత్తాడు. ఈ పరిస్థితిలోఉన్న నటరాజన్ గడియకిందట ఉన్న పరిస్థితిని జీవితంలో ఏనాడూ ఊహించలేదు వరదరాజులు.

డాక్టరుగారు వచ్చేసరికి స్పృహలో లేడు నటరాజన్. ఆస్థితిలోనే పరీక్షచేసి పెదవివిరిచాడు ఆయన.

'ఏమిటి డాక్టరుగారూ ?' ఖంగారుపడుతూ అడిగాడు వరదరాజులు.

'రోగం ఇంతవరదాకా వచ్చేవరకూ ఎలా ఊరుకున్నారయ్యా?'

'ఏంజబ్బండీ?'

'ఒక ఊపిరితిత్తి చెడిపోయింది. ఇందులో ప్లూరసీ కూడా కనిపిస్తున్నది...సరే, ప్రయత్నిద్దాం. త్రాగుడు ఇవ్వకండి. విశ్రాంతికావాలి ... మళ్ళీ రేపు వస్తాను' అన్నారు డాక్టరుగారు.

వరదరాజులుకి దిక్కుతోచలేదు.

'అసలు బ్రతుకుతాడంటారా డాక్టరుగారూ!'

'ఆ సంగతి ఇప్పుడే ఎలా చెప్పటం?' అని ఆ గది లోంచి ఇవతలకు వచ్చారు డాక్టరు.

అంతవరదాకా తలుపుచాటున నిలబడిఉన్న తాయారు అవతలికి వెళ్ళిపోయింది ఆమె అంతరాంతరాల్లో గాఢమైన స్త్రీత్వానికి అడుగునఉన్న ఆంతర్యపుమూలాలలో ఏదో కలుక్కుమన్నది. డాక్టరుగార్ని పంపించి తిరిగివచ్చిన వరదరాజులు నీరసంగా పడకకుర్చీలో కూలబడ్డాడు – అతని కేమీా తోచటంలేదు.

తనడబ్బుకి సమర్థత లేదు ఈవిషయంలో. డబ్బుంటే ప్రపంచాన్ని జయించటం అన్నిసమయాల్లోనూ జరగదు.

ఒకప్పుడు అలా అనుకుని భ్రమించా డతను. కాని, అదంతా మిథ్యఅని తేలిపోయింది ఇప్పుడు.

వరదరాజులు నవ్వుకున్నాడు మృత్యుసన్నిధిలోఉన్న నటరాజన్ సమక్షంలో తనకి జీవితంఅంటే ఏమిటి అన్నఆలోచన వస్తున్నది.

ఒక్కసారి తన గతంఅంతా మనోయవనికమీాద చూచుకోటం ప్రారంభించాడు అతను.

# 18

ఒక ఆడపాపకి పుట్టిన అభాగ్యుడు తను. పగలంతా అమ్మాజీగారికి ఒత్తులు ఒత్తివచ్చి సాయంత్రం గొడ్లసావడిలో తనని కన్నది తనతల్లి.

తండ్రి ఎవరో అందరికీ తెలుస్తూనేఉంటుంది గాని, ఆ తండ్రిని తండ్రిఅని చెప్పుకునే సాక్ష్యమాత్రం ఉండదు. అమ్మాజీగారితో అరణంవచ్చిన ఆడపాపలందరిలోకీ తనతల్లే అందమైనది.

అందుకే అమ్మాజీగారు వీలయినంతవరకూ తనతల్లి రాయణింగారికంటపడకుండా జాగ్రతతీసుకుంటూ ఉండేది. కాని ఆ పడకుండా ఉండకపోవటం పూర్తిగా అసాధ్యంకావటంవలన _ ఆయనగారి కంటపడటమూ తప్పలేదు, అమ్మగారికోపానికి గురికావటమూ తప్పలేదు.

అమ్మాజీగారయినా కోపపడటంతప్ప చేసేదేంలేదు. ఆడపాపల సంప్రదాయం పారంపర్యంగా వస్తున్నది ఆఇంట్లో.

తనవెంట అరణంగావచ్చిన ఈ ఆడపాపలందరూ - భర్తతో స్వేచ్ఛగాఉండటం - పోనీ ఎవరితోనయినా చెప్పుకుందామన్నా - అది సంప్రదాయం కావటం.

తెలంగాణా కులవధువులకి ఒకపెద్ద శిక్షగా ఉండేది... ఆడపాపలస్థితి మరీ అధ్వానం ... అమ్మగారికి చాకిరీ చేసి ఆవిడ నిద్రపోయినతరువాత - ఆ ఇంట్లోఉండే పురుషులకు దైహికావసరాలు తీర్చవలసిరావటం నిజంగా వాళ్ళ దురదృష్టం.

అయినాసరే, తప్పేదిగాదు. అలాగే ఉంటూ జీవితాన్ని గడిపేస్తారు వాళ్ళు - తల్లులవుతారు... ఆ పిల్లలమీద పెద్ద హక్కుఉండకపోవటంవలన ఎక్కువగా భ్రూణహత్యలకి ప్రయత్నిస్తారు. ఇంకోటేమిటంటే, యవ్వనం తరిగిపోకుండా చూసుకోవాలి.

ఆడపాప అయిన ఆడదానికి సర్వస్వమూ తన యవ్వనమే - ఆ యవ్వనాన్నే పెట్టుబడిపెట్టి, సుఖాన్ని పలుకుబడినీ సంపాదించుకుంటారు వాళ్ళు - అందుకే భ్రూణహత్యలకి ప్రయత్నించటం.

ఒక్కొక్క ఆడపాపకి అమ్మగారికంటె అధికంగా అధికారం ఉండేది - ఆ అధికారం దాని సౌందర్య యవ్వనాలనుబట్టి సంక్రమిస్తూఉండేది.

తనతల్లికి అలాటి అధికారంకూడా హస్తగతం అయింది. భర్తకీ పవిత్రతకీ వంచితురాలైన తనతల్లికి అమ్మాజీగారంటే అంతర్గతంగా పట్టరాని ద్వేషం ఉండేదన్నసంగతి తనకి చాలారోజులవరకూ తెలియదు.

రాయణింగారు ఎప్పుడయినా అమ్మాజీగారిగదికి బయలుదేరితే - దారిలోనే అడ్డుకొట్టి చిరునవ్వులూ వాలుచూపులూ విసిరి తను ఆకర్షించుకొని ఆమెగదికి వెళ్ళకుండాచేసేది తనతల్లి.

ఒక విధమైన ఏహ్యత కసీ ఆమెనరనరాలకీ పట్టిపోయింది.

అమ్మాజీగారితండ్రి తనతల్లి చిన్నపిల్లగా ఉండగానే అయిదురూపాయలకుకొన్నాడు. అప్పటినుంచీ అమ్మాజీగారితోపాటు పెరిగింది. కష్టాలు, కన్నీళ్లు, తిట్లు-ఈసడింపులు ఇవికాకుండా ఆప్యాయతకూడా అప్పుడప్పుడు దొరకకపోలేదు.

అయినా ఆమె అంతర్గతంగా ఆ కుటుంబాన్ని నాశనం చెయ్యాలనే ప్రతిజ్ఞపట్టిందనే సంగతి భగవంతుడికికూడా తెలియదు.

ఆమెకు తెలియకుండానే ఆమెశరీరంమీదకు శీతా కాలపు నీరెండలా - యవ్వనం పాకింది ... ఆ సమయంలోనే- ఆ ఇంటి పురోహితుడూ యువకుడూ అయిన అప్పన్నశాస్త్రి ఆమె అనురాగాన్ని పొందగలిగాడు.

కాని, ఆడపాప తను - బానిస- తనకునచ్చినవాడితో జీవితంగడిపే అదృష్టమూ స్వేచ్ఛా కూడా తనకి లేవు. తన తల్లి తెలివిగలది. తన స్వేచ్ఛాహీనతనీ తిరుగుబాటుతనాన్నీ ఆఖరికి తన ప్రేమనికూడా పైకికనపడకుండా దాచుకుంది.

ఆ సమయంలోనే అమ్మాజీగారి పెళ్ళికావటమూ, ఆ పెళ్ళికొడుకు పెళ్ళిలోనే తనమీద ఓరచూపులు విసరటమూ చూసి, తనలోతనే నవ్వుకుంది ఆమె. ఆతరువాత అమ్మాజీ గారి అత్తవారింటికి ఆమెబానిసగా తనూ వచ్చింది.

వచ్చేటప్పుడు అప్పన్నశాస్త్రిపాదాలమీద వాలి

'ఎక్కడున్నా నేను నిన్నే కొలుస్తాను బాపనయ్యా. ఎదవశరీరం నాదికాదుగాని, మనసు నాదేగా - అది నీదే' అని చెప్పి కళ్ళనీళ్లు తుడుచుకుని బండెక్కింది.

అమ్మాజీగారి అత్తవారిల్లు పెద్ద దేవిడీ ... ఏమూల ఏంజరిగేదీ ఎవరికీ తెలియదు - అలా ఏడాది గడిచేసరికి తను పుట్టాడు ... అదేమిఖర్మోగాని, తల్లిప్రేమ తను పొంద లేదనే చెప్పాలి.

కన్న ఆరో రోజునించే తల్లి తనని వదిలేసి పనిచేసు కోటానికి దేవిడీలోనే ఉండేది. దేవిడీలోనే ఒకపక్క ఉన్న గుర్రపువాడు యలమంద ముసలితల్లి తనని పెంచింది. తన తల్లి ఒకోసారి రాత్రిళ్లు దేవిడీలోనే ఉండిపోతే గుర్రపువాలు

పోసి పెంచింది ఆ ముసిలిది... అలాగే తనకి అయిదేళ్ళు వచ్చినయ్. గుర్రపుపాలు తనఒంటికిపడి ఏపుగాఎదిగాడుతను.

ఒక్కరోజున పట్టుచీర కట్టుకుని తనతల్లి ఆ దారి గుండా తోటలోకి వెడుతుంటే - తను అడ్డుపోయినాడు. ఆమె ఎత్తుకోవాలని అనుకుంది కాని, దూరంగా రాయణింగార్ని చూసి తనని తోసేసి వెళ్ళిపోయింది.

ఆరోజునించీ తల్లి అటుపోతూ కనిపించినా సరే, తను వెళ్ళేవాడుకాదు.

బానిసలకు - మమతలూ అనుబంధాలూ ఉండవని తనకి అప్పుడే అర్థమయింది... తను విపరీతంగా ప్రేమించింది యలమందతల్లిని. ఆ ముసిలిదాని సాన్నిధ్యంవల్లనే తను రాక్షసుడుకాకుండా కొద్దిగా మానవత్వం మిగుల్చుకోగలిగాడు. తనకి పదేళ్ళు వచ్చేసరికి ఆ గుర్రపుసాలలోనే పనివాడుగా పెట్టింది ముసిలిది.

తను దిసమొలతో - చింపిరితలతో - గుర్రాలసాల ఊడుస్తున్నప్పుడు - అన్ని నగలూ ధరించి తనతల్లి అటు వెడుతూ ఇటుచూసి తలవంచుకుని గబగబా వెళ్ళిపోయేది - తను పలకరించటంకూడా మానేశాడు. ముసిల్దిమాత్రం మెటికలువిరిచేది.

అందుకనేనేమో తనకి మాతృత్వపులోభం ఎక్కువ. తల్లిగా తనని ప్రేమించే స్త్రీకోసం ఇప్పటికీ తను అన్వేషిస్తూనేఉన్నాడు.

కొన్నాళ్ళు గడిచేక... తనతల్లికి వేరే మేడ కట్టించేరు రాయణింగారు. అమ్మాజీగారి తండ్రి తనని కొని బానిసని

చేసినందుకూ - అప్పన్నశాస్త్రి ప్రేమ తనకి దొరకకపోవటానికి కారణంఅయినందుకూ - అమ్మాజీగారిమీద కక్ష తీర్చుకుంది తనతల్లి. ముసిలాయన చివరకి కూతురుదిగులుతోనే చచ్చాడు.

అమ్మాజీగారినగలూ దాసీలూ అన్నీ అమ్మమేడకి వచ్చినయ్. ఒకరోజు అర్ధరాత్రి అమ్మాజీగారు అమ్మఇంటికి వచ్చారు. ఏంజరిగిందో తెలియదు. తెల్లవారేసరికి అమ్మ చనిపోయింది ... చనిపోయిన తరువాతకూడా తను అటుకేసి వెళ్ళలేదు. ఆతరువాత రాయణింగారు మంచందిగలేదు. ఆరునెలల్లో ఆయనా పోయినారు.

తన తల్లికూడబెట్టిన ఏభయివేలూ తనకి ఇచ్చే ఏర్పాటుచేశారు రాయణింగారు.

ఆ తరువాతెప్పటో తను పెద్దఅయాక ముసిల్దిచెప్పింది అమ్మాజీగారు వెళ్ళి, తనతల్లిదగ్గర ఏడిచారట. తన తల్లికి కావల్సిన ప్రయోజనమూ అదే.

'మాకూ – మనసులూ మమతలూ ఉంటాయన్న సంగతి మర్చిపోకండి అమ్మాయిగారూ. తెల్లారేసరికి అయ్యమీ మహల్‌కి వస్తారు వెళ్ళండి' అన్నదట.

ఆనాడే అప్పన్నశాస్త్రి ఏదో పనిమీద ఆవూరు వచ్చాడు - రాయణింగారు వచ్చే సమయానికి తను అప్పన్నశాస్త్రితో చనువుగాఉన్నట్లు నటించిందట తనతల్లి. రాయణింగారు మండిపడిపోయి భార్యదగ్గరికివెళ్ళి క్షమాపణ చెప్పుకున్నారు.

అప్పన్నశాస్త్రిగారు వెళ్ళిపోయినాక ఉంగరంలో రవ్వ మింగి చనిపోయింది.

కనీసం అప్పుడయినా- తనబిడ్డ -గుర్రపుసాలలో దిక్కు-లేని ముసలమ్మ జొన్నసంకటిపెట్టి పెంచుతున్న తనబిడ్డ - తనజీవితకాలంలో ఒక్క-నాడైనా దగ్గరికితీసుకోని తనబిడ్డ ఆమెకి గుర్తుకిరాలేదు. ఒకవేళ వచ్చాడేమో, ఆ సర్వాంతర్యామికే తెలియాలి.

తరువాత రాయణింగారు నిజం తెలుసుకుని చాలా విచారించారు ... ఆయన తనతల్లిని నిజంగా ఆరాధించారు. ఆ దిగులుతోనే ఆయన చనిపోయినారు.

ఇక రెండురోజులకి పోతారనగా తనని దగ్గరికి పిలిపించి - 'దాసికీ యజమానికీ పుట్టిన బిడ్డలు ఇంత దిక్కు-లేకుండా పెరుగుతారా అమ్మాజీ' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు.

అమ్మ చేసిన త్యాగం విన్నతరువాత అమ్మాజీగారు కూడా మారిపోయినారు. ఆయనమాటకి ఆవిడ సమాధానం చెప్పలేదు.

'అందుకే పెళ్ళితో ముడిపెట్టని ప్రేమకి ఫలితం దిక్కు-లేకుండాపోతుంది. సంప్రదాయంలో సౌందర్యం అదే' అన్నారాయన. ఆతరువాత అయిదారురోజులకే పోయినారు.

తల్లి ఆ స్తి తనకి హస్తగతంఅయినాకూడా ముసిలిది బ్రతికిఉన్నన్నాళ్ళూ తను ఊరువదలలేదు.

తరువాత విజయవాడ వచ్చి రకరకాల వ్యాపారాలు చేసి, ఆ డబ్బుని పెంచాడు. తనకి పెళ్ళిచేసుకోవాలనిలేదు -

భార్యఅంటేకూడా బానిసే గనుక బానిసత్వంఅంటే అస హ్యంగనుక పెళ్ళిచేసుకోలేదు.

తన బ్రతుకులోకి - సత్రంలో బాటసార్లు దిగినట్లు రక రకాలస్త్రీలుదిగివెళ్ళిపోయినారు. ఒకళ్ళుగంటఉంటేమరొకళ్ళు వారంరోజులు వున్నారు. అంతే. అంతకన్న మరేం ప్రయో జనంలేదు. కాని, ఏదో అసంతృప్తి. ఆప్యాయతకోసం అల మటించటం అనేది తనకి అలవాటయింది.

సరిగ్గా ఆసమయంలో మీనాక్షి కనిపించింది. ఎందుకో తెలియదు -ఆమెనుచూడగానే తల్లిజ్ఞాపకంవచ్చింది. ప్రేమిం చటం ప్రారంభించాడు - ఆ ప్రేమని తను ఏనాడూ పైకి చెప్పలేదు.

పడకకుర్చీలో పడుకున్న వరదరాజులు నిట్టూర్చాడు. ఈ పరిస్థితిలో ఇవ్వాళ తనసర్వస్వం నశించిపోయింది - పని ఉండి రైలుస్టేషనుకు వెళ్ళాడు తను.

మూడవ తరగతి పెట్టెలో అ మంగళాకారంలో మీనాక్షి ... తను తెల్లబోయినాడు.

ఆమె 'నవ్వి ఎందుకు అలా ఆశ్చర్యపోతారు _ మా కులంలో వితంతువులు జుట్టుఉంచుకోరు' అన్నది.

ఎలాగో గొంతుపెగుల్చుకొని 'ఎక్కడికి వెడుతున్నారు?' అని అడగగలిగాడు.

'కాశీ' అన్నది ఆమె.

'ఇహం నశించిపోయింది వరదరాజులుగారూ ... పరా న్నయినా బాగుచేసుకుందామని'

'నటరాజన్‌కి జబ్బు ఎక్కువగాఉంది- తెలుసా మీకు?'

'తెలుసు'

'దిగండి మరి'

'నేను దిగితే వాడు బ్రతుకుతాడని గారంటీఇస్తే దిగుతాను'

వరదరాజులు మాట్లాడలేదు.

'బ్రతికిమాత్రం ప్రయోజనంఏమిటి? వాడిని అడిగానని చెప్పండి'

'మీనాక్షిగారూ, ఒకమాట'

'ఏమిటి ?'

'నేను బ్రతికిఉన్నాను...నాకు తల్లి లేదు...తల్లికోసం నా బ్రతుకంతా వెతుక్కుంటూనే ఉంటాను - ఆ స్థానంలో మిమ్మల్ని స్థాపించుకుంటాను, మీరు వస్తే'

మీనాక్షికళ్ళు చెమర్చినయ్.

'వద్దు, నన్ను వెళ్ళనీండి...అది అందరకూ మంచిది'

'మీకు కాశీలో ఎలా గడుస్తుంది?'

'నా ఒక్కపొట్టకి ఎలాఅయినా గడిచిపోతుంది...అంతగా అవసరంవస్తే మీకు వ్రాస్తాను'

వరదరాజులు ఆమెకు నమస్కరించి 'తప్పకుండా అలా చేయండి' అన్నాడు.

'అన్నిబంధాల్ని బలవంతంగా విదల్చుకున్న నాచేత-మరో బంధాన్ని వేయిస్తున్నారు మీరు-మాతృత్వం మహా లోభనీయమైనది స్త్రీకి. నా కా దిగులు ఇదివరకు ఉండేది... ఇప్పుడు లేదు' అని నవ్వింది మీనాక్షి.

'నన్నుకన్న తల్లీ- నేను ఎన్నుకున్న తల్లీకూడా నాకు దక్కలేదు, నన్ను అర్థమూ చేసుకోలేదు - ఇద్దరూ ఆశోప హతులే' అని తనలోనే అనుకున్నాడు వరదరాజులు.

రైలు సాగిపోయింది - జోడించిన అతనిచేతులు చాలాసేపు విడిపోలేదు.

వారంరోజులు గడిచిపోయినయ్. నటరాజన్ స్థితిలో మార్పులేదు. డాక్టరుగారు వచ్చి మందులూ ఇంజక్షన్లూ ఇస్తూనేఉన్నారు - ఈ వారంలోనూ మరోతడవ రక్తం వాంతిచేసుకున్నాడు. తనఅక్కగారు కాశీవెళ్ళిందని విని 'చాలా మంచిపనిచేసింది' అనుకున్నాడు నటరాజన్.

తనకి ఉన్న ఒకేఒక రక్తసంబంధీకురాలుకూడా వెళ్ళి పోయింది. ఈ ప్రపంచంలో తనకి ఎవరూ ఇక లేరు. కాని .. అనుక్షణమూ అతనికి ఏదో వినూత్నమైన హృదయస్పందన కలుగుతున్నది - ఏదో చెప్పాలనే ఆవేదన ఎక్కువవుతున్నది.

అది చెప్పాలనుకున్నప్పుడు ఓపికలేకుండాపోయింది. అసలు బహుశా చెప్పకపోవటమే జరుగుతుందేమో.

ఎందుకు ఈ లోకం ఇంత తొందరగా తనని తరిమి వేస్తున్నది?

ఓ యాత్రికుడా! ఘంటా మ్రోగింది. ఇక బయలుదేరు.. అన్న హిందీపాట జ్ఞాపకంవచ్చింది అతనికి - సునో ముసాఫిర్ భజతీ ఘంటా-...ఎక్కడో పిడుగుపడింది.

'సునో ముసాఫిర్ భజతీ ఘంటా...ఇక బయలు దేరాలి' అనుకుని తనలో తనే నవ్వుకున్నాడు నటరాజన్.

'రచయితా! నీ వింత స్వాభావికాకు నీవు నీదేశపు వెన్నెముకవు. మాతృభూమి నీయందు చాలా ఆశలుపెట్టు కొంది' అన్నది కాలం.

'నా జీవితపరమావధికి నే నీ మార్గాన్నే వరించక తప్పదు నియతీ - నా మాటలనుబట్టి నడతలు చూసి, నేను మానసికదౌర్బల్యంచేత మరణిస్తున్నానని నీవు పొరపాటు పడ్డావు - నేను మరికొంతకాలం జీవించాలని నీ వనుకుంటే-మరోజన్మలో అనుమతి తీసుకుంటాను'

'ఏమిటి నీలో నీవే మాట్లాడుకుంటున్నావు?'

వరదరాజులు గుమ్మంలోఅడుగుపెడుతూనే అడిగాడు.

'ఏంలేదు వరదరాజులుగారూ. రైలుకి గంటకొట్టి నట్లున్నారు?'

'అవును పాసింజరుబండి, విశాఖపట్నం పోతుంది' అన్నాడు వరదరాజులు.

'సునో భజతీ ఢంకా'

'ఏమిటి?'

'గంట ... వినిపించటంలేదూ?'

'వినిపిస్తున్నది'

'అదే, టైముఅయింది?'

'దేనికి?'

'పాసింజర్లు బయలుదేరడానికి'

వరదరాజులుకి అదేమీ అర్థంకాలేదు. కాని నటరాజన్ రోజూ మాట్లాడినట్లు మాట్లాడటంలేదు.

'ఇవ్వాళ డాక్టరుగారు వచ్చారా!' అని లోపలికి కేక వేశాడు.

'వచ్చారు' లోపలినించే సమాధానం ఇచ్చింది తాయారు.

ఆరాత్రి జనతాలో అతిదుర్బలుడైన మనిషి ఎక్కటం చూసిన జనం ఆశ్చర్యపోయినారు.

అతడు ఒంటరివాడు. అతని కెవరూ లేరు.

# 19

చాలా సంవత్సరాలు గడిచిపోయినాక, సూర్యనారాయణకి రైలుస్టేషనులో రాధహారి కనిపించింది. తనే నమస్కారంచేసింది. ఈమధ్యలో ఒకరిసంగతులు ఒకరికి తెలియవు.

'మీరా రాధహారి! ...'

'అవును'

'క్రిష్ణ కులాసాగా ఉన్నదా?' ఈ ప్రశ్న సిగ్గుపడుతూనే అడిగాడు సూర్యనారాయణ. అతనిప్పుడు పెళ్ళిచేసుకుని పిల్లల తండ్రి అయాడు, ఒకసంస్థలో అతను ఆఫీసరుకూడా.

'మే మిప్పుడు విజయవాడలోనే ఉంటున్నాము. సాయంత్రం మా ఇంటికి రండి' అని ఆహ్వానమూ అడ్రసూ ఇచ్చింది రాధహారి.

ఆ సాయంత్రం సత్యనారాయణపురం చివర ఉన్న వాళ్ళింటికి వెతుక్కుంటూ వెళ్ళాడు సూర్యనారాయణ.

చుట్టూఉన్న మొక్కలమధ్య అందంగాఉన్న ఆ ఇంటివసారాలో చక్కని పేముకుర్చీలు వేసిఉన్నాయి. రాధ హారి ఎదురొచ్చి చాలా ఆప్యాయంగా ఆహ్వానించింది.

ఆమెభర్త కాంప్‌కి వెళ్ళారు. ఇంట్లో వంటమనిషీ, పనిమనిషీ ఉన్నారు. ముత్యాల్లాటి ఇద్దరుపిల్లలు. టీ అదీ ఇచ్చి కులాసాగా కబుర్లుచెపుతూ హఠాత్తుగా అడిగింది రాధహారి–

'కృష్ణ ఇప్పుడు బృందావనంలో ఉన్నది తెలుసా?'

సూర్యనారాయణ తెల్లపోయి– 'అయితే, యోగిని అయిందా?' అన్నాడు చివరకి గొంతుపెగుల్చుకుని.

'అన్నమాటే ... అదివరదాకా చిలిపిగా అల్లరిగా ఉండేది... ఒకరోజున సడెన్‌గా మారిపోయింది. ఎవ రెన్ని విధాల అడిగినా ఏమీ చెప్పలేదు. ఎప్పుడూ క్రిష్ణవిగ్రహం ముందు కూర్చునేది... ససేమీ పెళ్ళిచేసుకోనంది... నాన్న గారూ అమ్మా ఎన్నోవిధాల చెప్పిచూశారు'

'ఇప్పుడు బృందావనంలో ఒంటరిగానే ఉన్నదా?'

'అవును, అమ్మా నాన్నగారూ పోయాక దానివంతు ఆస్తి అది తీసుకుని వెళ్ళిపోయింది' అని నిట్టూర్చింది రాధహారి.

సూర్యనారాయణ శూన్యంలోకి చూశాడు – ఒక్క సారి కాలేజీజీవితం జ్ఞాపకంవచ్చింది – కాలేజీకెదురుగా కొండలు – అల్లిబిల్లిగా పాకిన తీగలు ఎర్రని కెంపులలాటి కాశీరత్నాలు.

వసంతం తొడిగింది. కోకిలలు కూసినయ్!

గత హేమంతంలో రాలిన ఆకు లెన్ని? ప్రస్తుతం చివురిస్తున్న లేతఆకులు చూడు.

ఇదే జీవితం.

సుదీర్ఘమయిన జీవనయాత్రాపథంలో పథికులు తనూ- క్రిష్ణ - ఆరణి - మీనాక్షి-

ముందేమిటో తెలియకముందు - ఏమున్నా తప్పని యాత్రలో కొన్నాళ్లు కలిసి నడిచారు - విధిచేతిలో కీలు బొమ్మలై కదిలిపోయారు - కాలయవనిక చాటున - కను చీకటిబ్రతుకు ఎలాగో గడిపివేస్తున్నారు.

కొత్తతొడుగు తొడిగిన కాలం తిరిగి నవ్వింది.

ఎన్ని కోరకాలు విడతాయి, ఎన్ని పుష్పాలు పరిమళిస్తాయి!

కడలితీరంలో ఉవ్వెత్తుతన లేచివచ్చే అలకి తన కంటే ముందు వెళ్ళి విరిగిపడిన కెరటంసంగతి కొంతవరకు తెలుసు- రాబోయే అలసంగతే అయోమయం - జీవితంకూడా అంతేనా?

ఒకవేళ తెలుసుననుకుంటే - సృష్టి ఏమవుతుంది - స్తంభించిపోతుందా?

ఆనాడు బ్రహ్మాండమైన దుఃఖాన్నిగాని ఆనందాన్ని గాని కలిగించిన వ్యక్తులు ఈనాడు జ్ఞాపకానికివచ్చినా అంత దుఃఖంగాని ఆనందంగాని ఎందుకు కలగటంలేదు,

కాలం ఇంత విచిత్రమయినదని తను ఈనాడే కొత్తగా గ్రహించినట్లుంది సూర్యనారాయణ.

'ఏమిటి ఆలోచిస్తున్నారు?'

రాధహారి అడిగిన ప్రశ్నకి ఆలోచనాతరంగాల్లో ఉక్కిరి బిక్కిరిలోంచి తేరుకున్నాడు అతను.

'జీవితంలో అన్నీ వదులుకునేంత అవసరం ఆమెకి ఏం వచ్చిందో' అన్నాడు.

'ఆ సంగతి చాలాతడవ లడిగాడు నాన్న. ఒక్కసారి కూడా సరిఅయిన సమాధానం ఇవ్వలేదు'

తమ ప్రణయగాధ రాధహారికి తెలుసో తెలియదో సూర్యనారాయణకి అంతుబట్టలేదు. అయోమయంగా రాధ కళ్ళల్లోకి చూశాడు.

రాధ చెప్పటం ప్రారంభించింది.

'చిన్నప్పటినుంచీ దానిది అదోవిధమైన మనస్తత్వం. తొందరపడి ఏదీ చేయదు-చెయ్యాలనుకుందా బ్రహ్మదేముడు కూడా మార్చలేడు. హాయిగా పెళ్ళిచేసుకోమంటే వద్దంది. పోనీ పెళ్ళి అవసరంలేనిదానికి అంత ఆస్తి దేనికి? అందులో యోగినికి....అన్నారు వాళ్ళబావగారు. దానికీ సమాధానం చెప్పకుండా తనవంతు పూచికపుల్ల దగ్గరినుంచీ బాంక్‌లో వేసుకుంది... దాని మనసులో ఏముందో ఆ బ్రహ్మకికూడా తెలియదు' అని నిట్టూర్చింది రాధహారి.

ఆమెస్వార్థానికో వాగ్ధోరణికోగాని చాలా తలనొప్పి వచ్చింది సూర్యనారాయణకి. మొదలుకుండా లేచి సెలవుతీసుకొని బయటపడ్డాడు.

గవర్నరుపేటలో ఒక మేడమీద ఉంటున్నాడు అతను-ఇదే విజయవాడరోడ్డుమీద తను ఒకప్పుడు చాలారోజులు నడిచాడు - అప్పుడు బాధలు, విసుగు చాలా వేధించాయి.

ఇప్పుడు ఆగాయాలు మానిపోయినాయి ఎంతగా మానిపోయా యంటే ఒక్కప్పుడు అక్కడ గాయాలున్నాయనుకోవటానికి కూడా ఏమాత్రం అవకాశంలేదు.

కాని... స్త్రీజాతి కోతిపుండుని బ్రహ్మరాక్షసిని చేసుకుని బాధపడటంలో ఆనందం అనుభవిస్తుందా? క్రిష్ణహరి... మీనాక్షి... వీళ్ళంతా అలా ఎందుకు చేశారు?

బాధలో ఆనందాన్ని వీ ళ్ళెందుకు కొంగులో కట్టుకుని – దానిస్పర్శ అగ్నిలాగా చురుక్కుమంటే ఆ చురుకుదనంలో ప్రియుని కపోలస్పర్శ ఊహించుకుంటారు?

అప్పుడప్పుడు స్త్రీఅంతర్యంలో కుపిత రుధిర మహాంబుధీసహస్రఫణాలు బుస్సుమంటాయి. కోటిరక్తపతాకమాలలు పడగలువిప్పుతాయి. ఉన్మత్త కాళీక్రోధభీకరనృత్యాలు గజ్జె సవరిస్తాయి. అప్పుడే క్రిష్ణహరిలాటివారిజీవితాలు తొలిమలుపు తిరిగి అగాధంలో అందాలు వెదుక్కుంటాయి.

అంతేకాదు – అప్పుడప్పుడు ఆడదాని ఆంతర్యంలో అపరంజికలశము ఒలికి శీతలసుధ ప్రవహిస్తుంది. అమలినమైన ఆత్మనివేదన మధురతుషారమై జల్లు కురుస్తుంది. గులాబీ తోటలలో హిమాంబుతేటలు సితాంబుజమాలలై అలరింప చేస్తాయి.

అకారణమైన ఆ క్రోధానికీ అవ్యక్తమైన ఈ ఆనందానికీ కారణం తెలుసుకోలేని పసికూన ఆడదానిఆంతర్యం.

ఆమెకు తెలియకుండా నేతనఆంతర్యం తక్కిన అగ్నిపర్వతపు నిప్పుకణికలతో ఏ రక్తకపాలమాల తయారు చేయటమో తెలియనప్పుడు – ఆమెకు అర్థంకాకుండానే ఆమెమనసులో

1343

విరిసిన కోటి సుమాలు ఏంచేయటానికీ తోచనప్పుడు - ఆ మాధుర్యానికి వివశురాలై ఆ మహాగ్నికి ఇంధనమై, నశించి పోతుంది స్త్రీ.

చిత్రంఏమిటంటే, ఆమెసుఖమూ దుఃఖమూ కూడా అత్యున్నత స్థితికి చేరుకున్నప్పుడు భేదం తెలియదు స్త్రీకి. ఆ నిరామయస్థితిలో విచక్షణాజ్ఞానం నశించిపోతుంది ఆమెకి. సర్వేంద్రియాలూ జడమై ఒకవిధమైన యోగస్థితిలో పడిపో తుంది. క్రిష్ణహరి అదే చేసింది, మీనాక్షికూడా అదేచేసింది.

ఆలోచనలోపడి ఇల్లుదాటిపోయానన్న సంగతి పది గజాలు దాటాక గుర్తువచ్చింది సూర్యనారాయణకి. వెనక్కి తిరిగి మేడమెట్లు ఎక్కాడు.

ఎదురుగా వచ్చింది భార్య...అయినా వేశ్యలాగానే కనిపించింది అతనికి. ఎప్పుడో అమ్మమ్మ అన్నమాట జ్ఞాప కంవచ్చింది సూర్యనారాయణకి.

'మగవాడు వేశ్యతో సుఖిస్తాడు - ఇల్లాలితోనూ సుఖిస్తాడు... కాని, ఇప్పటిఆడవాళ్ళు ఇల్లాలితనం పోగొట్టు కుని వేశ్యాసంస్కారం అసలే లేక - మధ్య ఊగులాడుతూ స్త్రీఅంటేనే మగవాడు పారిపోయేట్లు చేస్తున్నారు.'

సింహాచలంమాటలు గుర్తువచ్చి తనలోతనే నవ్వు కున్నాడు అతను.

## 20

అరుణోదయపువేళ - శిథిలవకుళంవంక చూస్తున్న నందితభుజంమీద ఎవరో చెయ్యివేశారు. ఉలికిపడి నందిత వెనుదిరిగి చూసింది.

సడిలేని అడుగులతో సమీపించిన మనోమోహిని - సరోవరసుందరిలా మనోమోహిని.

'మనూ... నువ్వా!'

'హలో డాక్టర్ ...' అని విష్‌చేశాడు మనోమోహిని భర్త కాబోలు.

వెంటనే కాలేజీరోజులలో ఉండే చిలిపితనంవచ్చింది నందితకి. రహస్యంగా మనూవంక ఒంగి, 'లీగల్‌హజ్బెం డేనా!' అని అడిగింది.

'ఛీ, నోర్మూయ్యి. ఇప్పుడవన్నీ మానేశాం'

'మరేంచేస్తున్నట్లు?'

'ఆదర్శభారతనారిని గనుక, ఒకభర్తతో బుద్ధిగా కాపురంచేసుకుంటున్నాను'

'రుచిగాఉందా?'

'చేదుగామాత్రం లేదు'

'సరేగాని, ఈ కాశీకి దేనికి వచ్చినట్లు?'

'కేవలం విశ్వనాథుడికోసంమాత్రం కాదు'

'మరి దేనికి?'

'ఒకబంధువుని చూడటకోసం వచ్చాను. ఆ బంధువు బృందావనం విడిచి ప్రస్తుంత కాశీలో ఉందని అంటే, ఇక్కడికి వచ్చాం'

'కనిపించిందా?'

'ఆసంగతి తరువాత చెబుతాగాని, నువ్వు దేనికి వచ్చావు?'

నందిత మొగం ముడుచుకుపోయింది... ఒక్కసారిగా ఆమె కన్నులు నీటిని నింపుకున్నయ్.

మనోమోహిని నందితవంక తెల్లబోయి చూసింది. నందిత వివాహితురాలైంది — ఒకబిడ్డతల్లి అయింది. బాధ్యత గల డాక్టరుకూడా... కాని, గతం మరిచిపోలేదు.

'నందీ... నువ్వింకా మర్చిపోలేదా?' అంది ఆమె చెయ్యి తనచేతిలోకి తీసుకుని.

కన్నీటితోనిండిన కన్నులు ఎత్తి మనోమోహినివంక చూసింది నందిత.

ఆ కన్నులలో ఆ దృశ్యం తిరిగీ చూడగలిగింది మోహిని.

* * * * *

చాలారోజులకిందట ... ఒక జనతాఎక్స్‌ప్రెస్‌లో దుర్బలుడైన మనిషి ప్రయాణంచేస్తున్నాడు.

'ఇంకా...ఎంతదూరం!'

'వచ్చేశాం'

తనని తనే ప్రశ్నించుకుని జవాబుకూడా తనే చెప్పుకుంటున్న ఆ వ్యక్తి ఎవరో పక్కనే కూర్చుని నీతి అవినీతులు చదువుతున్న మరోవ్యక్తికి తెలిస్తే బాగుండును... కాని తెలియదు.

దగ్గు అతనిప్రాణాల్ని పిండివేస్తున్నది...'క్షమించాలి. నా దగ్గు మీకు డిస్ట్రబెన్స్' అన్నాడు పక్కఅతనితో. దానికి సమాధానంగా 'మీరు నీతి అవినీతులు చదివారా?' అని అడిగాడతను.

'చూశారా... ఇలా ఉన్నాను, నాకు చదువువచ్చు నని మీకు అనిపిస్తున్నదా?'

'ఎంతో కొంత సంస్కారం ఉంటేతప్ప తనదగ్గు పక్కవాడికి బాధఅని తెలుసుకుని క్షమాపణ అడగరు'

కొంచెంసేపు ఇతను మాట్లాడలేదు... తరువాత

'ఎందుకు ఆ పుస్తకం చదివారా అనిఅడిగారు?' అని ప్రశ్నించాడు.

'ఈ రచయిత ఎవరోగాని, చాలా చిత్రమైన వ్యక్తి'

'ఎందుకని?'

'ఇతని... లేక ఈమె... అభిప్రాయాలు చాలావింతగా ఉన్నాయి'

'అదేమిటి?'

'ఈ రచయిత్రిపేరు నందిత... మగవాడైనా కావచ్చును - కాని, జీవితాన్ని ఇంత నగ్నంగా అన్నికోణాల లోంచీ ఫొటోతీసినట్లు చిత్రించడం... బాగానే ఉందిగాని, అది ఆర్టు అనిపించుకోదేమో, ఫొటోగ్రఫీ అనిపించుకుంటుం దేమో... అనిపిస్తున్నది'

'అంటే?

'ఉదాహరణకి ఈ వాక్యాలు చూడండి: ఆరాధన-ఈనాలుగుఅక్షరాలకీచాలాఅర్థంఉన్నదనిఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నాను - భగవంతుడిని భక్తుడు ఆరాధిస్తే భక్తి అనీ-ప్రియురాల్ని ప్రియుడుఆరాధిస్తే ప్రేమఅనీ పిలువబడే ఈ ఆరాధన అతి విచిత్రమైనది. దీనికి మొదలూ తుదీలేదు. అర్థం కూడా లేదు.

'స్త్రీని దేవతగా ఆరాధించడం - అనుక్షణమూ ఆమెనుగురించే తలపోయటం ఇవి చూసేవాళ్లకు పిచ్చిపన్లుగా కనిపించవచ్చును.

కాని, ఆ పిచ్చిపనులవెనకాల - అననుభూతమైన ఒక నిషా - ఆ నిషాని ఆవరించుకొన్న ఒక ప్రతిస్పందన - ఆ ప్రతిస్పందనకివెనకాల ఒక అమృతత్వపు అనుభవం వాళ్ళు పొందుతారు.

'లేకపోతే ఇవ్వగలిగిందీ - తీసుకోగలిగిందీ లేనప్పుడు అంతటి ఆరా[టం] ధన వ్యర్థమే అనిపించి-అదేదో ఉన్మాదం అనిపిస్తుంది.

'అదొకటే చిత్రం అనుకుంటే, అంతకన్న చిత్రం మరొకటి. నీతీ, నైతికప్రవర్తన, ధర్మం - వీటిని ఏనాడూ లెక్క-చేయని మనిషి ఇలాటి ఆరాధనలోపడి స్త్రీని దేవతగా ఆరాధించటం ప్రారంభించటం అంతకన్న చిత్రం.

'తనదికాని స్త్రీని తనదిగా భావించటం ఒకతప్పు - దానికి ప్రేమఅని పేరుపెట్టుట మరోతప్పు. ఆ భావనని లోకానికి చాటటం అన్నిటికంటె పెద్దతప్పు - ఇది సంఘదృష్టి.

'ఈ సంఘదృష్టిని కొంచెంకూడా లెక్క-చేయని ఆ సాహసాన్ని అభినందించక తీరదు - అందుకని అది మంచి పని అనీ నేను అనబోవటంలేదు. ఏది నీతో ఏది అవినీతో నిర్ణయించే అధికారం నాకులేదు.'

'విన్నారుగా పైమాటలు - నీతి ఏదో అవినీతి ఏదో చెప్పలేనప్పుడు రచయిత వ్రాయటం అనవసరం అనిపిస్తుంది నాకు... అవునా?' అన్నాడు ఆయన.

'లోకంలో ఎప్పుడూ ఆ కొలబద్దకి అతీతమైన వ్యక్తు లుంటారు. ఆ వ్యక్తులు చేసేపనుల్ని కొలవటానికి మామూలు కొలబద్దలు పనికిరావు'.

'అయితే?'

'అందుకే రచయిత తనతాహతు తెలుసుకుని అపరి మితమూ - అల్పమూ అయిన తనజ్ఞానంతో గీతలుగీయకుండా ఉండటం చాలా మంచిది - అదీగాక, ఆ ఆరాధన అర్థం లేనిదే అయినా, అది పొందినవాళ్ళు అదృష్టవంతులు. నాస్తికుడైనవాడు ఒక్కసారి మహాభక్తుడుగా మారిపోతే, ఆ గొప్పతనం భగవంతుడిది అవుతుంది. స్త్రీ దేహావసరానికి పనిముట్టు మాత్రమే అని అదివరకు అభిప్రాయపడే ఆ డాక్టర్ అదేస్త్రీని ఒకసుప్రభాతాన దేవీమూర్తిగా కొలవటంప్రారం భిస్తే ఆ గొప్పతనం స్త్రీదే'

'మీరు ఈ నవల చదివారేమిటి?' ఆశ్చర్యంగా అడి గాడు పక్కతను.

'చదివాను...ఇన్నాళ్ళనుంచీ నీజీవితంలో రకరకాల స్త్రీలు వచ్చిపోయినారు. వాళ్ళని ఆరాధించటంమాట అలా ఉంచి, కనీసం గౌరవమన్నా ఇవ్వనివాడివి ఇప్పుడీ ఆరాధన దేనికిస్తున్నట్లు - అని మిత్రుడు అడిగిన ప్రశ్నకి ఆ డాక్టరు ఇచ్చిన సమాధానం చదవండి'

'నా జీవితంలో సంధ్య సమీపిస్తున్నది - ఇంతవరకూ జీవితం తన నీలినీడల్ని నాకు ఇవ్వగలిగింది కాని, తనలో వెన్నెలరేఖల్ని తనలోనే దాచేసుకుంది. నేనే వెదికిఒక వెలుగు దారాన్ని చిక్కించుకున్నాను. ఆ దారం ఆధారంగా ఆవెలుగు

రేఖ మార్గదర్శకదీపంగా - అపూర్వమూ అనంతమూ - అయిన ఒక దివ్యశక్తిని అన్వేషిస్తాను. ఆ వెలుగు రేఖ స్త్రీ అవటం నా తప్పుకాదుగా. నిషిద్ధమైన నా వూహాని లోకం విమర్శిస్తే లెక్క-చేయనని నీకూ తెలుసు' అని చదివాడు పక్క-ఆయన.

'మరి ఇలాటి మనుషులకి రచయిత ఏంతీర్పుయివ్వగలడో మీరే చెప్పండి' అన్నాడు నటరాజన్.

తన నవలమీద రచయిత తనే అనేసంగతి అతనికి తెలియనప్పుడు చర్చించటం తమాషాగాఉంది అతనికి.

పక్కా-యన చిత్రంగా అతనివంక చూసి 'ఈ రచయిత అంటే నాకుచాలాగౌరవం.ఆగౌరవంలోనుంచివచ్చిందే ఈవిమర్శ... ఈమాట చూడండి; భగవంతుడిని తెలుసుకోవాలని ఉన్నప్పుడు సర్వాత్మనా ఒకమనిషిని ఆరాధించటం అనేది చాలామంది చేస్తారు... ఈమాటకీ అర్థం బోధపడటం లేదు నాకు' అన్నాడు.

నటరాజన్ నవ్వి 'ఏముంది, ఏకాగ్రతగురించి రచయిత అభిప్రాయం అది' అన్నాడు.

'అయితే, ఈ నీతి అవినీతులు నవలలో విమర్శించాల్సింది ఏమీ లేదంటారా?'

'ఉన్నదిగాని... కనీసంఒక్క-చెడ్డగుణంఅన్నా లేనిదే ఏ మనిషీ మంచివాడు కాలేడు అంటాడు అబ్రహాంలింకన్ ... ఏదో లోటున్నకపోతే అది ఉత్తమనవల ఎలా అవుతుంది?'

'అంటే మంచితనం బలవంతంగా రుద్దబడుతోందంటారా?'

'మంచివాళ్ళు మంచివాళ్లవటానికి మొదటికారణం పిరికితనం - రెండవది మంచికిఉన్న మెజారిటీ - మూడవది మంచివాళ్ళు అనిపించుకోవాలనే లోభం'

అంతేనంటారా?

'అంతే; అలాకాకుండా చెడ్డపనుల్నికూడా మంచి పనుల్ని చూసిన గౌరవదృష్టితోనే చూస్తే ప్రతివాడూ హాయికలిగించే చెడ్డపనులేన్నో చేసేసి, ఆ అర్థంలేని మంచిజోలికి పోవటం మానేస్తాడు'

'మరి ఈ నవలలోఉన్న ఫిలాసఫీసంగతి ఏమిటి?'

'నీవు హింస అని అనుకున్నది చేయక తప్పని ఒక కర్తవ్యం - దీనికి నీవు కర్తగా పరిగణింపబడినా, ఎంతమాత్రము కర్తవుగాదు. ఈ రక్తం ప్రవహించాలి-ఇంకిపోయిన ఈ రక్తవాహినులబలం పుంజుకుని శాంతివృక్షం మొలకెత్తుతుంది. అంతే సవ్యసాచీ అంతే. నీవు నిమిత్తమాత్రం అంటాడు శ్రీకృష్ణ భగవానుడు. అలాగే అవినీతికి భయపడి పారిపోకూడదు. ఆ అవినీతి తాలూకు దుర్గంధంలోనించే నీతి వృక్షపు పిల్లగాలి వీచి, మనిషిని సేదతీరుస్తుంది. హింసకీ శాంతికీ, ధర్మానికీ అధర్మానికీ - నీతికీ అవినీతికీ ఏదో అవినాభావసంబంధం ఉన్నది. మహామారణం తరువాత శాంతి ఏర్పడుతుంది - బ్రహ్మాండమైన అవినీతి పెరిగిన తరువాతనే మోసెస్‌కి పది దివ్యసూత్రాలు ఇచ్చాడు. భగవంతుడు. దీన్నిబట్టి చూస్తుంటే, అవినీతికీ అశాంతికీ మనం కృతజ్ఞులమై ఉండాలి' అన్నాడు నటరాజన్.

పక్క-ఆయన ఆశ్చర్యంగా నటరాజన్‌ని చూడసాగాడు.

ఇంకా ఆరగంటలో చనిపోయేంత బలహీనంగా ఉన్న ఈ మనిషి శరీరంలోని మేధస్సు ఇంత బలంగా ఎలా ఉన్నదో అతనికి చిత్రంగాఉంది.

నటరాజన్‌కి ఇన్నాళ్లనుంచీ లేని బలం ఏదో పుంజుకున్నట్లయింది. ఏదో చెప్పాలనే ఆవేదనా, అంతర్గతంగా అణగిపోయిన అతని సృజనాత్మకశక్తీ శతధా హెచ్చవేయబడి...పొంగుతున్నాయి. ఆ పొంగును అతని బలహీనశరీరం తట్టుకోలేకపోతున్నది - ఏదో మాట్లాడాలి.

'తమాషా ఏమిటంటే, యుగయుగాలుగా జరిగిపోతున్న ఈ మారణహోమానికి హోతా హవిస్సూకూడా మానవుడే- ఏదో పైశాచికహస్తం మానవుడిని తుగిడీలుతుగిడీలుగా ఆ యజ్ఞగుండంలోకివిసరివేస్తున్నది. నిజమైనశాంతి ఆ అవశేషభస్మంలోనుంచేమొలకెత్తుతుంది.అవిచ్ఛిన్నంగా ప్రవహించిపోతున్న ఈ జీవనస్రవంతిలో ఈ యుద్ధాలూ భూకంపాలూ వ్యాధులూ విధి కడుతున్న ఆనకట్టలు-యుద్ధం - తరువాత శాంతి తప్పదు. ఆ శాంతి భరించలేనప్పుడు మళ్ళీ యుద్ధం - మళ్ళీ శాంతి - ఇదే చరిత్ర. దీనికి చివర ఎక్కడో తెలియదు'

నటరాజన్‌కి దగ్గుతెరవచ్చి తేలికలోనే ఆగింది... మళ్ళీ చెప్పటం ప్రారంభించాడు -

'ప్రపంచంలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన సూత్రం ఏదయినా ఉన్నదీఅంటే - అలాటిదేదీ లేదనేది ఒక్కటే ఆ సూత్రం. కొంచెం సూక్ష్మంగా పరిశీలిస్తే, మన సాంఘిక వ్యవస్థలో ఏదో లోటు కనిపిస్తున్నది - అది ఇది అని

నిర్ధారణగా చెప్పలేని రచయిత - సూత్రపారంగతుడేగాని, సూక్ష్మస్రష్టగాని రచయిత ఆ లోటు చూసి బాధపడతాడు- ఆ బాధని లోకానికి వ్యక్తీకరిస్తాడు. అప్పుడు దానిని దిద్ద టానికి ఎవరో సాహసవంతులు కావాలి. ఎవరూ వినకపోతే దార్జన్యంచేసి వినిపించగల బలవంతులు కావాలి. అప్పుడే మనిషి ఒక మహోన్నతమైన జీవితవిధానాన్ని పెంపొందించు కోగలడు'

పక్కాయన ఫ్లాస్కులో కాఫీ అతనికి ఇచ్చాడు. ఆ కాఫీ ఎత్తి నోట్లోపోసుకునే ప్రయత్నంలో రైలుకుదుపుకి సగం ఒలికిపోయింది.

'పోనీ, కరిచిపట్టుకుని తాగండి' అన్నాడాయన.

నటరాజన్ నవ్వి 'మేము తమిళులం - కరిచిపట్టుకుని తాగటం నాకు అలవాటులేదు... ఆపైన నేను రోగిని ... అలా తాగకూడదు' అన్నాడు.

'మీరు ఎక్కడికి వెడుతున్నారు?'

'విశాఖపట్నం'

'మందు తీసుకోటానికా?'

'సెలవుతీసుకోటానికి!'

'మీరు మాట్లాడేది నా కేమీ తెలియటంలేదు. మీరు చాలా బలహీనంగాఉన్నారు, అయినా, మాట్లాడు తున్నారు ... నా కిందాకటినించీ అదే చాలా ఆశ్చర్యంగా ఉంది'

'నా మనసు చాలా తెలివితక్కువది సార్ - అది తన శక్తికిమించిన పనులు చేస్తూఉంటుంది'

'మీరు కొంచెంసేపు విశ్రాంతితీసుకోండి' అని పక్కా యన బెడ్డింగువిప్పి నడుంవాల్చాడు.

నటరాజన్‌కి గుండెల్లో నొప్పి ప్రారంభమయింది. ఈ మధ్య ఇంతసేపు తను మాట్లాడలేదు. ఆబాధకి అతని మెదడు కూడా నిర్జీవమైపోతున్నది. ఏవో ఆలోచనలు - అతనిలోని రచయిత పూర్తిగా ఉత్తిష్ఠుడైనాడు.

దూరాన ఎవరో పాడుతున్నారు. బహుశా పక్క పెట్టెలో గ్రామఫోను కాబోలు... ఆ కంఠంఅంటే నటరాజన్‌కి చాలా ఇష్టం - ఆ మహాగాయకుడి కంఠస్వరంలోంచి వస్తున్న దివ్య సందేశం మృత్యుసన్నిధిలోఉన్న తనకి ఒక ప్రబోధగీతం - ఒక సుందరమైన వేదాంతగీతిక - ఆ పాట అతనికి అపరిమిత మైన శాంతినిస్తున్నది.

గానసుధారసమే పరమానందదాయకమే మనసా
సామగానసుధారసమే పరమానందదాయకమే మనసా

అది విశ్వసంగీతం - దానికి హద్దులూ అవధులూ లేవు. మృత్యోన్ముఖుడైన ఆ బలహీనమానవుడి అంతర్యం మహతిగా మారి, ఆ గీతానికి అనుగుణంగా మ్రోగుతున్నది.

—ఆ నారద హనుమదాదు, లనవరతము ఉపాసించే
గానసుధారసమే పరమానందదాయక మో మనసా

అవును, చివరికి మిగిలేది - జీవితానంతరం పొందగలి గేది - అవునా కాదా అనే అనుమానం ఆఖరిక్షణంలో తీర్చివేసేది - భగవంతుడి స్మృతిగీతం.

గోవర్ధనగిరిపై గోపీమనోహరు డాల మేపుచు మురి యుచు గో గోపకులను ముగ్ధులచేయు మురళీగాన సుధారసమే పరమానందదాయకమో మనసా-

గానం ఆగింది - కాని అతని అంతర్యమే ఒక గాయ నిగా మారి, అలమటించటం ప్రారంభించింది.

ఈ నీరవ నిశీథంలో క్షణమాత్రం నా కన్నుల్ని జిగేలుమనిపించిన ఈ విద్యుల్లత - దూరదూరాల్నించి నా హృదయాన్ని మంత్రిస్తున్న ఈ నిశాగీతిక-వీటికి అర్థమేమిటి ప్రభూ! ఒక్కసారి తెర తొలగించు.

అతనికన్నులు ఒక కమనీయచిత్రాన్ని దర్శించటం ప్రారంభించినయ్.

ప్రతి ఇద్దరు గోపికలమధ్యా ఒకకృష్ణుడు, ప్రతి ఇద్దరు కృష్ణులమధ్యా ఒక గోపిక.

పక్కపెట్టెలో గ్రామఫోను.

'నారీ నారీ నడుమ మురారీ - హరికీ హరికీ మధ్య వయారీ' అని పాడుతున్నది.

తన భావోద్రిక్తతకి తనే బలిఅయిపోతున్నాడు నట రాజన్. దివ్యమూ సౌందర్యపూరితమూ అయిన లోకంలో విహరిస్తున్నాడు తను సృష్టించిన శిల్పసుందరిని తనే ప్రేమిం చిన శిల్పి అతను- తను చిత్రించిన కావ్యకన్నెను తనే ఆరా ధిస్తున్న కవి అతను. తనలోని నూతనరాగానికి తనే తట్టుకో లేని మహాగాయకుడు అతను.

అతను ప్రపంచంలోని అభాగ్య కళాకారులందరకీ ప్రతినిధి.

అశ్రుధారలనే వీణగా చేసి, పాటని ప్రేయసిగా భావించి విశ్వసంగీతాన్ని వినిపిస్తున్న ఉత్తమకళాకారుడు.

అంత్యసమయంలో ఒకసారి వెలుగుతున్న దీపశిఖ అతను.

అతనిమనసు భావిస్తున్నది 'ఈ సుఖనిద్రకి ఉపక్రమించబోయే సమయంలోకూడా ఈ పేదమనసు నిన్నుగురించే భావిస్తున్నది. ఆ స్వప్నమాధురిలో మునిగిన నా మనసు నీవు వచ్చి నా పక్కన కూర్చున్నది తెలుసుకునేస్థితిలోనుంచి జారిపోకమునుపే ఒక్కసారి వచ్చి నా పక్కన కూర్చుని వెళ్ళు.

అదిగో ఎవరో తనచేయి చాపుతున్నారు. ఆ చేయి పుచ్చుకుని కాంతిపథంలోకి దూకాలనే కోరిక బలవత్తరంగా ఉంది – ఈలోగా ఒకసారి కనిపించి వెళ్ళు –

జీవితమూ నేనూకూడా పూర్తిగా అలసిపోయాం. ఈలోగా ... ఒకసారి రా –

నటరాటన్‌కి చిన్న దగ్గుతెర వచ్చింది. ఆవెనువెంటనే మత్తుకమ్మింది. ఆ మత్తులో శ్రీరంగం ... చిన్నతనంలో చూసిన శ్రీరంగం – రంగనాథస్వామి.

అందమైన యువకుడు ఓరగా పడుకున్నట్లు శ్రీరంగనాథుడు – ప్రపంచపర్యవేక్షణచేస్తున్న శ్రీరంగనాథుడు – ఎంత అందగాడు స్వామి! ఎంత నల్లనివాడు స్వామి!

ఎంత చక్కని కన్నులు ఆ దొరవి. లోపలికి వెళ్ళి ఆయనపాదాలు తాకి,

'నా కేం కావాలో నాకన్న నీకే బాగా తెలుసు. నిన్నుచూస్తుంటే ఏమీ కోరాలనిపించటంలేదు. నాకు కావా

ల్సింది నువ్వు. లేచివస్తావా నల్లనయ్యా' అని ప్రార్థించింది అతని అంతర్యం.

తన స్వరచిత్రాలనీ – సర్వప్రాణాలనీ అతని పాదాల దగ్గర అర్పణచేసింది అతనిఅంతర్యం.

– సత్యం – సహనం – సుందరం – వీటి సమ్యగ్రూప మైన మరో మహాసృష్టిని స్వామిసన్నిధిలోసందర్శించగలిగింది అతని అంతర్యం.

ఇంకో దగ్గుతెర అతన్ని ఉక్కిరిబిక్కిరిచేసింది. దృశ్యంమారింది.

ఒక లోయ – స్త్రీహృదయంలా అగాధమూ అద్భుతమూ అయిన లోయ. అందులో రాగోదయం సూర్యోదయాలు వేస్తున్న అరుణవర్ణం–క్షయరోగి కక్కిన రక్తంలాటి అరుణోదయం. ఆ అరుణకాంతులమధ్య నందిత– స్వర్గదేవీ మూర్తిలాటి నందిత.

తన జీవితం ఇన్నిసంవత్సరాలు పురోగమించిన తరువాత – తనచరిత్రలో ఇన్ని అధ్యాయాలు పూర్తిఅయిన తరువాత – తనమేధస్సు యిన్నిసంవత్సరాల అనుభూతి అనుభవంగా అరిగించుకున్నతరువాత ఒక్కసారి వెనక్కితిరిగి – మృత్యువుకీ జీవితానికీ మధ్య రేఖమీద నిలబడి వెనక్కితిరిగి చూసుకుంటే – తను అనుభవించిన దరిద్రం, తను పొందిన సుఖదుఃఖాలు, తనుపొందిన రాగతరంగిణీ వెనుసుడులు – అతన్ని విచలితుణ్ణి చేసినయ్.

అయిపోయింది... ఇప్పుడు ఏం మిగుల్చుకుని తీసుకు పోతున్నాను?– ఈ జీవితం నా ప్రయాణానికి ఏం సమకూ

ర్చిందిః- ఒట్టిచేతులతోనే తన సుదీర్ఘయాత్రాపథాన్ని తరిం చాలి తను.

మరి జీవితానికి ఇదే పరమార్థమయితే జీవించటం దేనికి?

భగవంతుడు ఎందుకీ సృష్టి తలపెట్టాడు? ఇది అత నికి బొమ్మలాటా?

ఇంకా బొమ్మలాట ఆడుకునేంత పసితనంలోనే ఉన్నాడా భగవంతుడు!

అసలు ఉన్నాడా భగవంతుడు?

నీలగగనఘనశ్యాముడు - నల్లనయ్య - రంగనాథ స్వామి - వంశీమోహనుడు.

'నల్లనయ్య ఉత్త అల్లరిదొర - తనమీద సందేహం రాగానే విశ్వరూపం తొలుస్తాడు' అనుకున్నాడు నటరాజన్.

భగవంతుడినుంచి - సిద్ధాంతాలనుంచి - మతంనుంచి స్వేచ్ఛలేనిదే విముక్తిలేదు - అని తనే వ్రాశాడు ఒకప్పుడు.

కాని ఇప్పుడు - ఈ అంత్యసమయంలో - అతని నిరంతరాన్వేషణ - తిరిగితిరిగి పునర్వికసిస్తున్న జీవనవాంఛ- ఒకగమ్యానికి చేరుతున్నాయి.

అదే ప్రగతి - అతను అన్వేషిస్తూన్న సత్యానికి నీడ- అతను అధిరోహిస్తున్న సత్యసౌధానికి సోపానం - ఆ ప్రగతి సౌధాన్ని సంపూర్ణంగా అధిరోహించిన నటరాజన్ ఆ క్షణంలో భగవంతుడే అయినాడు.

బళ్ళున కక్కుకున్నాడు అతను.

కొన్ని క్షణాల్లోనే రైలూ చీకటీ కలిసి పెనవేసుకుపోయి నయ్. ఇక మిగిలిందల్లా రైలులోఉన్న ఒక దీపం... నిద్ర పోయిన కొందరూ - నిద్రకి ప్రయత్నిస్తున్న కొందరూ ఊహా తీత ఈ అంధకారసుందరి గంభీరరూపాన్ని అర్థంచేసుకునే స్థితిలో లేరు.

కేవలం రైలుశబ్దంతప్ప ఇంకేశబ్దమూ లేని ఆ ఏకాంత నిశీథిని కుపితరుధిరఉన్మత్తకాళీ కదనరంగంలా ఉన్నది - విరబారిన ఆమె కేశరాశితో భూమ్యాకాశాలు ఆచ్ఛాధిత మైనాయి.

ఆ మహా అంధకారాన్ని చీల్చుకుంటూ కాళీహాసనం లాగా దిగంతవ్యాప్తమైన కాలయవనికని ఛేదించుకుంటూ రైలు పరుగెత్తుతున్నది - అప్రతిహతంగా ఉన్మత్తయువతిలా రైలు పరుగెత్తుతున్నది.

రైలులో క్షీణమైన మూలుగు వినిపిస్తున్నది - అది ఎంతోదూరంనుంచి వస్తున్న - ఆపుకోలేని బలవత్తరమైన ఒక ఆహ్వానం - ఎన్నో అవాంతరాలనుదాటి విఘ్నాలను తప్పించుకుని - ఎన్నోలోకాలని అధిగమించి - మానవుడికి ఒకేఒకసమయంలోమాత్రమే వినిపించే విచిత్రమైనఆహ్వానం

ఆ ఆహ్వానపుగీతకి అలసట లేదు - ఎవరిని ఉద్దేశిం పబడినదో వారు వచ్చేదాకా అది అలసిపోదు - దానికి విరామంలేదు - విచ్ఛేదం అంతకన్న లేదు.

కొన్నాళ్ళనించీ దారితప్పి పరిభ్రమిస్తున్న ఒక బాట సారి - ఆ ఆహ్వానపుజాలువెనక తనమార్గం సరిచూచుకుని స్వస్థానానికి వెళ్ళిపోవాలని ప్రయత్నిస్తున్నాడు.

పక్కాయనకి మెలకువవచ్చింది - రక్తపు మడుగులో ఉన్న నటరాజన్‌తల చూచి హడిలిపోయినాడు ఆయన.

నోటిలోంచి ఇటూఅటూ కారిన రక్తం అతనితల కింద ఎర్రగా మడుగుకట్టింది...

'ఏమండీ... ఏమండీ... సార్ ... ఏమిటిది?'

అప్పటికే ఆ బాటసారి కేక వినపడనంతదూరం వెళ్ళి పోయినాడు.

అతనిజీవితమంతా పరిభ్రమించటంలోనే గడచిపోయింది. ఈ అనిశ్చితమైన జీవితంలో ప్రతివాళ్ళచేతా విసిగింపించుకొంటూ-జీవితాన్నిఏకోంచెంకూడాఅనుభవించకుండా ప్రయాణానికి సామానుసర్దేసుకున్న ఈ అభాగ్యపాంథుడి జీవితంలో - తప్పొప్పులూ లాభనష్టాలు ఒకేసారి బేరీజువేసి చూస్తే - అతనిత్రృష్ణనిగురించి వ్రాస్తే - అదృష్టవంతులూ బుద్ధిమంతులూ అయినవాళ్ళు అసహ్యించుకుంటారు.

ఏదిఏమయినా అతను ఇక ప్రయాణం ఆపుకోడు.

'అయ్యా... ఏమిటి?... ఇటు చూడండి' బలవంతాన పిలుస్తున్నాడు పక్కాయన.

చాలాదూరం తన ఖాళీజోలె భుజానవేసుకుని నడచిపోయిన ఆ బాటసారికి కొద్దిగా కేక వినిపించింది.

బలవంతాన వెనుదిరిగి 'నం... ది... త ... మెడి ... కల్ ... కాలేజీ...' అని మళ్ళీ ప్రయాణం ఆరంభించాడు.

రైలు ఆగింది - ఆకాశంలో చీకటివెలుగుల దాగుడుమూతలుకూడా ఆగిపోయినాయి.

ఆ పక్కాయన నటరాజన్ అచేతనశరీరాన్ని ఏమూలో మిణుకుమిణుకుమంటున్న ప్రాణదీపం కొండెక్కకుండా జాగ్రత్త పడి... మెడికల్ కాలేజీదగ్గర జట్కాదించాడు.

దింపటానికి సహాయంచేసిన బండివాడు 'బాబూ, ఈయనప్రాణం నాడే పోయింది' అన్నాడు, ఇక మెల్లిగా దించాల్సిన పనిలేదుగనుక, ఎత్తిపడేస్తూ.

పక్కాయన నిశ్చలంగా అతని శరీరంవంక చూశాడు - తల్లి గాఢనిద్రలో ఉన్నప్పుడు ఏడ్చిఏడ్చి అలసి పోయిన రోగిష్టిశిశువులా ఉంది అతని ఆంతర్యం.

ఈ నిర్జీవశరీరంలో కొన్నిక్షణాలదాకా స్పందించిన ప్రాణికి - ప్రపంచంముందు తలయెత్తుకు తిరగగల చరిత్ర లేదు - అతని ఆశయాలు ఫలించలేదు. కనీసం మృత్యుసమయంలోకూడా అతనికోసం ఏ కన్నులుగాని చెమర్చలేదు.

ఇంత నికృష్టపుచావు విశాఖపట్నం మెడికల్ కాలేజీ దగ్గర ఇతనికి వ్రాసిపెట్టిఉంది.

పక్కాయన గడియారం చూసుకుని 'చూడు అబ్బాయ్, నీ పేరేమిటి?' అన్నాడు బండివాడితో.

'అప్పలసాముండి'

'చూడు నాయనా, నే నిప్పుడే అలా వెళ్ళివస్తానుగాని ఈయన్ని కాస్త చూస్తూఉండు' అన్నాడు.

అప్పలసామికి బేరాలు పోతున్నాయ్ ... వాడు బుర్ర గోక్కున్నాడు.

'నీకు డబ్బుఇస్తానులే ... కాస్త ఉండు' అని అతనిసమాధానానికి ఆగకుండానే సాగిపోయాడాయన.

ఈ ప్రపంచంనుంచి సెలవుతీసుకోటమే తప్పనిసరి అయితే, ఆ పని మీ సమక్షంలోనే చేస్తాను...అని నందిత కిచ్చిన వాగ్దానం ప్రకారం అతను అక్కడికి ఎలాగో ఒకలాగ రాగలిగాడు.

కాని, నందిత లేదు...పిక్నిక్ కి వెళ్ళింది.

పక్కాయన - శవంవర్ణనఇచ్చి - ఈ ఉదంతం వ్రాసి పోస్టులోపడేసి...శవాన్ని మునిసిపాలిటీవాళ్ళ చేతుల్లో వది లేసి వెళ్ళిపోయినాడు.

కాసేపట్లోనే పట్టణ పారిశుధ్యశాఖవారి బండి వచ్చి ఆగి, ఆ దేహాన్ని తీసుకువెళ్ళిపోయింది.

# 21

'ఈ ప్రపంచంనుంచి సెలవుతీసుకోటమే తప్పనిసరి అయితే, ఆ పని మీ సమక్షంలోనే చేస్తాను అని అతను నా కిచ్చిన వాగ్దానం...సరిగ్గా ఈరోజునే నెరవేర్చుకున్నాడు మోహినీ - అప్పటినుంచీ ప్రతిసంవత్సరం ఒక పుణ్యక్షే త్రంలో అతడి ఆత్మశాంతికి భగవంతుడిని ప్రార్థిస్తున్నాను'

'నందీ, ఎన్నాళ్లు ఇలా వ్యధపడతావు?...నీ విప్పుడు వివాహితురాలివి..., కొంచెం ఆలోచించి ప్రవర్తించు... మరోప్రాణిని బాధపెట్టటం కూడా అంత మంచిదికాదు'

'కార్యకారణాల్నిగురించి విచారించాలని ఇప్పుడు నాకు అనిపించటంలేదు మనూ - సూచీభేద్యమైన ఈ శ్మశానలోకంలో కేవలం నే నొక పాంథురాలిని మాత్రమే'

మనూ ఆమెచెయ్యి నొక్కి సెలవుతీసుకుని వెళ్ళిపో యింది.

రాత్రి చాలాసేపటివరకూ నందిత అక్కడేకూర్చుంది.

వనాలు కొండలు వృక్షాలు మొదలైన వస్తువులమాది రిగానే రాత్రికికూడా ఒకరూపం ఉన్నది. ఈ సర్వలోకమూ అసహజంగా వికృతంగా విశ్రాంతితీసుకుంటున్నప్పుడు - రాత్రి తన రచన సాగిస్తుంది - సర్వప్రకృతీ ఊపిరిబిగపట్టి ఆ మెధ్యానానికి అడ్డురానడానికి భయపడుతుంది - ఆ మెకలం నుంచి ఏదో సౌందర్యప్రవాహం ప్రవహిస్తున్నది.

భూమినీ ఆకాశాన్నీ ఆవరించి - వెలుపలా బయటా వ్యాపించింది రాత్రి - అచింత్యమూ అనంతమూ అయిన మహా సౌందర్యమూర్తి రాత్రి.

సర్వప్రకృతికీ ఆశ్రయం - కాంతికి ప్రతిస్పందన జీవన లీలకు విచిత్రలయ - రాత్రి.

అందుకనే మానవుడి అనంతరజీవితం అంధకారంలో అణగిపోయింది. అతని పరలోకపుదారి చీకటిలో నిర్మిత మయింది.

అందుకే రాధాసుందరి - సర్వస్వమూ అయిన దివ్య మూర్తి నీలగగనఘనశ్యామసుందరమయింది.

రాత్రి ఇంత అందమైనదని నందితకి ఇదివరకు తెలి యదు... మృత్యువుకూడా బహుశా ఇంతసౌందర్యవతీ అవ టంవలననేనేమో నటరాజన్ ఆమెని ప్రేమించగలిగాడు.

ఏదోఒకరోజున ఆ మృత్యువు నన్నుకూడా సమీపిస్తుంది - అప్పుడు ఆమెదివ్యసౌందర్యానికి ముగ్ధురాలనై కన్నులు మూసుకుంటాను.

నిట్టూర్చింది నందిత.

'ఓ అంధకారసుందరీ...నీ వెవరు ? సర్వదుఃఖాలనీ భయాన్నీ వ్యధల్నీ పోగొడుతున్న ఓ అనంతసౌందర్యవతీ... ఒక్కసారి నీ కాళీఉన్మత్తరూపాన్ని నాకు చూపించు'

ఆక్రోశించింది ఆమెహృదయం.

మహా రచయిత్రి రాత్రి తనరచన సాగిస్తూనేఉంది.

* * * *

నా బ్రతుకు ఇంతవరకూ నిరుపద్రవంగా ఏనాడూ సాగలేదు - అనేకమైన పొరపాట్లు చేశాను. కష్టాలు నాకు తెలుసు - నా జీవితంలో జరిగిన ఏ సంఘటనకయినా బాధ్యురాలిని నేనే - ఆమాటకివస్తే దోషం నాదికూడా కాదని నా నమ్మకం. నా జీవితం ఏ గమ్యానికేసి హా...హా...కారాలు చేస్తూ పరుగులిడుతున్నదో...అదంతా విధివిహితం - అదే నా అంతర్యాన్ని వికలంచేస్తున్నది. దాని బాగోగుల్నిగురించి నేను ఆలోచించాలనికూడా: ఎంతమాత్రమూ అనుకోటంలేదు. అలా ఆలోచించినరోజున ఆ ఫలితాన్ని త్యజించనూలేను స్వీకరించనూలేను' అన్నది క్రిష్ణహారి.

మోహినీ ఆమెభర్తా ఆమెను కలుసుకుందామనే వచ్చారు రాధహారి రాయబారులుగా.

ఆ మందిరంలో ఒకమూల రాధాకృష్ణుల విగ్రహాలు ఉన్నాయి. ఇద్దరు ముగ్గురు బెంగాలీ వైష్ణవినులు ఆ విగ్ర హాలముందుకూర్చుని పూలమాలకడుతున్నారు. అసహ్యంగా ఆ వైష్ణవాంగనలుకూడా ఆ శ్యామసుందరుని సమక్షంలో దివ్యసుందరులుగా కనిపిస్తున్నారు.

వారు గొణుగుతున్న పాటఅస్పష్టంగాఉన్నది. చెవిఒగ్గి వింటేఇలా వినిపిస్తుంది.

'మూడునాళ్ళాయెరా! మువ్వగోపాల, నినుచూచి నే నింక నిలువజాలనురా...' తెలుగుపాట ... ఎవరిది?

మరో రెండుకంఠాలు - మదనగోపాల్ జయ జయ - యశోదానీలాల్ జయజయ - గోవింద గోపాల్ జయజయ - బెంగాలీకంఠాలు.

'మూడునాళ్ళాయెరా మువ్వగోపాలా, నినుచూచి నే నింక నిలువజాలనురా' తెలుగు కంఠం.

'మీనాక్షీ! దండగుచ్చటం అయిందా? అయితే వంశికి వెయ్యి' అని ఆజ్ఞాపించింది క్రిష్ణహరి.

తర్కదృష్టితో చూస్తే ఆమాటకి బొత్తిగా అర్థంలేదు - కాని అది వారి బలవద్విశ్వాసం. ఆ తీవ్రతముందరా - ఆ ఆరాధనముందరా - సర్వప్రపంచమూ సంకుచితమైపోతుంది. ఇంత పరిపూర్ణమైన విశ్వాసంతో ఆత్మార్పణచేసుకొన్నస్త్రీలు - రోజులతరబడి వంశీమోహనునికి సేవచేసి తరించామను కుంటున్న ఈ స్త్రీలు - నిజంగా ఉన్మత్తలు కారుగద!

భక్తి ప్రేమల ఏకాగ్రతలోపడి వీరి ఆత్మనివేదన మధురతుషారమై మాధవదేవుని పాదారవిందాలకి చేస్తున్న అభిషేకం కేవలం అసత్యం కాదుగద. ఏదైతే పొందాలని వారు ప్రయత్నిస్తున్నారో అదంతా శూన్యంకాదు - పొర బాటుకాదు - ఆత్మవంచన అసలే కాదు.

'నీవు అందరిలాంటిదానివి కాదని నాకు తెలుసు క్రిష్ణా... కాని భగవంతుడని నువ్వు భ్రమిస్తున్న ఈ బొమ్మ..'

మోహినిమాట పూర్తిగాకుండానే క్రిష్ణహరి తనచేతితో ఆమెనోరు మూసి 'భ్రమించటం ఏమిటి? ఆయన సాక్షాత్తూ భగవంతుడే... ఇలాంటిమాటలు ఇక్కడ అనబోకు మోహినీ' అన్నది.

మోహినికూడా కొద్దిగా సిగ్గుపడి

'నాకు సరిగా తెలియదుగాని.... మీరందరూ నిజంగా ఈ బొమ్మలో శక్తి చైతన్యం ఉందని నమ్మే దానికి....'

ఆమెమాట పూర్తికాకుండానే అడ్డి,

'నమ్మటం దేనికి? ఇదంతా మాకు అనుభవమే.... మీరంతా నాగరికతావ్యామోహాన్ని వదులుకోలేరు గనుక, ఇది మీకు తెలియదు. రక్తం మాంసం ఉన్న ఈ దిక్కుమాలినశరీరంలో తప్ప మరెక్కడా చైతన్యంలేదనుకోటం చాలా తెలివితక్కువ....' అన్నది క్రిష్ణహరి.

మోహినికి ఏంమాట్లాడాలో తెలియలేదు. మీనాక్షి ఎలా వచ్చి ఈ ఆశ్రమంలో చేరిందో కేవలం ఆ భగవంతుడికే తెలియాలి, కొన్నాళ్ళకిందట వారిద్దరూ ఒకరినే ప్రేమిం

చామని భ్రమించారు - ఈనాడుమాత్రం నిశ్చయంగా ఒక రినే ఆరాధిస్తున్నారు.

భగవానుడు- వంశీమోహానుడు పతితులూ అశోపహతులూ అయిన ఆ ఇద్దరుస్త్రీలమీదకూడా సమానంగానే వాత్సల్యాన్ని ప్రదర్శిస్తున్నాడు.

స్త్రీల పదభ్రష్టతనీ - పవిత్రతనుంచి అయే వంచననీ గురించి వివరంగా తెలుసుకోవాలనే వాంఛగాని ఇచ్ఛగాని వంశీమోహానుడికి లేదు. అసలు వాటినిగురించి అతను విననే వినడు. వైష్ణవసాధనలో అహం నశించటానికి మహావ్యక్తులు ఏదారిచూపించారో తెలియనివాళ్ళని వంశీ ఏమీ అనడు.

మనుష్యుడంటే గాఢమైన అసహ్యతకలిగినవారికి నమ్మకం కలిగించే మహామనీషి వంశీమోహానుడు.

అతనికి హారతిఇవ్వటం పూర్తిఅయింది. గొంతులన్నీ గోలగోలగా ప్రార్థిస్తున్నాయి.

మదనగోపాల్ జయజయ.

మోహానవంశీ జయజయ.

మూడునాళ్ళాయెరా మువ్వగోపాలా

నినుచూచి నే నింక నిలువజాలనురా,

నిందతి రాధా వాసగృహే...

నాథహారే జగన్నాథహారే

రాధనురా ప్రభూ నిరపరాధనురా

అనురాగభావనా మగ్న మానసనురా

కనరా కరుణించరా...

క్రిష్ణ తన్మయురాలై ఆ విగ్రహంముందు నిలబడిఉంది. మీనాక్షి కింద కూర్చుని చేతులుజోడించి ఏమని ప్రార్థిస్తున్నదో ఆ సర్వాంతర్యామికి అర్థంఅయింది.

'కొన్నాళ్ళకిందట... మిథ్యని ప్రణయంఅనుకుని నీచంగా విలపించాం. అదొక నిష్ఫలప్రణయదాహంతప్పమరేంకాదు. అజ్ఞానంచేత అదే సర్వస్వమనుకున్నందుకు క్షమించు.

'అనంతమూ- అవాఙ్మానసగోచరమూ అర్థవంతమూ అయిన నీ ప్రేమనుంచి మమ్మల్ని వంచకుల్ని చేయకు' అని ప్రార్థించింది మీనాక్షి.

'మనిషిని ప్రేమించటం చాలా అసహ్యాకరం - ఆ పొరపాటునించి నన్ను ఉద్ధరించినందుకు నీకు జోతలు. నీ సేవలో ఆనందంలో ఆరాధనలో గానంలో ఎందులోనూ నేను లోపంచేయటంలేదు ... అయినా సంధిగ్ధావస్థలోపడి ఇది సత్యమేనా అనే సందేహం అప్పుడప్పుడూ తలఎత్తుతూనేఉంది ... అది రాకుండాచెయ్యి' క్రిష్ణకన్నులనుంచి అశ్రువులు జాలువారినాయి. సర్వం సంగీతం - ఆవేదనతో వినవస్తున్న ఒకేఒక సకరుణాత్మకమైన ఆత్మనివేదన....

నాథ హరే జగన్నాథ హరే....నిందతి రాధా వాస గృహే నాథహరే జగన్నాథ హరే.

* * * *

'ఇప్పుడు చెప్పు కపర్దీ....ఈ కథ విన్నాక నీకు ఏమని అనిపిస్తున్నది?' అన్నాడు అరణి. కపర్ది మాట్లాడలేదు.

'యుగయుగాలనుంచీ ప్రవహించిపోతున్న ఈ రాగ జలధిని - ఆదీ అంతమూ లేని ఈ రాగజలధిని - తరగవెన కాల తరగగా జీవితాన్ని సరిగా ఊపిరికూడా పీల్చుకోనీయకుండా అడ్డుపడుతున్న ఈ రాగజలధిని ఎవరు సృష్టించారో ఎలా చెప్పగలం కపర్ది' అన్నాడు ఆరణి.

ఆలయంలో అమ్మ నవ్వుకుంది.

కపర్ది నిట్టూర్చి, 'ఇంత విన్నాకకూడా....నిషాలయిన ప్రేమానుభవం జీవితాన్ని వెలిగిస్తుందా? ఆర్పివేస్తుందా? అన్న సమస్యకి సమాధానం దొరకనేలేదు' అన్నాడు.

సిందూరరంజితఫాలా - చిన్మయరూపిణీ అయిన దేవి మానవుడిని చూసి జాలిపడింది. కాని ఆశీర్వదించలేదు.

'పోదాం పద, పొద్దుపోయింది' అని నిలబడ్డాడు ఆరణి. అతను పెద్దవాడయినాడు. చాలాసేపటినుంచీ కూర్చోటం వలన నడుంనొప్పిపట్టింది.

* *

'ఇప్పుడు నేను చెప్పినకథ యదార్థమని ఒప్పుకోటానికి లోకం బహుశా అంగీకరించకపోవచ్చును - అంతేకాదు - అపహసిస్తారు. అభిజ్ఞతకు అదే విలువ -నువ్వీ ప్రశ్న వెయ్యకపోతే ఈ కథ చెప్పేవాడినిగాను' అన్నాడు అతను.

కపర్ది మాట్లాడలేదు. కొండకెక్కేటప్పుడు ఉన్న భావాన్ని కొండమీద దేవిపాదాలదగ్గర విదిలించేసుకుని - నిశ్శబ్దంగా కొండదిగారు వాళ్ళిద్దరూ.

స మా ప్త ము